# ఉద్దేశ్యము

మంత్రము, బ్రాహ్మణము, అరణ్యకము, ఉపనిషత్తు - అని నాల్గు భాగములుగా ఉన్న వేదములో కడపటిది ఉపనిషత్తు. ఆ కారణమున దానికి వేదాన్తమని పేరు కల్గినది. వేదములోని బహుళభాగము ఐహిక పారలౌకికములగు ఫలములకు సంబంధించిన త్రిగుణాత్మకములగు కర్మములను బోధించుచుండ, వేదమునకు అంతమునయున్న యీ ఉపనిషత్తు మానవుడు త్రిగుణాతీతుడయి కర్మబంధము నుండి విడివడి, జనన మరణ రూప సంసారమును తరించి అమృతుడగుటకు త్రోవ చూపుచున్నది. ఈ అంశము భగవద్గీతలో ఈరీతిగ సూచితమైనది : ''త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున" వేదములు త్రిగుణములకు విషయము లగునట్టివి. పదపదార్థములయందలి జన్మముల కీ గుణ సంగమే కారణము. గుణములతోడను, తత్సంబంధములగు కర్మములతోడను సంగమున్నంతవఱకు జనన మరణములు తప్పవు. ఆ కారణమున చిరశాంత్యానందములను, అమృతత్వమును వలచు మానవునకు అవి అనుసరణీయములు కావు. నిస్త్రైగుణ్యమార్గమున పయనింపనెంచు బాటసారి కర్మబంధములను కాల్చివేయు జ్ఞానాగ్నినే దగుల్కొలుప వలయును. జీవితమును తమస్సులో నుండి జ్యోతిలోనికి, మృత్యువులో నుండి అమృతములోనికి ఉద్ధరించు ఈ జ్ఞానము, తత్ప్రాప్తి సాధనములు, ఉపనిషత్తులలో భూయిష్ఠముగా విస్తరింపబడినవి. కావుననే జీవిత సాఫల్యమును— పరమ పురుషార్థమును కాంక్షించు వ్యక్తి ఔపనిషదమగు తత్త్వమునే ఆరాధింప వలసి యున్నది.

ఉపనిషత్తులలోని తత్త్వము దర్శనకారుల దృష్టిభేదమును, అనుశీలనానుభవములను, స్వప్రజ్ఞను అనుసరించుకొని విభిన్నముగ తోచినది. భాష్యకారులును, తదనుయాయులగు వ్యాఖ్యాతలును దానిని బహుధా వికల్పించిరి. ఇందుకు కొందఱు చెప్పు కారణ మిది—“కొందఱి వికల్పములకు దేశకాలములు కారణమైనవి. ఆ యా కాలములందు అయ్యై దేశములందలి ఆ యా ప్రజల అభిరుచులకు, అర్హతలకు తగినట్లు తత్త్వమును ఆ యా ఆచార్యులు నిర్వచింపక తప్పినది కాదు. ఉన్నత లక్ష్యగాములకు పూర్ణతత్త్వమును అపరోక్షానుభూతికి తెచ్చుకొన్నగాని తృప్తి లేదు. విశ్వాసహీనులకు, అపరిణతబుద్ధులకు తత్త్వముయొక్క సమగ్ర స్వరూపము గోచరింపదు; గోచరింప చేయలేరు. ఈ స్థితిలో లోకమునకు తాత్కాలిక తరణోపాయమును ప్రదర్శింపక తప్పదయ్యెను. అట్టి తఱి తత్త్వమును సమగ్రముగ ఎఱింగిన ఆచార్యులైనను లోకసంగ్రహమును దృష్టియందుంచుకొని ప్రజాబాహుళ్యమును ఉద్బోధించియున్నట్లు గోచరించుచున్నది. ఈ దృష్టి ననుసరించి చూచిన ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు బుద్ధిభ్రామకములు కావేమో అనిపించును.” ఈ సమన్వయ వాదమున కొంత సత్యమున్నను, ఆ యా మతకర్తల వాదధోరణులను పరిశీలించిన, వారి హృదయములు భిన్నమార్గ గాములగుట తోచుచుండును.

వస్తుతః-తత్త్వము, దానిని బోధించు తత్త్వశాస్త్రము బహుళాంశములందు జటిలమని చెప్పక తప్పదు. ఏకత్వ పృథక్త్వముల రాశిగా తోచు దీనిని కేవలబుద్ధియంత్రముచేత తర్కింపజాలము. తర్కించితిమే యన్నను; తేజస్తిమిరముల వలెను, స్థితి గతులవలెను పరస్పర విరుద్ధములును, అనన్వయములును అగు వీని సమన్వయము బుద్ధి సాధ్యము కాదు. దేని నాధారముగ జేసికొని బుద్ధి స్వవిలాసమును నెఱపుచున్నదో అట్టి యాధారమును గూర్చి అది ప్రసరింపలేకుండుట వింత కాదు. అట్టి

స్థితిలో బుద్ధిగమ్యము కాని దీనిని బుద్ధి గమింపబోవుట అహంకారము తక్క వేఱు కాదు. అందుచేతనే దీనిని బుద్ధికి అతీతముగ ఋషు లనుభవించిరి. ఆ అనుభవమునే "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అని వేదాన్తవాణి నిర్వచించినది. వాక్కులకు, అంతఃకరణమునకు అందరానిదగుట, తత్త్వమును శూన్యమని తలంపరాదు. అది సత్తే. మఱి బుద్ధి వికల్పములచే భిన్నముగా తోచు అనేకమును కాదు. ఏకమే. ఈ "ఏకం సత్" అనేకముగా తోచు అవస్థయే మానవుడు ఎఱుంగవగిన పరమార్థము. "ఏకం రూపం బహుధా యః కరోతి." బుద్ధికి అందికాని, అందక కాని యేకము అనేకముగా నగు గారడిమంత్ర మొకటి కలదు. అదియే సంవేద్యము. "త మాత్మస్థం యేఽ ను పశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్." దాని నెఱింగిన వారికే శాశ్వత సుఖము. తదితరుల కంతయు అసత్కల్పము; దుఃఖబహుళము; జడప్రాయము.

ఔపనిషదమగు ఈ మహారహస్యము తర్కకర్కశమగు బుద్ధి కందెను, తపస్సాధ్యమగు అనుభవమును ఆకాంక్షించుచున్నది. తత్త్వ దర్శనము కలిగిన కాలదిగాని, ఏకత్వ పృథక్త్వముల సత్యముగాని, సచ్చిదానందముల సామరస్యము గాని అవగతము కాదు. బుద్ధి తెర వంటిది. ఈ తెర నాధారముగా చేసికొని క్రీడించుచుపఱకును-అందు నీడలో, వెలుగులో, వెలుగునీడలో గోచరించుచుండును. మంచువంటి యీ తెరను (నీహారేణ ప్రావృతాః) దాటి, అవ్వలిదగు ఆత్మతత్త్వములో చొఱబాఱుట అనుభూతి. ఉత్తమ తత్త్వదర్శనము ఇక్కడనుండియే ఆరంభమగును. జీవి యిచ్చటికి ఉద్ధరింపబడిన పిమ్మట, ఈ నానాత్వములకు, సదసత్తులకు సమన్వయము చేకూరును. "యస్మిన్ సర్వాణి భూతా-న్యాత్మై వాభూ ద్విజానతః." అన్న స్థితి యిది.

నామరూప విలాసము తత్త్వమును ఆచ్ఛాదించినది. వివిధవాద [illegible] నామరూపవిలా [illegible] తత్త్వము [illegible]ము. అంతవఱకును విశ్వైక్యమార్గము, ఆత్మభావము సున్న. అట్టితఱి సమన్వయ మెచ్చట ? ఇదియే "నామ రూపే విహాయ గచ్ఛంతి సముద్రేఽస్తం గచ్ఛంతి." ఈ వాక్యమునే ఉపనిషత్తు "తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్." అని తెల్పుచున్నది.

ఉపనిషత్తత్త్వ రహస్యమును యథాతథముగ ప్రకటించుటలో బ్రహ్మసూత్రములు ఉత్తమ మార్గమును త్రొక్కినవి. ఉచితమగు తర్కమును, సత్యమగు అనుభవమును దూరీకరింపక తత్త్వార్థమును సువ్యక్తము చేసినవి. అతిగంభీరమును, దుర్గ్రహమును అగు మాయావాదమును (అద్వైతమును) గుప్తముగ ప్రకటించుచున్న మాండూక్యోపనిషత్తు, తద్వ్యాఖ్యాన ప్రాయములగు మాండూక్య కారికలు ఉత్తమ తత్త్వ జిజ్ఞాసువులకు ఎంతయు సహకారులు. మాయావాద మనసిద్ధాంతమనియు, అయ్యది జగద్ద్రోహ మొనరించుచున్నదనియు విరసించు పెద్దలు గౌడపాదుల కారికలను పఠించిన తత్త్వరహస్యము నెఱుంగగలరు. ఉపనిషత్తులలోని అర్థమంతయు పిదుకుటచే ఏర్పడిన గీత ఒక ప్రస్థానమైనది. సూత్రప్రస్థానము ఉపనిషత్ప్రస్థానములతో కూడిన యీ ప్రస్థానత్రయార్థము ఉన్నదున్నట్లు భాష్యపఙ్క్తులలో వెలయించిన మహామహులు శంకర భగవత్పాదులు. ఈయన తన భాష్యములోని ఉపనిషత్సారమునే ప్రకరణ గ్రంథములయందును, స్తోత్రాదులయందును నిరూపించి తత్త్వార్థమును సులభ మొనర్చిరి. విశ్వరూపుడు 'నైష్కర్మ్యసిద్ధి' ద్వారమున

శాంకరవాదమును విస్తరించెను. తదుపరి విద్యారణ్యస్వామి ఉపనిషత్సి ద్ధాంతమునే శంకర నిర్వచనానుసారము 'వేదాంతపంచదశి' లో సామాన్య జిజ్ఞాసువులకును సుబోధమగునట్లు వెల్లడి చేసిరి. ప్రస్థానత్రయ భాష్యము లతోను, [illegible] ఈ చెప్పబడిన గ్రంథజాల మంతయు సంస్కృత భాషలోనిదే. ఆంధ్రభాషయందు చెప్ప దగిన వేదాంత సంప్రదాయసిద్ధ గ్రంథములు స్వల్పములు. ప్రస్థానత్రయ మును, పంచదశిని అనుసరించి వానికి ఛాయగా ఉండునట్లు రచింపబడి నది ఒక్క 'సీతారామాంజనేయసంవాదము' మాత్రము. ఇది ఉత్త మోత్తమ కృతియే కాని పద్యగ్రంథము.

శబ్దాడంబరముకాని కవితాపాకమును తత్త్వార్థమును ప్రకటించు ఆధ్యాత్మిక గ్రంథములు గద్యములో వెలువడినవి లేవు. సంస్కృతభాష లోని తత్త్వవాఙ్మయమును పఠించిన పాఠకునకు ఆంధ్రములో వెల యింపవలసిన ఆధ్యాత్మిక సారస్వత మెంతయో కలదని తోచకపోదు. ఆత్మదర్శనోదయమునకు ఇది ఒక కారణము. తత్త్వసిద్ధాంతమును సంప్రదాయము చెడకుండ కవితా వాసనా వాసితము చేసి లలితమును, హృద్యమును అగు భాషలో ప్రవచించుటయు, సామాన్య పాఠకున కేనియు విషయగ్రహణమున ఆసక్తిని, విసుగు లేమిని కలిగించి వేదాంత తత్త్వమును బుద్ధి కెక్కించుటయు కూడ ఇందు అపేక్షితము లయినవి. ప్రస్థానత్రయము, వేదాంత పంచదశి మున్నగు ఉత్తమగ్రంథజాలమును చదువుటచే సారరూపమగు ఏ జ్ఞానము బుద్ధిస్థము కాగలదో, అట్టి జ్ఞాన మును పాఠకునకు కలిగించి తత్త్వవిస్తరమును అవగాహింప పాఠకుని మేల్కొలుపుటయు ఉద్దేశ్యము. ఇందెంతవఱకు కృతార్థతయో తత్త్వజ్ఞు లగు పాఠకులే నిర్ణయింప నలంతులు. మంద మధ్య మోత్తము లని మూవి ధముల నలరారు సాధకులలో ఉత్తమాధికారులకు ఇయ్యది అత్యంతము

ఉపకరించునదియు, తక్కిన యిరువురకును ప్రబోధకమై యుండు నదియు ఆశించుట యగుచున్నది

ఈ గ్రంథమును రచించుటలో నాకు ముఖ్యముగా ఉపకరించినవి ప్రస్థానత్రయము, ఇతర దర్శనములు, వేదాంత పంచదశియు. మిక్కిలిగా ఉపకరించినది వేదాంత పంచదశి. ఇందలి ఒండు రెండు ప్రకరణములకు పంచదశియే మూల మయినది. ఆత్మ లింగాతీతము కావున లింగవచన కారకములతో కూడిన సంకుచితమగు భాషతో దానిని బోధించుటలో కొన్ని భాషా నియమములు సడలక తప్పవు. ఆత్మను గూర్చి చెప్పువట్టుల సమయానుకూలముగా పుం నపుంసక లింగములు రెండును వాడబడినవి. విషయము అతిగహనమును, జటిలమును అగుటచేత విస్మృతి కలుగకుండ సుబోధమగుటకై యిందు పునరుక్తి బుద్ధిపూర్వకముగా గ్రహింపబడినది. ఉదాహరింపబడిన ప్రమాణములకు కొన్నింటికి తాత్పర్యఖ్యాతమగు అర్థమే వ్రాయబడినది. కొన్నింటి భావములు తెల్పి తరువాత ప్రమాణవాక్యములు చూపనయ్యెను. ఇందు ఏ లవలేశమేని గుణ మున్నచో అది ఉపనిషద్ద్రష్టలగు ఋషులకును, తదర్థమును విస్తరించిన ఆచార్యపురుషులకును చెందినదనియు, తత్త్వమును, సిద్ధాంతములను బోధించుటలో గాని, వానిని భాషలో మలచుటలోగాని, భాషాశిల్ప విషయములోగాని యేవేని లోపములు వాటిల్లిన ఆ దోషములు నా వనియు భావింప పహృదయులగు పాఠకులు ప్రార్థితులు.

సత్తెనపల్లి,
1944

—గ్రంథకర్త.

# ప్రవేశిక

ఆత్మదర్శనము మానవ జీవితమునకు ఉత్తమోత్తమమైన లక్ష్య మని బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు మైత్రేయికి ఉపదేశించెను. అప్పటినుంచి దార్శనికుల కందరకు ఆత్మయే జ్ఞేయవిషయ మైనది. దర్శనమను శబ్దము దృశ్ ధాతువునుండి వచ్చినది. చూచుట యని ఈ ధాతువునకు అర్థము. ఒక వస్తువును చూచితి మనిన దాని స్వరూప స్వభావములు మనకు పూర్తిగా అవగతము లైనవని భావము. కావుననే యాస్కుడు "సాక్షాత్కృత ధర్మాణ ఋషయో బభూవుః" అని ఋషులనుగూర్చి పల్కినాడు. ధర్మసాక్షాత్కారము గలవారు వీరు. తత్త్వమే ధర్మము. ఈ తత్త్వము మనకు పలు విధముల భాసించుచున్నది. లౌకిక ప్రవృత్తిలో అనేకవిషయములు మనకు తాత్త్వికముగా గోచరించుట కలదు. స్వప్నసమయమున కన్పించునవి కూడ ఆ యనుభూతిలో సత్యమైనవే. త్రాడు పాముగా భాసించువేళ పామే నిజముగా అచ్చట ఉన్నది. ఈ అనుభూతులలో మనకు కన్పించు తాత్త్విక పదార్థములు తర్వాత తర్వాత అసత్యములుగా మనకే కన్పించుచున్నవి. అందుచే వివిధ దార్శనికులు త్రికాలములయందు సత్యముగానే ప్రకాశించు విషయము కలదా? యని విచారింప సాగిరి. ఆ విచారణలో పరమార్థసత్యము కలదని, అదే ఆత్మయని అద్వైత దార్శనికులు సిద్ధాంతింపసాగిరి.

ఈ సిద్ధాంతము శాస్త్రీయ గ్రంథములలో సంస్కృత భాషలో భూయిష్ఠముగా కలదు. ఉపనిషత్తులు సరళమైన శైలిలో నడచినవి.

2)

శ్రీ శంకర భగవత్పాదుల రచనలు అతి మధురమైన ధోరణిలో ప్రవహించినవి. వీనిలో అంతర్లీనమై యున్న శాస్త్ర రహస్యములను బయటకు తీసి విస్పష్టము చేయుటకు, ప్రతివక్షులను ఎదుర్కొనుటకు ఎందరో దార్శనికులు తర్వాత వచ్చిరి. కాని వారి రచనలు తార్కికభాషను ఆశ్రయించుకొనిన వగుటచే త్వరగా, తేలికగా లొంగునవి కావు. పైగా సంస్కృతభాషావాసన లేనివారికి ఉపనిషత్తులు సహితము నిష్ప్రయోజనములే యగును. ఇట్టి పరిస్థితులలో మన దేశీయభాషలలో మన దార్శనిక సంపద కల్పింపవలసిన యవసర మున్నది. ఈ అవసరమును గుర్తించి దానికి తగు కృషిచేయ సంకల్పించి, ఈ ఆత్మదర్శనమును తెనుగున రచించి, తెలుగువారికి శాస్త్రమును అందుబాటులోనికి తెచ్చిన శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులవారి యత్నము ప్రశంసనీయము.

సామాన్య మానవులకు అర్థమగునట్లుగా వేదాంత దర్శనమును చెప్పుట కష్టము. అట్లు చెప్ప యత్నించినవారు చాలవరకు మనము హేళనచేయు మెట్టవేదాంతమునే ప్రలపించినారు. ఈ బాధనుంచి తప్పించుకొనుటకు తీవ్రమైన శాస్త్రాభ్యాసము, అభ్యసించిన దానిని అవగాహనచేసికొనుట, అవగత విషయమును అనుభూతియను ఒరపిడి రాయిపై సువిశితము గావించుట కావలెను. దీనికితోడు చెప్పదలచుకొనిన భాష రచయిత స్వాధీనములో ఉండవలెను. ఈ అత్యవసర విషయములను రెంటిని కలిగియున్న శ్రీ వీరరాఘవాచార్యులవారు మనకు ఆత్మదర్శనమును చెప్పుట ముదావహము.

సిద్ధహస్తులైన శ్రీ ఆచార్యులుగారు ఆత్మదర్శన మీమాంసలో గల ప్రధాన విషయమును ప్రతిపాదించదలచి ప్రపంచ స్వరూప స్వభావములను మొదట అన్వేషించినారు. మన కనుభూతమగున దంతయు సత్, చిత్, ఆనందము, నామము, రూపము–అను ఐదు విధముల గలదు. వీనిలో

గల నామరూపములు మాత్రమే ప్రధానముగా ప్రపంచమున కన్పించుచున్నవి. నామరూపములను వదలితిమేని ప్రపంచమే లేదు. అట్టి ప్రపంచమున సహితము నేను, నీవు-అవి మొదలుగాగల శబ్దములచే వ్యవహరింపబడు ప్రాణిజాల మున్నది. ప్రపంచము నామరూపాత్మకమైన, నేను అని పిలువబడు జీవికూడ నామరూపాత్మక మగు వస్తువేనా? ఈ ప్రశ్నకు సమాధాన మొసగగోరి "నేను" అను శబ్దవాచ్యుడగు ప్రాణి యొక్క స్వరూపమును తర్వాత విచారించిరి. నేను అను నామము దేహేంద్రియములకు వర్తింపదు. ఈ దేహేంద్రియములలో అంతర్యామిగా నున్న ఆత్మను ఈ శబ్దము సూచించును. కనుక మూడు అధ్యాయములలో ఈ ఆత్మవిచారణ చేయబడినది. ఈ గ్రంథమున అతిముఖ్యమైన భాగములివి. ఇచట రచయిత చాల విస్పష్టముగా అతిక్లిష్టమైన విషయములను సరళ శైలిలో చెప్పినారు. మిగిలిన గ్రంథము ఈ అధ్యాయములపై వ్యాఖ్యవంటిది.

ఆత్మజిజ్ఞాసలో అనేక విషయములు రాగలవు. ఆత్మయే పరమార్థ సత్యము. ఇది అద్వితీయము అనునపుడు మనకు నానా రూపములతో భాసించు ఈ జగద్వైచిత్ర్య మేమి? ఇది యెచ్చటినుంచి వచ్చినది? దీనికి ఆత్మకు గల సంబంధ మెట్టిది? ఈ ప్రశ్నపరంపరకు శ్రీ శంకర భగవత్పాదులు అధ్యాస యను సూత్రమును సమాధానముగా ఇచ్చిరి. ఈ యధ్యాస స్వరూపమును శ్రీ వీరరాఘవాచార్యులుగారు చాల సరసముగా, సోపపత్తికముగా నొసగినారు.

గ్రంథములో విశేష వివరణములకు దిగినచో శుష్కతర్క ప్రలాపములు అధికము కాగలవు. దీనికి బదులు ప్రాచీనులు తమ అనుభూతులనుగూర్చి చెప్పిన వాక్యములను వివరించుచు, విమర్శించుట శ్రేయస్కరము. ఈ పద్ధతినే శ్రీ ఆచార్యులుగా రవలంబించి ప్రధానోపనిషద్వా

క్యముల ననేకములను వివరించినారు. బ్రహ్మసూత్రము లిట్టి ఉపనిష ద్వాక్య వివరణకే అవిర్భవించినవి. ఈ దృష్ట్యా చూచినచో ఈ ఆత్మ దర్శనము బ్రహ్మసూత్రములకు సంక్షిప్తమైన పరళవ్యాఖ్యగా తప్పించ గలదు.

శ్రీ వీరరాఘవాచార్యులవారి శైలి మధురమైనది. ఇంతకన్నను తేలికయైన భాషలో వ్రాయగలవారే. కాని వస్తుగభీరత భాషను కూడ కొంత మార్చుట సహజమే. తెనుగు భాషను చదివి అవగాహన చేసికొన జాలువారికి అద్వైతదర్శనము హస్తామలకప్రాయముగా ఈ గ్రంథమున కలదు. ఇట్టి దార్శనిక గ్రంథముల నితోధికముగా వీరు రచింప గలరని, ఆంధ్రప్రజానీకము వీరికి ఎక్కుడు ప్రోత్సాహ మీయగలదని చెప్ప జాలిన దీ ఆత్మదర్శనము. దీనిని రచించిన శ్రీ ఆచార్యులవారు ధన్యులు.

సాగర్ విశ్వవిద్యాలయము ౩౦-౭-'౫౮ } డా. పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి M. A., PH. D.

o—o

## కృతజ్ఞతలు

ఈ తృతీయ ముద్రణమున "అతీతభూమికలు" - "మోక్షము" అనెడి మఱి రెండు అధ్యాయములు అధికముగా చేర్పబడినవి. ఇవి ఉత్తమాధి కారులకు మిక్కిలియు ఉపకారకములు. దీని ముద్రణకు ధనసహాయము చేసిన T. T. D. వారికిని, సాహిత్యప్రవణమ్ములు శ్రీ S. రామాచార్యులు M. A. LL. B. (C. T. O కర్నూలు) ప్రభృతులకును కృతజ్ఞతాభి వందనములు.

# పీఠిక

ఈ ఆత్మదర్శనము, ఏనాడో 'శుష్కము' అని పేరువడిన వేదాంతమును తెలుపున దయినను 'నేను' ను అనగా ఆత్మను మధ్యబిందువుగా గ్రహించుటచే ఆ శుష్క వేదాంతము నార్ద్రము చేసి మధురముగా తెలుపుచున్నది. ఈ చిన్నపుస్తకము కడువేగముతో నడచు కథవలె పాఠకుని తన యదుపులో నుంచుకొనుచున్నది. తత్త్వగ్రంథముల కిది బంగారమునకు తావి. నడుమ నడుమ—అణు మహద్వాదము, ఏకజీవ వాదము మొదలగు ముడుల నీ గ్రంథము పీటముడుల గావింపక, కడు తేలికగా విడదీసి వేయుచున్నది. కఠిన ఘట్టముల వివరించుట కిది చేకొనిన ఉపాయము విద్యుచ్ఛిఖవంటి వేదశిఖ.

తన్ను దాను తెలిసికొనుటలో తాను, తన రూపు, తనకు కావలసినది, తన్ను దా జూచుటవలని ప్రయోజనము, సర్వమునందున్న తాను, తనలో నున్న సర్వము, తనయునికి, తన జీవితము: అనున వన్నియు నావశ్యకములు. ఇవియ యిందలి ప్రకరణములు. గ్రంథము ఈ'నేను'ను తర్కారణ్యములో దిగనాడక అరటిపండు నొలిచి చేత బెట్టినటులు విడబఱచి చూపెను. ఈ రీతిగా నీ ఆత్మదర్శన మాత్మదర్శనమే.

'నేను' లేనిదే 'నీవు' లేదు; 'నీవు' లేనిదే 'నేను' లేదు. ఈ రెండును అమడలు. ఈ 'నేను'లో రెండు నేను లున్నవి. ఈ క్రింది నేనును పై నేను చూచుచున్నది. ఈ పై నేను సంపూర్ణముగా అనుభవము కాకున్నను పొనపొన గోచరింపనిది కాదు:

బాహ్య, శారీర, మానసాభిమానముల యెడలను మనశ్శూన్య, జ్ఞాతృ భావములయెడలను మనము అవిశేషముగా 'నేను'ను వాడుదుము. వీనిలో తఱచుగా మన ముపయోగించు మానసాభిమానమగు 'నేను'లో ద్రష్టృ దృశ్యములు కలిసియున్నవి. 'నా కిది తెల్లగా కనబడుచున్నది' అను ప్రత్యక్షజ్ఞానమును విశ్లేషింతము. ఇందు 'నేను' ద్రష్ట. 'తెలుపు' దృశ్యము.

దృశ్యసామాన్యమును విడదీయుదము. ఇందు ప్రఖ్యా ప్రవృత్తి స్థితులు కానిపించును. ఇంద్రియజన్య జ్ఞానము, సుఖాదిప్రత్యయము, జ్ఞానముయొక్క పునర్జ్ఞానము: ఇవి ప్రఖ్య. జ్ఞేయములగు మనోభావములు లేక జ్ఞానములు 'నేను' కాననుట మానస ప్రత్యక్ష ప్రమితములు. ఈ దెస జ్ఞానరూపమగు దృశ్యము 'నేను' కాదు.

ఇచ్ఛాచేష్టాదివృత్తులు క్రియాశీలమగు దృశ్యము. 'నే నిచ్ఛగింతును' అని యందుము. కాన 'నేను' ఇచ్ఛ కాదు. ఇటులే చేష్టయు. క్రియాశీల మగు దృశ్యమెల్ల జ్ఞానమునకు విషయ మగుటజేసియే దృశ్యము. క్రియా జ్ఞాన శక్తుల శక్తిరూపావస్థ, అనగా అన్ని యింద్రియములయు శక్తి రూపావస్థయే స్థితి, లేక సంస్కారము. దీనివలననే 'నేను' అను దృఢ ప్రతీతి.ఇది స్థితిరూపమగు దృశ్యము. శక్తి నాది. ఏది నాదో అది 'నే'నగు టెటులు? ఈ రీతిగా జ్ఞాన, చేష్టా, ధృతి, లేక ప్రఖ్యా, ప్రవృత్తి, స్థితి, రూపమయిన దెల్ల దృశ్యముకాన ద్రష్టయగు 'నేను' కంటె వేఱు. కాగా 'నేను' జ్ఞాన, చేష్టా, ధృతులకంటె వేఱు. కాన వితఁడు - ఈ నేను - జ్ఞాత. ఇతఁడే ఈ పై 'నేను'.

'నేను న న్నెఱుఁగుదును' అని మనము సాధారణముగా వాడు దుము. ఇందు ప్రథమాంతమగు 'నేను'ను ద్వితీయాంతమగు 'నేను'ను

దృశ్యానువిద్ధములే. 'నేను' అను అహం ప్రత్యయమునకు మానసాక్షి మానముతో గూడిన నేను అమనది ఇచట దృశ్యము.

'నే నున్నాను' అనునదియు ఒకరీతిగా దృశ్యమే. ఇందలి మొదటి 'నేను' రెండవ అహం ప్రత్యయమునకు దృశ్యము.

'ఆత్మాన మాత్మ న్యవలోకయంతమ్' అమనెడ ఇచట ఒక యాత్మ దృశ్యముగా వాచ్య మయినను గౌణమే. ఈ రెండును జ్ఞ స్వరూపము. ఒకనిలో రెండు జ్ఞస్వరూపము లెటు లుండును? అది భాషలోని గారడీ.

ఈ 'నేను' బ్రహ్మ మెటులాయెనో యీ ఆత్మదర్శనము 'బ్రహ్మాత్మైక్యావగతి' అను ప్రకరణమున లెస్స వివరించెను.

'మతభేదమేకాని తత్త్వభేదము లేదు; వేదాంత పఠనము బుద్ధికి మెఱుగుతోముట కాదు, మఱి అనుభవమునకు దెచ్చికొని తోడివారిని పైకి తోడుటక'ని తెల్పు 'సచ్చిదానంద జీవనము' అను ప్రకరణముతో ఈ యాత్మదర్శనము ముగిసియు ముగియ నటులున్నది.

ఈ గ్రంథమునకు చాలవట్టు వేదప్రామాణ్యమే జీవగఱ్ఱ. బుద్ధి గిజగిజలాడుచోట నెవరయినను ఇటులే బుద్ధిని జోకొట్టవలెను. ఇదియ అందఱకును ఘంటాపథము. ఇందు బయనించుటవలననే యిది నవలవలె నవనవలాడుచున్నది.

ఇంతియకాక, యీ గ్రంథ మాత్మదర్శనమునకై అవస్థాత్రయము నందలి అనుభూతి మొదలగువానినిగూడ దోడుచేసికొని సమ్యగ్దర్శనమును చెప్పుచున్నది. ఇది మాండూక్యద్వారమున గౌడపాదులును, శంకరులును ప్రపంచమునకు చూపిపోయిన ఏకమూలిక. దీని వసరుతో ఆత్మ, ప్రతీతి మాత్రము కాదనియు, నిత్యజీవితమునం దందఱకు, ననుభవనీయ మనియు, నిశ్చపర్చిదము. ఈ యనుభవము అందఱకును ఒకటి. దీనికి

దృష్ట తాను. ఆ తాను అవిభాజ్యమైన ఒకటి. ఈ యనుభూతినిబట్టి ధీవి సాక్షిని కనుగొను యత్నము నిత్యజీవితమునకు పునాది యగునేని ప్రపంచమెల్ల నేక కుటుంబముగా నగుటకు దారి యేర్పడినట్లే.

గ్రంథకర్త చవిచూపని తీక్తరసము నంతయు చవిచూపుదు చాల దప్పు వచ్చితిని. గ్రంథమునేకాని గ్రంథకర్తను చూడనైన చూడనైతిని. గ్రంథముకంటె గ్రంథకర్త ఉత్తముడని చెప్పవలెనో? గ్రంథమే ఉత్తమము. ఇక గ్రంథకర్త?

చిరివాడ
కృష్ణాజిల్లా
9-4-1956

వేలూరి శివరామశాస్త్రి

—o—

# అభిప్రాయములు

మీ ఆత్మదర్శనము చాల ప్రశస్తమైన గ్రంథము. తత్త్వ జిజ్ఞాసువులు అవశ్యము పఠింపవలసిన పూజ్య మహర్షి సూక్తరాంశములతో, దివ్య పరిశీలనములతో, మీ గ్రంథము విరాజిల్లుచున్నది. నావద్దనుండి పలువురు మీ గ్రంథమును గైకొని, పఠించి పరమానందము నందినారు. పరమార్థ చింత గల ప్రతివాడును మీ గ్రంథమును పఠింపవలెనని కోరుచున్నాను.

— వేటూరి ప్రభాకరశాస్త్రి

ఈ గ్రంథము సమగ్రముగా చదివినయెడల అద్వైత సిద్ధాంతము సంపూర్ణముగా తెలియగలదు. గ్రంథకర్త సంపూర్ణమైన భాషాజ్ఞానము కలవారు. రచన మిక్కిలి రమ్యముగను, ప్రౌఢముగను, సుబోధకముగను ఉన్నది.

— పున్నవ లక్ష్మీనారాయణ

ఆత్మదర్శనములోని విషయ ప్రతిపాదన పరణి నవీనము. ఇది అవగతి అనంతరము వెలువడిన గీతి అనిపించును.

— జమ్ములమడక మాధవరామశర్మ

ఇట్టి గ్రంథములను వ్రాయుటకు శాస్త్రపాండిత్యమే కాక అంతరవలోకనముకూడ కావలసి యున్నది. ఈ రెండును సమకూడినను భావవాహకమగు భాష సిద్ధింపనిచో ప్రయోజనము లేదు. ఈ ఆత్మదర్శన గ్రంథకర్త యందు ప్రయోజనోద్దిష్టములు, అధికార సంపత్తి ఏండి లోటు కాదుచున్నదని ఒకటి రెండు పుటలు తిరుగవేసినను తెలియగలదు.

— భారతి

ఏ ప్రకరణమును తీసి చదివినను తత్త్వశాస్త్రాభిరుచి యున్నచో ముగించువరకును ఊరకుండజాలము. గ్రంథకర్త యొక్క యీ కృత కృత్యతను అభినందించుచున్నాము.

— రామకృష్ణప్రభ

అనేక మహోన్నత గ్రంథములచే గ్రహించవలసియుండు ఆత్మ దర్శనమును ఈ గ్రంథముచే సామాన్యులుగూడ సులభముగా తెలిసికొన వచ్చును.

— యథార్థభారతి

ఈ గ్రంథము తత్త్వశాస్త్రముయొక్క అగాథ కూపము గట్టుపై ఉంచబడిన విపానమువలె-అనగా తొట్టివలె సంక్షేపరూపమున అంపలి మధుర రసమును సులభముగా ఆత్మయాత్రికులగు పాంథుల కందజేయు చున్నది. నాస్తిక భౌతికవాదములే ప్రభుత్వము చేయుచున్న ఈ 20 వ శతాబ్దమున పండిత పామరులకు ఇట్టి గ్రంథములు అత్యంతము, అవసరమై యున్నవి. ప్రాచీన ఋషుల జ్ఞానదృష్టికి గోచరించిన సత్యసిద్ధాంతములు అవగాహన మొనర్చుటకు ఉపకరించు తత్త్వ వచన గ్రంథములలో నిది సమున్నత స్థానము నాక్రమింపగలదు. ఈ ప్రతి ప్రతివారి చేతిలోను, తలగడక్రిందను ఉండి నిరంతరము ఉపయోగకరమై వెలయునని కోరు చున్నాము.

— అరుణోదయ

గ్రంథకర్త తత్త్వశీర వారాన్నిధిలో పెద్దకాలము ఈది, వివిధ సిద్ధాంతములు చిలికి స్వతంత్ర మగు పంథాలో ఈ ఆత్మదర్శనము వ్రాసినట్లు పాఠకునకు విదిత మగుచున్నది.

— వీరబ్రహ్మ ప్రబోధిని

*

శిల్ప సాహిత్యములు నాకు జీవగఱ్ఱలు-
ఔపనిషద వనాలు విహారవీధులు-
ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము,
నడుపు మిటు నాదు జీవిత నాటకమ్ము!

*

# విషయసూచిక


| | | | పుట |
|---|---|---|---|
| 1. | ప్రార్థనాదికమ్ | .... | 1 |
| 2. | ఉపక్రమము | .... | 2 |
| 3. | ప్రపంచము | .... | 12 |
| 4. | నేను | .... | 21 |
| 5. | ఆత్మ | .... | 30 |
| 6. | ఆత్మ స్వరూపము | .... | 46 |
| 7. | నాకు కావలసినది | .... | 69 |
| 8. | ఆత్మదర్శన ప్రయోజనము | .... | 103 |
| 9. | సర్వాత్మ భావము | .... | 116 |
| 10. | బ్రహ్మాత్మైక్యావగతి | .... | 144 |
| 11. | బ్రహ్మము – గుహ | .... | 157 |
| 12. | సచ్చిదానంద జీవనము | .... | 170 |
| 13. | అతీత భూమికలు | .... | 187 |
| 14. | మోక్షము (ఉపసంహారము) | .... | 199 |

# ఆత్మదర్శనము

## ప్రార్థనాదికమ్

ఏకం సదేవ య దనిర్వచనీయ మాయా
సంబంధ మేత్య బహుధా ఘటతే జగన్తి,
స చ్చి త్సుఖై కరస మాద్య మతీంద్రియం తత్
త త్త్వం పరాఖ్య మనిశం హృది సంస్మరామి.

విశ్వోత్పత్తి స్థితి లయా ద్యఖిల క్రియాణాం
హేతుత్వ మేత్య నిగమైః పరిగీయతే యః
శ్రీ విశ్వకర్మ సముదంచిత సార్థ నామ్నా
తం దేవ దేవ మజ మీశ మనన్త మీడే.

అథర్వ శ్రుతి నేతారం శిలా శిల్పోపదేశకం
భజేఽస్మద్గోత్ర కర్తారం ప్రత్నబ్రహ్మ ఋషీశ్వరమ్.

కారుణ్య పూర్ణ హృదయాం కమనీయ గుణోజ్జ్వలాం
నమామి మాతరం నిత్యం పార్వతీం పార్వతీప్రియామ్.

అస్మ ద్వేదాన్త విజ్ఞాన హేతుం తాతం గుణోత్తరం
భజే కోటీశ్వరాచార్యం శిల్పవిద్యా విశారదమ్.

సనాతనర్షి సదృశం స్థాపత్య జ్ఞాన భాసురం
త త్త్వవిద్యా నిధిం వన్దే తత్త్వానన్ద యతీశ్వరమ్.

వేద వేదా న్త శాస్త్రాది విద్యా దేశిక స త్తమాన్
నత్వా శ్రుత్య న్త విజ్ఞాన సంప్రదాయకృతో గురూన్.

''ఆత్మా దృష్టవ్య'' ఇత్యేత చ్ఛ్రుతి వాక్యానుసారతః
ఆత్మదర్శన నామానం గ్రన్థం విరచయా మ్యహమ్.

—: ౦ :—

# ఉ ప క్ర మ ము

: * — * :

''అభిధ్యాయన్ వర్ణ రతి ప్రమోదా
న తి దీ ర్ఘే జీవితే కో రమేత''

—కఠోపనిషత్తు 1-1-28

మానవుడు విచిత్రమగు ఈ జగత్సముద్రమున ఈద నారంభించి పెద్దకాల మైనది. ఎంతకాలముగా ఈదినను ప్రపంచ పారావారమునకు అంతముగాని, ఒకదీవిగాని, వొడకట్టుట లేదు. వనువికి విశ్రాంతి యనునది లేదు. ఈ నాటి కి ప్రయాణము ముగియునన్న ఆస మొదలే సన్నగిల్లుచున్నది. ఈద లేక అలసి నిద్రించుచున్నప్పుడును మఱల ఆ సముద్రమే, ఆ తరంగ ఘోషణమే, ఆ జలజంతు జాలములవలని భయమే: ఎక్కడ ఏ తుపాను వచ్చి ప్రాణముల మక్కిరిబిక్కిరి చేయునో అన్న దిగులే. ఇంతయేల మఱల ఆ మొట్టమొదటి యీదులాటయే.

ఈ యాతలోనే మానవుడు చచ్చుచున్నాడు, పుట్టుచున్నాడు. తిరిగి యాతయే. చచ్చినను ఈతయే, పుట్టినను ఈతయే. చావు పుట్టుకలు రెంటికిని అతీతమగు మార్గమొకటుండి, అది లభించినచో ఈ ప్రపంచ పారావారము ఇంకిపోయి, యీదు శ్రమ తప్పునేమోకాని అంతవఱకును ఎటకేగినను ఈ జగత్సముద్రము సాక్షాత్కారమే. అందు చావుపుట్టుక లనెడి సుడిగుండములలో మునుగులాటయే. కాని, అట్టి అతీత మార్గము- అనగా ఈ రెంటిని మించిన తారక మార్గమొకటి కలదాయని సంశయము.

అట్టి త్రోవయే యొకటి ఉన్నచో ఉండుగాక. అది దొరకు వఱకును నరుడు పడవలసిన యవస్థ దుర్భరము. చూడుడు: లోకమా ద్వంద్వ సంకులము; మంచి చెడు, సుఖము దుఃఖము, వేడిమి చల్లదనము, మానము అవమానము, నింద స్తుతి, కలిమి లేమి, విధి నిషేధము, జననము మరణము, సంయోగము వియోగము, బంధము మోక్షము- ఈ విధమైన జంటలతో మానవునికి ఉపాదేయమును అనుపాదేయమును అయి యున్నది; అనగా జగతిలో నరునికి గ్రహింపదగినది కొంత; వీడదగినది కొంత. ఇంతియే కాదు. జగమనునది అనంతభేద సంకులముకూడ. ప్రపంచములోనున్న పలుజాతుల భేదముల నట్లుంచి ప్రత్యేక ప్రత్యేక జాతులను వస్తువులను పరిశీలించినను వానిలో సైతము సజాతీయములు, స్వగతములునైన భేదములు పెక్కులు. ఒక వృక్షజాతిని తీసికొని చూచిన వానిలో నెన్నిరకములుండునో చూడుడు. వానినట్లుంచి ఒక చెట్టుయొక్క స్వగతభేదములను గాంచిన, దానిలోని కొమ్మకును రెమ్మకును పోలిక లేదు. అట్లే ఆకునకు పూవునకు, పూవునకు పిందెకు, పిందెకు పండునకు, పండునకు గింజకు, గింజకు పై తోలునకు - ఎంతెంత భేదము పొడసూపునో చూడుడు.

ఒకదాని స్వగతభేదములనే గుఱుతించుటకు మన కసాధ్య మయినప్పుడు ఇక సజాతీయ విజాతీయ భేదముల నెట్లు విమర్శించి తెలిసికొన గలము? అహా! ఏమి సృష్టివైచిత్ర్యము! వింతయగు ఈ సృష్టిలో ఒకదానినిపోలిన వస్తువును మఱొక్కటిని కానము. లెక్క పెట్టుటకు అలవికాక అసంఖ్యములై అనంతములై యొప్పుచున్న ఈ పదార్థముల నెల్ల ఎక్కడ గుఱుతింప గలము? చూడ జూడ ఎంత సానాత్వము పృథక్త్వము ప్రోగుపడ్డదో చెప్పలేకున్నాము. చెప్పలేము. అసంఖ్యము లయియేగాక, అమేయములు (నిర్ణయింప వీలుకానివి) నై యున్న యీ పదార్థముల జ్ఞాన మెట్లు మానవునికి బుద్ధ్యారూఢము కాగలదు? ఎంత కాలమునకు నరు డీ పదార్థ విజ్ఞానమున కృతకృత్యుడై జ్ఞానసిద్ధి నంది ఇక తెలుగవలసినది లేదనుకొనును? ఈ సందర్భమున "సర్వపదార్థముల జ్ఞానమును మానవునకు కలుగకున్ననేమి, జ్ఞానహీను లగువా రే లోటును లేక జీవించుటలేదా" అను ప్రశ్నమొకటి తలయెత్తవచ్చును. కాని మనుష్యుడు జ్ఞానయాత్రలో వెనుకబడి యున్నంతవఱకు అతనికి సంతృప్తియనునది లేదు. అతని యంతఃకరణమునసున్న పరిమిత జ్ఞానము తన సంపూర్ణతకై తనకు విపరింపనలవిగాని వ్యథను పొందుచు ఎల్లప్పుడును జ్ఞానముకోసమై తొంగిచూచుచునే యుండును. మానవునిలో అజ్ఞానమేలేకున్న, జ్ఞానేచ్ఛయే లేదు. కొఱత యనునది పరిపూర్ణతకై యెల్లప్పుడును ప్రయత్నించుట ప్రకృతిసిద్ధమగు ధర్మము. కాబట్టి సర్వవస్తువులయొక్క, సర్వముయొక్క తెలివి(జ్ఞానము)కై మనస్సు తనకును మనకును దెలియకుండగనే ప్రయత్న మొనర్చుచున్నది. ఆ సిద్ధి అనగా అన్నింటియొక్క జ్ఞానము దానికి అలవడిననేకాని అది సంతృప్తి చెంది మెదలకుండదు. లేకున్న దాని చంచల స్వభావమును అది వీడదనుట నిక్కము.

ఇక 'జీవించుటలేదా, యన్న నరుని జీవనమును గూర్చి యించుక విచారింతము. జీవితములో జీవు దనుభవించు పరిశుద్ధమగు ఆనందము గాని, సౌఖ్యముగాని అంతగా లేదనియే తోచుచున్నది. ఏ లవలేశము సుఖమును మానవుడు తా ననుభవించుచున్నట్లు కన్పట్టినను, అది యెల్ల దుఃఖమిశ్రిమును భ్రాంతిజన్యమునేకాని, స్వచ్ఛమును నిరతిశయమును కాదు. ప్రాపంచికమగు ప్రతిసుఖకణములోను దుఃఖాణువులు కూడ సమ్మిశ్రములై కాలాంతరమున వాటి ప్రభావమును చూపుచునేయుండును. ఈనాడు తన సుఖమునకై శాంతికై ఆనందమునకై ఒనర్చినకార్యము దాని ఫలితావస్థ ననుభవింప బోవునప్పటికి విసపుకాయలను కాయు చున్నది. నరునియొక్క ఆశాసక్తులు దానితో భంగపాటు నందుచున్నవి. ఒకప్పుడు తాను అమృతభాండమని తలంచిన మధుపాత్రము ఇంకొకప్పుడు విషధారలనే కురియును. ఒకప్పుడు మంగళకరమని చేసిన సంకల్పము ఇంకొకప్పుడు తనకు అశుభజనకమే అగుచున్నది. ఈవేళ మిత్రుడగు వాడు ఇంకొకవేళ శత్రుడు. నేడు ప్రణయిని యగు సతి మఱొకనాడు దుఃఖదాయిని. ఒకపరి అనుకూలుడగు కుమారుడు ఇంకొకతఱి ప్రతి కూలుడు. ఈనాడు తన్ను వలచిన సిరి ఒండొకనాడు తన్ను కలచిన అరి. ఒకపట్టున అనుకూలమగునది వేఱొకపట్టున ప్రతికూలము. నరుని బాహ్య జీవిత యాత్రయందలి ఈ ఒడుదొడుకుల నట్లుంచి, మానసిక జీవనమును పరిశీలించినను నిరతిశయ సుఖముగాని,శాంత్యానందములుగాని విప్రచ్ఛరములుగనే వొడకట్టుచున్నవి.

సర్వ సంకల్పభూమియగు మానసిక క్షేత్రము మునిడి పండుల ముగ్గిజేయునో, రసాలఫలముల పండించునో యెవని కెఱుక! క్షణమున కొక సంకల్పము. నిముసమున కొక వికల్పము. ఒకతఱి ఊహాలవెంట ఊహలు, వేఱొకతఱి తలపన్నెడు అపోహలు. మనుజునకు వశమై

ఆతడు చెప్పిన చొప్పున నొనర్చు మాలిమి మనసను గుఱ్ఱమునకు లేదు. తన బలము పెంపువనే ఆది యజమానుని తన యిష్టమువచ్చిన అప మార్గముల బట్టించియు, కొండల దుమికించియు, పల్లముల బడవేసియు కంటకారణ్యముల కీడ్చి కలగుండువెట్టియు సుఖజీవిత ప్రయాణమును సాగనీయక, బ్రతుకుతెరువులేని వెతలకు బుద్ధి బ్రుంగిపోవ నరుని శాంతి భద్రతలను భంగమొనర్చుచున్నది.

మనోమర్కటము యొక్క పిచ్చి చేతలకు లెక్కయే లేదు. అది తలంచెడు తలపులు లోకములో లేనివి. అది కామించు వస్తువులు విశ్వమున దొరకనివి. దాని భోగ తృష్ణకుగాని ఆశాపాశమునకుగాని అంతమనునది లేనేలేదు. ఒక్క క్షణమేని అది విశ్రమించి తన పాలకునికి తీఱుబాటు చిక్కనీయదు. దాని సామ్రాజ్య నిర్మాణములు, దాని విశ్వవిహారములు, దాని గొంతమ్మ కోరికలు నిరవధికములై నిర్నిరోధములై సాగిపోవలసినదే. హితుని అహితునిగను, గ్రహింప తగని దానినేని స్వీకార్యముగను,స్వీకార్యమును అనుపాదేయముగను జేసి మానవునిపై తన ప్రభుత్వము చలాయించుటకీ పిశాచి వెనుదీయదు. అదిచేయు సృష్టి, దాని చేయు ప్రళయము విచిత్రతరములు.

తన తలపై మోదు మావటీడు దొరకనిచో ఈ మనోమత్త మతంగజము సేయు స్వైరవిహారమును ఇంతింత యని వర్ణింపలేము. ప్రపంచారామమును పాడొనర్చి, ఒరులు తమ్మునెనక వేఱవ అస్పృశ్యమై ఇది ప్రవర్తించుననుటలో అసత్యము లేదు. వినిర్మలమగు బుద్ధిని బూదిపాలొనర్చి, అహంకారమును మాత్రము తోడొనర్చుకొని మనస్సు చేయు వెఱ్ఱిమొఱ్ఱి చేతలను లెక్కింప బూనుకొన్నచో మన ప్రకృతము డిందుపడును. కావున అవశమైన ఈ మానసమునకు ఒక్క జోహరు పెట్టి యవ్వలి కరుగుదము.

ప్రాణియొక్క ఈ విధమైన మనోరాజ్యమునగాని, వెలుపలి ప్రపంచమునగాని శాంత్యానంద సౌఖ్యములకు తావున్నదా? ఇక నిట్టి జీవితము నరునికి కోఱకరాని కొయ్యయై మెడకు తగుల్కొనబట్టిగాని, దీనిని వదలించుకొని బంధములను త్రెంపుకొని బయటబడు నవకాశ మున్నచో అతఁ డేనాడో అట్టిపనిని సులభముగ చేసియుండునేమో? అట్లుకాక పూర్వము వర్ణించిన యీ ముఱికిగుంటనే స్వర్గముగ భావించి యెవ్వడేని 'సౌఖ్యమునే చూఱగొనుచున్నా' డని భావించినచో, అది యెల్ల భ్రాంతిమాత్రమని విజ్ఞులు తలంపకపోరు. సూకరమునకు తాను పొరలాడునట్టి బురదగుంట పన్నీటి చెలమ యయినను, జ్ఞానశీలు డగు మానవుడు అద్దానిని అసహ్యముగను అస్పృశ్యముగను భావింపకపోడు గదా? మఱియు సంసారసుఖములను మధురాతి మధురములని భావించునెట్టి ప్రపంచ ప్రణయికేని ఒండొకకాలమున అవ్వాని అపాత మాధుర్యము అంతమున కలుగు విపరీత పరిణామము సువ్యక్తములు కాకపోవు.

ద్వంద్వములతో కూడుకొన్న మానవజీవితమున సుఖానంద శాంతులు గగనకుసుమములు కావుననే యముని కతిథియై ఆత్మ తత్త్వమును తెలియగోరిన నచికేతుడు "అతిదీర్ఘే జీవితే కో రమేత" నశ్వర భోగములతోకూడిన దీర్ఘమగు ఈ జీవితమున ఎవ్వడు రమించు నముచున్నాడు. దీర్ఘముగాని హ్రస్వముకాని, ఉన్న జీవితకాలమును ప్రాపంచిక తృష్ణలకు గుఱిచేసి, అధ్యాత్మిక, అధిదైవిక అధిభౌతికము లనెడి తాపత్రయాగ్నులందే మనశ్శరీరములను తపింప జేయుచు. పాశవిక సుఖములనే నిరతిశయములుగను శాశ్వతములుగను భావించుచు వివేకియగు వాడెవ్వడు తన్ను గూర్చియు, తన వెలుపలి జగమును గూర్చియు, తనకు కావలసిన పరమప్రయోజనమును గూర్చియు

విచారింపకయును, దానిని సాధించు పనియందు నిమగ్నుడు కాకయు ఊరకుండును।

ఎంతవఱకు జీవితము మధురముగను మనోజ్ఞముగను తోచునో అంతవఱకును నరుని మానసమున జిజ్ఞాస, విచారణ అంకురింపక పోవచ్చును. ఏనాడు తన జీవితనాటకము నందలి లలితరసములు మఱుగుపడి, శోక బీభత్స భయానక రసములు అనుభోగ్యము లగునో; అథవా భ్రాంతివశమున తాను లలితములును సేవ్యములును అనుకొన్న రసములు వికటములగు రసాంతరములుగా పరిణమించునో; ఆనాడు మనసు కొఱవి ముట్టించినట్లు కాలగా, వెలుపల చెంపపెట్టు దిన్నట్లు విస్మయ విస్ఫారిత నేత్రములతో నరుడు 'ఇదేమా' యని జిజ్ఞాసకు మనసులో చోటిచ్చి ఆలోచనమునకు పూనుకొనును.

ప్రకృతిగతులు తనకనుకూలించినంతవఱకు, ప్రపంచ రంగమున తనమాట కెదురు లేనంతవఱకు, గృహపరిస్థితులుగాని, మనోవ్యాపారములుగాని, హృదయాహ్లాద కరములై సాగుచున్నంతవఱకు, ఇష్టావిష్టములు గులాములై కోరినరీతి చేకూరుచున్నంతవఱకు నరున కీ లోకయాత్ర నిరుపద్రవమైనదిగనే సౌఖ్యావహముగనే తోచుననుట ఆశ్చర్యముకాదు. ప్రకృతి యాతని కొఱగాని చేతలకు కినిసి పగ తీర్చుకొన పూనినప్పుడు, లేదా సహజములైన తన ధర్మములను తాను నిర్వహించుకొనువేళ, (అవి యాతనికి వ్యతిరేకములు అనిష్టాపాదకములునగుడు) ఇష్టప్రాప్తికి మాఱు అనిష్టము ప్రాప్తించు తఱి, తనకు ప్రియతమములని తలంచిన వానితోడ వియోగము సంభవించిన సమయమున, తన చిరకాలాభీష్టములు చేకూరు అవకాశములు దూరదూరము లగుచున్నప్పుడు, బాహ్యప్రపంచమునగాని, అంతరంగ జగత్తునగాని ఆనందకణలేశము శూన్యమగుడు, ప్రపంచము

దుఃఖాలయమో, అందు తా ననుభవించునది సుమధుర సౌఖ్యమో గోచరింప, మనుజు డొక్కసారి వెనుదిరిగి చూచుకొని తత్త్వ చింతనమునకు దారితీయును. ఏ వేళను తలలెత్తని విచిత్రప్రశ్నములు అతని యెడదంపలో అప్పుడు పొటమరించును. ఏ సమయమునను వెదుక బడని రహస్యములకై అతడు అప్పుడు పరితపించును. ఎట్టి ఘట్టముల నేని తలపున పొఱని భావన లప్పుడు హృదయాకాశమున విద్యుల్లతల వలె తళుక్కున మెఱయ సాగును. మానవు డప్పుడు ఇట్లు తలపోయ బూనును.

"ఈ ప్రపంచ మేమి? దీనితో నాకేమి సంబంధము? నేను ఇందొక పాత్రధారినై ఈ సుఖదుఃఖములను అనుభవింప నేల? ఇష్టము చేకూరిన ముఱిసియు, అనిష్టము పాటిల్లిన కినిసియు, మోదఖేదములను పొందు దురవస్థ నాకేల పట్టినది? మొదలీ యిష్టములను గోరునదియు, అనిష్టములను ద్వేషించునదియు నాలో ఎవ్వరు? ప్రేమాస్పదములను అన్నింటిని చుట్టును పేర్చుకొనవలయునను ఆశ నాకేల? నాకొకడు విరోధియు, ఇంకొకడు విహితుడు అను భేదభావము ఎటనుండి కలుగు చున్నది? స్వజనమునందీ మమకార మేమి? వారి సౌఖ్యమునకై పడరానిపాట్లు పడనేల? పరులన్న ఔదాసీన్య (ఉపేక్ష) మేమి? వారి కష్టములుగాని, మరణములుగాని నన్ను కలంపకుండుటకు కారణమేమి? నాది అనుకొని పెంచిన చిలుకను పిల్లి పట్టినంత చిత్తము ఉత్తలంపడి తత్తరింప నేల? ఆ పిల్లియే యింటిలోని యెలుకలను తుదిముట్టింప బూనుకొన్న దెంతమున కానంత మేల? వస్తుతః, ఈ స్వపర భేద మేమి? ఈ భేదము నభిమానించెడు నేను అనువా డెవ్వడు? అహో! ఏమి ఆశ్చర్యము! ఈ శరీర మేమి? ఇందలి మనస్సేమి? దాని తలంపు లేమి? అనుక్షణము నాలో పుట్టు ఈ గుణము లేమి? ఈ

గుణములకు ఆశ్రయమేద్ది? వీటిచేతనేనా నాకు సుఖదుఃఖములు? ఈ విషయము లింతటితో కదలించి విడువ తగినవి కావు. చిరకాల మాలోచించి తగు సమాధానము సతయుదును గాక.''

ఒక తరగతి చిత్తసంస్కారములు కలవాడు పై వికల్పములకు గుఱియై తన విచారమును సాగనిచ్చును. ఇంకొక మెట్టు పైనున్న మనుజుడు తన్నుగూర్చిన ఆ విచారమును విశ్వము మీదికికూడ త్రిప్పి ''ఈ విశ్వమేమి? ఇందలి నానాభూత సంతతులేమి? ఈ సూర్యచంద్ర నక్షత్ర తారకాది గోళములేమి? ఈ పుడమి యేమి? ఇందలి నదీ నద సముద్ర పర్వతారణ్యము లేమి? ఈ అసంఖ్యాక ప్రాణు లేమి? నేనెవ్వరు? నా చుట్టునున్న యీ బలగమేమి? నాకీ జగమున కర్తవ్యమేమి? నే నేల పుట్టితిని? ఏల చావ నున్నాను? చచ్చులోపల సాధింప వలసిన దేమి? నా కేమి కావలసియున్నది?'' అను ప్రశ్నములతో అణువు మొదలుకొని బ్రహ్మాండము వఱకును బుద్ధిని వ్యాపింపజేసి ఆత్మతత్త్వముతోపాటు విశ్వతత్త్వమునుకూడ ఆకళించుకొన చూచును. విశ్వసృష్టి ప్రణాళిక నంతటిని అన్వయించుటకును, తదర్థమును అవగాహన సలుపుకొనుటకును ప్రయత్నించు మానవుని సాహసము దొడ్డది. పెద్దవారు చెప్పునట్లు శ్మశానవైరాగ్యముపలెగాక, యథార్థతత్త్వాన్వేషియగువాని మార్గము మొట్టమొదట ముండ్లతిప్పలతో పొదివి కొన్నదైనను, పోను పోను నిష్కంటకమయి యీ యాత్రికుని గమ్యస్థానమున చేర్చితీరును.

మానిసి బ్రతుకులో తియ్యదనము చచ్చి, చేదు బలిసినప్పుడే సృష్టిరహస్య విచారణకు అతడు పూనుకొనునని అనుకొన్నను, సహజముగనే జిజ్ఞాసువు లగువారును కొందఱుందురు. ఇట్టి వీరు పూర్వజన్మముల

యందైనను ఈవిధమైన అరుచికిని, విషయ వితృష్ణకును పాల్పడి క్రమక్రమముగ జ్ఞానమను వెలుగున ఒక్కొక్క దానిని పోల్చుకొనుచు మనకు కన్పట్టు తఱికి జిజ్ఞాసావస్థతో నుండి యుందురు. అట్లునుగాక, కారణజన్ములైన మహనీయులు అవతారపురుషు లనియు,విశాల భూప్రజను సముద్ధరించుటకుగాని ఇట్టివారి పుట్టుక కలుగదనియు యుగ యుగముల నుండియు పెరిగిన మానవుని అనుభవమే చాటుచున్నది.

ఏది యెట్లైనను జగమను సముద్రమున, చావుపుట్టుక లనెడి సుడిగుండములలో పడి కొట్టుకొని పోవుచున్న మానవునికి, అజ్ఞానాంధ కార నిమగ్నుడయి, తాపత్రయ దుఃఖములచే క్రుంగి ఆనందజ్యోతికి నోచుకొనక వాపోవు నరునికి సంసార సముద్రముయొక్క ఒడ్డును జేరుట, అందు ఏ చెట్టు నీడనో ఆశ్రయించి విశ్రమించుట అనుకృత్య ములు అవసరములు కాకపోవు.

తన్ను గూర్చియు, తనకి శరీరముతోడి బంధమును గూర్చియు విచారించుటకును, ఆ బంధమును వదలించుకొని నిత్య నిరతిశయ సుఖస్వరూపుడయి తేజరిల్లుటకును, తన హృదయమున ఆవరించియున్న అజ్ఞానాంధకారమును విదళింప జ్ఞానజ్యోతిని వెలిగించుకొనుటకును, ఈ అనంత విశ్వమునందు అణుమాత్రమై యున్న భూమండలమున ఏ సూక్ష్మ ప్రదేశముననో పరమాణువునకంటెను సూక్ష్మాతి సూక్ష్మరూపుడై యున్న తాను, అనంత విశ్వమయు డగుటకును, అట్లయి అఖండ సచ్చిదానందములను ఆత్మజీవితమున అపరోక్షానుభూతికి తెచ్చుకొని మర్త్యత్వములోనుండి అమృతత్వములోని కుఱుకుటకును జిజ్ఞాసువగు మనుష్యుడు ఉత్సాహము చూపకపోడు. ఈ సమస్యలే ఎట్లెట్లు-ఎంతవఱకు చిక్కు విడునో విచారించి చూతము.

—o—

# ప్రపంచము

"సర్వాణి రూపాణి విచిత్య ధీరః
నామాని కృత్వాఽభివదన్ యదాఽస్తే"

— యజురారణ్యకము

ఈ ప్రపంచము, ఇందలి 'నేను' ఈ 'నాకు' కావలసినది, ఏవియో నిర్ణయించుకొనుట మానవుని మతము; అతని చిరాకాంక్షితము. తదుపరి, అనగా తా నెవ్వడో నిర్ణయమైన పిమ్మట, తనకు కావలసిన ప్రయోజనము కూడ తెలిసిన తరువాత, దానిని పొందుటకు అనువగు రీతిని తన జీవితమార్గములను, నడవళ్ళను ఏర్పాటుచుకొనుట నరుని కర్తవ్యము. ఇదియు మతాంతర్గతమైన కార్యమే. ప్రాచీనకాలము నుండియు మానవీయ మతాభినివేశము ఈ లక్ష్యమునే చాటుచున్నది; దీనినే పురస్కరించుకొని ఇద్దాని సంసిద్ధికే పాటుపడుచున్నది. ప్రపంచము కన్నులు తెఱచి, వానిని విశ్వముమీద సారించిన నాటినుండి, వేదములు, ఉపనిషత్తులు ఉపలబ్ధములై జిజ్ఞాస సాగిననాటి నుండి ఈ సమస్యలు తాత్త్వికులను ఎదుర్కొని ఉచిత సమాధానములను పడసి పరిష్కృత ములై తనరారుచున్నవి. ఉత్తమ మానవజీవిత ప్రణాళికయు ఒకటి సిద్ధ మయి సమాజమును నడపుచున్నది.

చిరకాలము క్రిందనే సమాధానము లొసగబడిన యీ ప్రశ్నలు, పరిష్కరింపబడిన యీ సమస్యలు నిత్యనూతనములును, జటిలములునై మఱల మఱల మానవుల నెదుర్కొనుచునే యున్నవి. ప్రతి మనుజుడును

జీవనపు బాటలో ఎదురు దెబ్బలు తిన్నప్పుడు వీటినే తడవుచున్నాడని పూర్వాధ్యాయమున చదివియుంటిమి. ఎన్నడో చిక్కులు తీర్పబడి నిత్యానుష్ఠానమున క్షుణ్ణములైన యివి క్రొంగ్రొత్తలై మఱల మఱల తలసూపి, మత లక్ష్యములను జాఱవిడుచుకొని స్వేచ్ఛాచారియైన మానవ నామధారి నెదుర్కొనుటలో వింత యేమున్నది? ఇందుకు మొదటి కారణము తత్త్వసంబంధ మూలసూత్రములను అర్థము చేసికొని అను ష్ఠింపకపోగా, తెగద్రెంపి యిచ్చవచ్చిన వడువున తిరుగులాడుట; రెండవది, చిన్నప్పటి నుండియు చేబూనవలసిన ఆధ్యాత్మిక రసాయనపు గిన్నెను బోరగిల ద్రోసికొనుటచే రక్తనాళములును మనస్సును వలసిన బలిమి కలిమికి దూరమగుడు, సంప్రదాయ సిద్ధమగు తత్త్వానుభవము చేకూరక, లోకమున నగపడు నానాత్వముల వెంటబడి పరిభ్రమించుటచే నలువైపులను దుఃఖార్ణవములను సృజించుకొనుట. ఈ విధమైన సంసార పంకమున చిక్కుకొన్నవాడు సముద్ధరింప బడుటకై పరితపించుట సమంజసము కాదా? నేటి మానవ జీవనసమస్య ఈ స్థితిలో నున్నదని గ్రహించుట సులభము.

పైని నుడివిన మన ఆత్మాపరాధము నటుంచి చూచినచో సమస్యలు మిగుల జటిలములని గ్రహింపగలము. ఈ చిక్కుతీఱని సమస్యలు ప్రత్యేక ప్రత్యేక మానవవ్యక్తులను ఎదుర్కొని వారిచే ఆలో చితములై వారి ప్రజ్ఞావిచారముల బలముచేత సమాధానముల నందిననే గాని సుపరిష్కృతము లైనట్లు కావు. ఈ సందర్భమున శాస్త్రముగాని సంప్రదా యము గాని సహకారము,సాహాయ్యము చేసిన చేయవచ్చును. కేవల శాస్త్ర పఠనము, సంప్రదాయ విజ్ఞానము సాధకుడు అభినివేశపరుడు, అనుభవ పరుడు కానిచో అర్థములగుటకు మాఱు అపార్థము లగుటయు సంభ వించును. అందుకే తత్త్వశాస్త్రము విశిష్టుడగు అధికారిని కోరుచున్నది

గాని, జనసామాన్యమును పలచుటలేదు. కాబట్టి, ఏ విషమ సమస్యగాని స్వీయానుభవమున తర్కింప బడినదేగాని, చిక్కువిడక వోపమిచే, ప్రాచీనకాలమున సమాధానింపబడినను,ఇవి నిత్య నూతనము లగుచున్నవి. కావున హృదయ సంస్కారమనునది ప్రస్తుత జిజ్ఞాసా విషయమున అవశ్యక మగుచున్నది. సంస్కారము కలవానికి సంప్రదాయ బలము,శాస్త్ర సాహాయ్యము లేకపోవుట తీరని లోటు. సత్సంస్కారములు, సత్సంప్రదాయము,శాస్త్రసాహాయ్యము, ఆత్మస్మృతి-అనువాని సమ్మేళనము బంగారు పరిమళించుట. అగుగాక. ఈ విచారణ నటుంచి ఇక ప్రకృతము ననుసరింతము

మున్ముందు ఈ ప్రపంచ మన నేమో విచారింతము. ప్రపంచ మును గూర్చి 'ఇద మిత్థ, మని నిర్వచించుట మానవునికి కష్టసాధ్యము గనే తోచుచున్నది. బ్రహ్మాండగోళమున అనంతమై అనూహ్యమై కన్పట్టెడి ఆకాశప్రదేశము, అందలి నానా నక్షత్ర తారాగ్రహములు, వాయువు, అగ్ని, జలము, భూమి, భూమియందలి వివిధములైన స్థావర జంగమములు, వాని యందలి భేదములు, అంతర్భేదములు, అహో! ఎన్నని లెక్కింపగలము! విపరీతభేదములతో పరమాణువు నుండి మహత్తువఱకు నానా ప్రకారముల నొప్పు వస్తుజాతముతో నిండిన దీ విశ్వము. దీని యందలి పదార్థజాలమును ఒకదాని తరువాత ఇంకొక దానినిగ లెక్కించి, వాటి తత్త్వమును నిర్ణయింపవలె నన్న మానవుని ఆయువు చాలదు. అతని మనోబుద్ధులు పరిశ్రమింపజాలవు. కావున ఈ నానావిధ పదార్థముల నన్నిటిని ఒక కొలత పాత్రలో పోసి కొలిచి గాని, లేదా ఒక త్రాటితో అంటగట్టి కాని అవ్వాని మూలమున ప్రపంచ మన నేమో స్థూలముగనైనను నిర్ణయింపజాలము.

పంచభూతములతో కూడుకొన్నది ప్రపంచమని పూర్వులు ఈ జగమునకు ఒక నిర్వచనము నిచ్చియున్నారు. శబ్ద స్పర్శ రూప రస గంధములే గుణములుగాగల ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి–అను పంచభూతములనెడి ద్రవ్యములతో జగమేర్పడుచున్నది. తార్కికులు దిక్కాలాత్మ మనస్సులను కూడ కలుపుకొని ద్రవ్యములు తొమ్మిదన్నారు. సాంఖ్యులు బ్రహ్మాండసృష్టికి హేతుభూతములైన తత్త్వములను ఇరువది నాలుగుగా లెక్కించిరి. పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, బహిరంతర్భేదములతో నొప్పు ఏకాదశేంద్రియములు, ఇంద్రియగోచరములైన శబ్ద స్పర్శాది విషయములు– ఇరువదినాలుగు అగుచున్నవి. ఇందు అవ్యక్త మహదహంకారములు – పంచభూతములును కలసి ఎనిమిదియు అష్టప్రకృతులనియు, తక్కిన పదునాఱును వికృతులనియు చెప్పుదురు. ఈ విస్తరము సాంఖ్యాది శాస్త్రములను పరిశీలించి యెఱుంగదగును.

పంచ మహాభూతముల యొక్క వికారమే జగ మగుటచే పాంచ భౌతిక మనియు భౌతికమనియు దీనిని పిలుచుచున్నాము. సూర్య చంద్రాది నక్షత్రగోళములు ఎన్నియైన నుండుగాక. అవి యన్నియు అగ్ని భూతము యొక్క వికారములే కావున, వాటిని జ్యోతిర్మండలములనియే చెప్పనొప్పును. నేలనుండి పుట్టు వృక్ష లతా గుల్మాదులు, శిలా ధాతు లోహాదులు, గంధగుణయుక్తములగు ఇతరవికారములును పార్థివము లగుచున్నవి. రస ప్రధానములైన వికృతులును, నదీనదసముద్రాదులును జలమయములు. అట్లే తక్కిన భూతములయొక్క వికారములను కూడ ఊహించిన, జగమనునది ఈ భూత భౌతికములకంటె వేఱగు పదార్థములచే ఏర్పడుట లేదని తెలియవచ్చుచున్నది. ఇక ఈ భౌతికవస్తువుల తత్త్వపరిశోధనమును కూడ పదార్థ విజ్ఞానశాస్త్రము చాలగా శ్రమించి యున్నది, శ్రమించు

చున్నదనుట మన మెఱుగనిది కాదు. కావున ఈ దిఙ్మాత్రమగు విమర్శ చేత ప్రపంచమును పాంచభౌతికముగా ఎఱింగితిమి. ఇంకను సూత్ర ప్రాయముగా దీనిని తెలియుటకై యత్నింతము.

ప్రపంచములోని పదార్థజాలము నంతటిని మనము అయిదింద్రియములచే ఎఱుంగుచున్నాము. బాహ్య జగత్తునందలి అన్ని వస్తువులును ముక్కు, కన్ను, చెవి, నాల్క, త్వక్కు, (చర్మము) అను నీ పంచజ్ఞానేంద్రియములకును విషయములై తీఱవలసినదే. నేత్రమునకు తోచునదెల్ల రూపప్రపంచము; ఆకారముగల వస్తువులన్నియు కంటిలో దూరకతప్పదు. రసముల నన్నింటిని జిహ్వచేత ఎఱుంగుదుము. కావున రసప్రపంచము రసనకు విషయము. గంధముల నన్నింటిని ముక్కుచే తెలియుచుండుటచే ఘ్రాణమునకు గంధజగత్తు విషయము. శీతోష్ణాది స్పర్శల నన్నింటిని చర్మముచే తెలియుటంబట్టి త్వక్కునకు స్పర్శ జగమెల్ల విషయము. నానావిధ శబ్దములను చెవితో వినుచున్నాముకావున, శబ్దప్రపంచము శ్రోత్రమునకు విషయము. ఇప్పుడు చూడుడు ప్రపంచము నంతటిని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధమయమైన దానినిగా నెఱుంగు నవకాశము చిక్కినది. ఇక అంతరింద్రియమగు మనస్సునకు విషయము లగు వృత్తులు, గుణాదులు ఈ యైదింద్రియములచే గ్రహింపబడకుండుటచే వాటిని గూర్చుట కింకొక సూత్రము కావలయును.

బ్రహ్మాండ మధ్యమమునను్న అణువు మొదలు మహత్తు వఱకును గల నానావిధ ద్రవ్యరాశిని మానవుడు (ఇతర ప్రాణులుగూడ) నేత్రేంద్రియముతో చూచి గ్రహించు చున్నాడు. కంటికి చూడ వీలైన బృహత్పదార్థమునేకాక, నేత్రము యంత్రసాహాయ్యమున చూడ గలిగిన పరమాణువు, అందలి యంతర్భాగములు (ప్రోటాను, ఎలక్ట్రాను అను విద్యుత్కణములు) కూడ చక్షుర్గోచరము లగునవిగనే లెక్క. కావుననే

కంటికి ప్రత్యక్షమిచ్చు వీటినన్నింటిని దృశ్యములని వాకొందిరి. దృశ్యము అనగా ఆకారము గలిగి చూడదగినది యని అర్థము. ప్రపంచములో నున్న సూర్యాది గ్రహములు నుండి అణువుల వఱకు గల ఇవి అన్నియు దృశ్యపక్షము లోనివే. జగత్తున దృశ్యమైన నేత్రమునకు గోచరములై దృశ్యకోటిలో చేరినవేగాక, అదృశ్యమైన మఱియొక నేత్రమునకును గోచరములై అదృశ్యగుణము కలిగి మానవుని ప్రదేశమునయు కొన్ని కలవు. కంటితో చూడబడలవిగాక మనోనేత్రముచే మాత్రము గ్రహింపబడగిన యివి హృదయమున తోచు భావములు, సంకల్పములు, కోరికలు, ఊహలు, అపోహలు, కామక్రోధాది గుణములు మొదలగునవి. మఱియు నేత్రేంద్రియమునకు తక్క మిగిలిన చెవి, ముక్కు, నాల్క, త్వక్కు అను ఇంద్రియములకు విషయములగు శబ్దము, వాసన, రుచి, తాకుడు అనునవి కూడ అదృశ్యగుణము కలవే కావున పై మనోవృత్తు లతో ఏకీభవించుచున్నవి. వీటినన్నింటిని అదృశ్యము లనవచ్చును. (అనగా కంటికి కనపడు రూపగుణము లేనివని మాత్రమే తెలియవలెను.) మానవుడు తన లోక వ్యవహారము సాగుటకై ఈ రెంటికిని పేరులు పెట్టి యున్నాడు. అందు దృశ్యములకు నామము లుంచకపోయినను హస్తాదు లచే నిర్దేశించి ప్రత్యక్ష వ్యవహారము జరుపవచ్చునుగాని, అదృశ్యము లకు పేరులు లేనిచో ఆ ప్రత్యక్ష వ్యవహారముకూడ సాగనేరదు. కావున ఈ దృశ్యాదృశ్యములు రెండింటికిని నామకరణ మావశ్యక మైనది. విశేషమేమన, అదృశ్యములకు నామములే శరణ్యములు. పేరులు లేకున్న వానికి వ్యవహార యోగ్యత కలుగదు. వాటికి చర్మ చక్షువుచే చూడబడు యోగ్యత లేమిచే ఈ స్థితి అనివార్యము. ఇక దృశ్యము లన్నియు రూపము కలవగుటచే వానికి నామములతోడి వ్యవ హారము అప్రధానము. అయినను వాటికిని పేరులు లేకపోలేదు. ఈ

విచారణచేత అనంత భేదసంయుతమగు ప్రపంచమును మనము సులభముగా పేర్కొనుటకు వీలు చిక్కినది. జగములోని దృశ్యములన్నింటిని రూపములు కలవనియు, అదృశ్యములనెల్ల రూపరహితము లగుటచే నామము కలవనియు చెప్పుటలో మన కెంతయో లాఘవము చేకూరినది. ఇప్పు డీ విశాల విశ్వమును నామము, రూపము అను రెండు కొనలుగల త్రాటిచేత ముడివేసినాము. ఇంతకన్న సులభముగ ప్రపంచమును ఎఱుకలోనికి తెచ్చుకొనుట అనుభవములో లేదు. కావున ఈ అనుభూతివిబట్టి ప్రపంచము నామరూపాత్మకమను నర్థము సిద్ధమయినది.

జగత్తు నామరూపములకంటె వేఱుగా లేదనుటకు ఈ క్రింది తైత్తిరీయారణ్యక వచనము ప్రమాణమై యొప్పుచున్నది.

"యచ్చ కించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా"

ఏ కొంచెము జగత్తు కనబడుచున్నదో, వినబడుచున్నదో, అని పై శ్రుతివాక్యమునకు అర్థము. అనగా కనబడుట వినబడుటల కంటెను ప్రపంచమునకు మఱొక ప్రత్యేక లక్షణము లేదని భావము.

"సర్వాణి రూపాణి విచిత్య ధీరః
నామాని కృత్వాఽభివదన్ యదాఽఽస్తే."

విశ్వవిరాట్టు సర్వరూపములను సృజించి నామములనుంచినా దను పురుషసూక్తవచనమును ఈ యభిప్రాయమునే చాటుచున్నది.

జగచ్ఛృష్ట్యాల స్వరూపమును వివరించు ఏ క్రింది శ్లోకము పైతము ప్రపంచము నామరూపాత్మక మని ఘంట గొట్టినట్లు చెప్పుచున్నది.

"అస్తి భాతి ప్రియం రూపం నామ చేత్యంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్."

— వేదాన్త పంచదశి.

సత్తు, చిత్తు, ఆనందము, రూపము, నామము-అను అంశపంచకములో మొదటి మూడును పరబ్రహ్మస్వరూపమనియు, చివరి రెండును (నామరూపములు) జగద్రూపమనియు శ్లోకాభిప్రాయము. ఇందు వ్యక్తము లగునవి నామరూపములు మాత్రమే, అంశత్రయాకారమగు బ్రహ్మము అవ్యక్తము. అవ్యక్తములేని వ్యక్తము నిష్ప్రయోజనము కావునను, వ్యక్తములగు నామరూపముల విలాసము అవ్యక్తమగు అఖండ శక్తిమీదనే కావునను, వ్యక్తావ్యక్తముగనున్న అంశపంచకముతో ప్రవర్తించు ఈ విశ్వ (విలాస) మును ప్రపంచమని చెప్పుటయు సమంజసముగ నున్నది. పై నిర్వచన ప్రకారము ప్రపంచ మనుటచే అంశపంచకము తోచుచున్నను, వ్యక్తమగునవి నామరూపములే కావున, ప్రపంచము నామరూపాత్మక మన్నను విరోధములేదు. పాలలో నేయివలె ప్రపంచ శబ్దములో నిమిడియున్న గంభీరార్థమును ప్రదర్శించుటకే యీ విస్తరమునకు పూనుటయైనది. స్థూలదృష్టినిబట్టిచూచిన ప్రపంచమంతయు వ్యవహారమున నామరూపాత్మకమే.

ఈ విధముగా కూడ ప్రపంచార్థమును భావింపవచ్చును. సత్యజ్ఞానానన్తమగు పరబ్రహ్మము అనాదిసిద్ధ వస్తువు. దానినుండి జీవుడు, జగము ఏర్పడినవి. జగమునకు మూలము ప్రకృతి. ప్రకృతి-తమస్సు, రజస్సు, సత్త్వము-అను మూడుగుణములతో కూడినట్టిది. ఈ త్రిగుణముల వల్లనే స్థూల సూక్ష్మ కారణరూప దేహము లేర్పడుచున్నవి. కనుక

పరబ్రహ్మము (పరమాత్మ) జీవుడు(ఆత్మ) సత్వ రజ స్తమో గుణములు- వెరసి ఈ అయిదింటి వ్యాపకమే జగము. కావున ప్రపంచ మను మాట సార్థకమగుచున్నది. ఈ సత్యమును పరమేశ్వరుడు మన హస్త పాదములకు అయిదేసి వ్రేళ్ళను కల్పించిగూడ తెల్ల మొనర్చినాడు. అంగుష్ఠము (బొటన వ్రేలు) పరమాత్మకు సంకేతము. తర్జని (చూపుడు వ్రేలు) జీవాత్మకు సంకేతము. తక్కిన మధ్యమా నామికా కనిష్ఠికలు సత్వ రజ స్తమో గుణములకు సంకేతములు. కనుకనే జ్ఞానులు, యోగులు చిన్ముద్రయందు అంగుష్ఠ తర్జనుల నైక్యము చేసి తక్కిన మూటిని వదలుచున్నారు. అనగా జీవుడు బ్రహ్మముతో నైక్యమై త్రిగుణాత్మకమగు ప్రకృతిని దాటవలయుననుట తత్త్వము.

—o—

# నేను

"అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః"

— భగవద్గీత.

"త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః."

— కైవల్యోపనిషత్తు.

సమస్త భూతముల హృదయములందున్న ఆత్మను నేనే; జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడు దశలయందును గల భోగ్యవస్తువుల కంటెను, వాటి ననుభవించు విశ్వ, తైజస, ప్రాజ్ఞులనెడి భోక్తల కంటెను, ఆ భోగమున కంటెను విలక్షణుడనగు కేవల చిన్మాత్రసాక్షినే నేను.

ప్రపంచమన నేమో స్థూలముగా తెలిసికొనిన పిమ్మట ఉదయించెడి రెండవ ప్రశ్నము ఈ ప్రపంచమునందలి 'నేను' ను గూర్చినది. నీవుకాని, ఇంకొకడుగాని, ఎవ్వరైనను, ఏ ప్రాణియైనను సరియే తన్ను గూర్చి తాను చెప్పుకొనవలసి వచ్చినప్పుడు 'నేను' అను పదముచేతనే ఆత్మనిర్దేశము చేయబడుచున్నది కావున, ప్రాణులుగల సర్వచేతనముల వల్లను 'నేను' శబ్దము ప్రయుక్తమగుచున్నది. కావున ఒక్క 'నేను' ను గూర్చి విచారించిన విశ్వమునందలి నన్ను గూర్చియు, నిన్ను గూర్చియు, ఇతరుని గూర్చియు, సర్వప్రాణిసమూహమును గూర్చియు విచారించినట్లే యగును. నానాత్వముగనే తోచు దృశ్యాదృశ్య ప్రపంచమును

నామరూప విభాగముచే రెండు గతుల విభజించుకొని నామరూపాత్మకమని మాత్రప్రాయముగ వ్యవహరించుకొన్నట్లే, కోట్లకొలది భేదములతో మన్న చేతనముల నెల్ల ప్రత్యేక ప్రత్యేకముగ గణనచేయక, ఒక్క నేనులో నిముడ్చుకొనుటలో విచారణకు మంచి సౌలభ్య మేర్పడినది. ఇప్పుడు 'నే' నను వాడు, వానిస్వరూపము, స్వభావము, తత్త్వము, రహస్యము మనకు గోచరించినయెడల మనలను బోలినవారి స్వరూపాదులే కాక, చీమయొక్క, దోమయొక్క, చైతన్యముకల ప్రతిదాని యొక్క స్థితియు మనకు తెలిసినట్లే. అందుచే నేనును గూర్చిన ఈ సమస్యను జాగరూకులమై సూక్ష్మ బుద్ధితో విచారింప వలయును.

"నేను" అనగనే తొలుదొల్త మానవుని స్థూలదృష్టికి తోచునది శరీరము. ప్రాణి దేనియొక్క అవయవములచే నడచుట, కూర్చుండుట, ఇచ్చుట, పుచ్చుకొనుట, తినుట, మూర్కొనుట, వినుట, పలుకుట, తాకుట, విడుచుట, ఆనందించుట - మున్నుగాగల పనులను జరుపు చున్నాడో, అట్టి అంగములతో కూడుకొన్న శరీరమును తనముగా భావించుకొనుటలో దోషము లేకపోవచ్చును. అది దోషము కాదని భావించియే మీదుమిక్కిలి అదియే యథార్థమని తలంచుటచే మానవుడు శరీర ధర్మములయిన స్థూలత్వ-కృశత్వములు, హ్రస్వత్వదీర్ఘత్వములు మున్నుగా గలవానిని తనయందారోపించుకొని, నేను లావరిని, సన్నని వాడను, పొట్టివాడను, పొడగరిని, నల్లనివాడను, ఎఱ్ఱనివాడను, స్త్రీని పురుషుడను, నపుంసకుడను, నడచుచున్నాను, తేచుచున్నాను అనియు, వయోఽవస్థావిశేషములను ఆరోపించుకొని బాలుడను, యువకుడను, వృద్ధుడను అనియు, ఇంద్రియధర్మములైన అంధత్వ, బధిరత్వ, మూకత్వ, పంగుత్వములను ఆరోపించుకొని, గ్రుడ్డివాడను, చెవిటివాడను, మూగ వాడను, కుంటివాడను అనియు, ప్రాణధర్మములైన ఆకలిదప్పులను

ఆరోపించుకొని ఆకొన్నవాడను, దప్పిగొన్నవాడను, అనియు తలంచుచున్నాడు.

కాని స్థూలమైన ఈ బుద్ధి ఇంచుక విచారణ ఉదయింపగనే తిరోహితము కాకతప్పదు. యథార్థముగను నేననువాడు శరీర మెన్నటికిని కాదు. ఈ విషయ మీ దిగువ వ్రాసిన యంశముచే తెల్లము కాగలదు. ప్రతి మనుజుడును నా యిల్లు, నా వాకిలి, నా భార్య, నా పుత్రుడు అని తనపైన వస్తువులను చెప్పునప్పుడు తాను ఆ వస్తువులు కాక, వాటికంటె భిన్నుడగుచుండుట మన అనుభవములో నున్న విషయము. రాముడు ఒక వస్తువును నాది అన్నప్పుడు ఆ వస్తువే రాముడగునని యెవ్వడైన చెప్పగలడా? అట్లే ప్రతివాడును నా శరీరము, నా కాలు, నా చేయి, నా ముక్కు, నా కన్ను, నా ప్రాణము అని వ్యవహరించు చుండుటచే తాను నాదని చెప్పెడు శరీరమునకన్న, కాలు మొదలగు ఇంద్రియముల కన్న, చిట్టచివరకు ప్రాణముకంటెను కూడ తానను వస్తువు వేఱుగు చున్నది. ఈ విధముగా 'నేతి' వాక్యములచేత, అనగా ఇది కాదిది కాదను పృథక్కరణముచేత సర్వావయవములను వేఱొనర్చుచు పోగా 'నేను' స్థూలదేహమును దాటి తద్భిన్నమై ప్రకాశించుట తెలియగలదు. అజ్ఞానవశమునను, విచార మొనర్పని దోషముచేతను నేననుకొన్న స్థూల శరీర మిపుడు నేను కాక, నేననెడి ఒక వస్తువునకు ఆ యా పనులు సాధించు సాధనము మాత్రమగుట ఈ దశలో మానవుడు ఎఱుంగ గలదు.

శరీరము నేను కాదని తెలిసిన మాత్రమున 'నేను' యొక్క జ్ఞానము కలుగలేదు కావున నేను, నాకు సంబంధించిన జిజ్ఞాస కడముట్ట లేదు. మఱి ఈ నే నెవనో విచారించినచో శరీరాంతర్వర్తియై,

శరీరమును ఇంద్రియములను ప్రేరేపించి ఆయా కర్మలయందు ఏ వస్తువు ప్రవర్తింప చేయుచున్నదో, మఱియు ఆ కర్మఫలముల ననుభవించి సుఖ దుఃఖముల నందుచున్నదో, అది నేను కావలయునని తోచుచున్నది. ఈ విచారణచేత దృశ్య (దేహము) మైన నేను అదృశ్యమై దృశ్యములో కూడి తదంతర్వర్తి యగుట మానవుడు భావింపవలయును. సరియే. ఇక శరీరములో ప్రవేశించి యీ 'నేను' ఏమూల దాగియున్నదో వెదకవలసి వచ్చినది. అనేకములైన సంకల్పములు ఏ కారణమునచే వస్తువునందు జనించుచున్నవో, అట్టి వికల్పములు ఎద్దానియందు ప్రకటించుచున్నవో, ఇష్టములుగాని, అనిష్టములుగాని ఎందు పుట్టుచున్నవో, వేయేల నానా భావములకు నిలయమై మితిలేని తలపులను తరంగములకు పుట్టినిల్లైన సముద్రమేదో, అది నేను కావలయును. అట్టి సర్వసంకల్ప ప్రభవ భూమి మనస్సే. మనస్సే ఇష్టములను కోరుచు, అనిష్టములను ద్వేషించుచు ప్రపంచరంగమున ప్రాణిని నడపుచున్నది. మానసిక ప్రేరణము లేనిది నరుడు ఏ పనిని చేయజాలడు. ఇష్టానిష్టములు ప్రాప్తించినప్పుడు సంతోష దుఃఖములను కూడ పొందునది మనస్సే. కావున మనస్సు "నేను" కావలయును. ఇట్టి ఊహచేతనే మానవుడు మనోధర్మములైన రాగద్వేష ములను, కామ సంకల్ప సందేహాదులను, సుఖదుఃఖములను తనయం దారోపించుకొని "నేను రాగిని, ద్వేషిని, కామిని, తలచువాడను, సందే హించువాడను, నిశ్చయించువాడను, కర్తను, భోక్తను (ఇవి మూడును బుద్ధిధర్మము లైనను అంతఃకరణమును దృష్టిలో నుంచుకొని ఇక్కడ వ్రాయబడినవి) సుఖిని, దుఃఖిని అని పలురీతుల భావించు చున్నాడు.

కాని ఈ అంశము సయితము పూర్వమువలెనే పూర్వపక్ష మగుచున్నది. తలచునది, కోరునది, ద్వేషించునది, ప్రేరేపించునది మనస్సయినను "మానవుని మనస్సు ప్రేరేపించుచున్నది. 'నేను

నా మనస్సుచేత సంకల్పించుచున్నాను'' మున్నగు వ్యవహార సందర్భము లందు మనస్సుకంటెను 'నేను' వేఱుఁబోయి, ఆ నే ననునది సంకల్పిం చుటకుగాని, కోరుటకుగాని, ద్వేషించుటకుగాని ఈ మనస్సాక సాధనము మాత్రమే అగుచున్నది. ఎప్పుడును సాధనము (పనిముట్టు) వేఱు, ఆ సాధనమును చేబూని పనిని సాధించుకొనువాడు వేఱుగదా? ఒక శిల్పియు, ఆ శిల్పిచేతిలోని సాధనమును ఒక్కటియే యని ఎవ్వరును చెప్పసాహ సింపరు. మఱియు నేను ఒకదానిని కలిగి యున్నాననుట తోడనే ''నేను'' వేఱును, ఆ నే ననువాడు కలిగియున్న వస్తువు వేఱును అగుచుండుట లేదా ? ఇంక ఈ దిగువ అంశమును బట్టి చూచినను మనస్సు నేను కాదు. జాగ్రదవస్థ యందును, స్వప్నావస్థ యందును సర్వవ్యవహారములను నడిపించెడు మనస్సు స్వప్నమును మించిన ఒక నిద్రావస్థ (సుషుప్తి) లో నశించుచున్నది. మూర్ఛాదులయందును మనస్సుయొక్క ఉనికిని కానము. సుషుప్తియం దిది తనకు కారణమైన అజ్ఞానములో లీనమగుచు తదితరము లగు స్వప్న జాగరములయందు పొడకట్టుచుండుట అనుభవసిద్ధము. ఈ విధముగా ఒకప్పు డుండి, ఒకప్పుడు లేక ఉదయాస్తమయముల నందు మనస్సే నే ననుట ఎవ్వరికేని ఇష్టమగునా ? తా నను వాడు ఎల్లప్పుడును ఉండగోరునుగాని, ఒకప్పుడును నశింపవలెనని తలంపకుండుట సత్యమే కదా ! కావున మనస్సు పయితము నేను కాదని రూఢి యగుచున్నది. ఈ నేనను వానికి మనస్సుగాని, శరీరము కాని, ఇంద్రియములు కాని మఱేదైన అగుగాక సాధనములు మాత్రమే అనియు, నేను అను సాధకుడు వీటికన్నింటికిని భిన్నుడయి విలక్షణుడయి ఉన్నాడనియు ప్రస్తుతము గ్రహించిన చాలును.

మనోవాక్కాయములు దేహికి సాధనములు మాత్రమే అను అంశము లోకమున ప్రతివారును నుడువుచుండెడి 'త్రికరణ శుద్ధిగా

ప్రవర్తించితిని', ముమ్మాటికిని నిజము' అను వాక్యముల చేత కూడ తెలిసి కొనవచ్చును. పై మాటలలోని త్రికరణములు, ముమ్మాటికిని లోని మూడును, మనోవాక్కాయములే. ముమ్మాటికి అనునపుడు-మనసా, వాచా, కాయేన, వేఱుతలంపు లేదనియే భావము. నే ననువాడు సంకల్పించుటకు మనస్సు మొట్టమొదటి సాధనము. ఆ మనస్సులోని తలంపులను బయలుపఱచుటకు వాక్కు రెండవ సాధనము. వాటిని ఆచరించుటకై శరీరము మూడవ సాధనము: ఈ మూడింటియొక్క సంశుద్ధి ప్రాణికి అత్యావశ్యకమను విషయమునే 'త్రికరణ శుద్ధి' అను మాట తెలియ జెప్పుచున్నది.

మనః ప్రాణ శరీరములు నేను కాకపోవుటకు నేనునకు పర్యాయములుగా ఉపయోగించెడు పదములే సాక్షిభూతములై యొప్పుచున్నవి. నిఖిలచేతనములను వ్యవహరించుటకు ఉపయోగించెడు నేనునకు మాఱుగా దేహి, శరీరి, ప్రాణి, మనస్వి మున్నగు పదములు వాడబడుచున్నవి. వరుసగా వాటి యర్థమును ఆలోచించినచో-ఏది దేహమను వస్తువును కలిగియున్నదో అది దేహి; శరీరము కలది శరీరి; ప్రాణము కలది ప్రాణి; మనస్సు కలది మనస్వి-అని తెలియుచున్నది. ఈ చెప్పబడిన నేను మనః ప్రాణ శరీరములను కలిగియున్నదే కాని, వాటి స్వరూపమే తా నయి లేదు. ఒక పదార్థమును కలిగియున్నవాడును, ఆ పదార్థమును ఒక్కటి కాక భిన్నములగుట మన మిదివఱకే యెఱుంగుదుము.

ఇంతదూరము వచ్చినను నే నెవ్వరో మనకు చిక్కలేదు. కాగా సామాన్యముగా జనులు భావించెడు శరీరమునకన్న, ఇంద్రియముల కన్న, ప్రాణమునకన్న అంతఃకరణమునకన్న, నేనను వాడు భిన్నుడనియు, అట్టి వాడుఒక్కడు ఉండి తీరవలయు ననియు ఇంతవఱకు నిర్ధరించుకొన్నాము. ఇదియు కొంతవఱకు మేలే. నేను కాని వస్తువులను నేనుగా తలంచి మోస

పోయెదు భ్రాంతికి ఇప్పుడు దూరమయితిమి కావున, ఈ యజ్ఞానపు పొర పీడినందులకు కొంత సంతసింప వలసినదే కదా! ఈ నేను మన కీ పాటికి దొరకక పోయినను శరీర వాఙ్మనః ప్రాణములకు ప్రభువై వాటిని ప్రేరేపించుచు తేజరిల్లుచున్నా డనుటలో మన కెట్టి సందియమును లేదు. ఇక అట్టి నేను శబ్దముచే చెప్పదగు పరమార్థమును శరీరములో చొచ్చి, అందలి అంతఃకరణమున కూడ ప్రవేశించి హృదయ గుహయందు ఏ మూల అయ్యది అవ్యక్తముగ ఉన్నదో గాఢముగ అన్వేషింపవలసి యున్నది.

సూక్ష్మమగు మన వస్తువిచారణను అంతర్ముఖ మొనర్చి ఏకాగ్ర మగు ధ్యానధారతో అలోచించినచో నే ననునది శరీరముకాక, ఇంద్రియ ములుకాక, ప్రాణముకాక, అంతఃకరణముకాక వీటి నన్నింటిని గ్రహించుచు, దీపమువలె ప్రకాశింపచేయుచు, తత్తత్కార్య ప్రవృత్తికి ప్రేరేపించుచు, వాటి వాటి అవస్థలకు సాక్షిమాత్రముగా ఏదో ఒక తేజము - జ్ఞానలీల - చైతన్యము మనలో మెలగుచున్నట్లు తెలియగలము. దేనిచేత శరీరము ఆ యా పనులొనర్ప సమర్థమగుచున్నదో, ఇంద్రియ ములు తమ తమ విషయములను గ్రహింప శక్తికలవగుచున్నవో, మనస్సు నానావిధములైన సంకల్ప వికల్పములను జేయ శక్తమగుచున్నదో అట్టి వస్తువు - వీటికంటె భిన్నమైనది ఏదియో ఒకటి లోపల ఉండి జ్ఞాతృధర్మమును (తెలిసికొను స్వభావమును) ప్రకటించుచున్నట్లు సుసూక్ష్మమగు అంతర్విచారముచే తోపగలదు. నా శరీరము, నా మనస్సు, నా ప్రాణము, నా సర్వస్వము, అను వ్యవహారములు దానిని లక్ష్య మందుంచుకొనియే ప్రవర్తించుచున్నట్లును, నాది (నా+అది) అనుదానిలోని 'అది' అను పదార్థమును వేఱుచేయగా - శేషించు "నేను" సర్వవ్యవ హారములకు మూలకారణమయి, పైని నొడివిన జ్ఞాతృధర్మవిశిష్టమును

సాక్షిభూతమునగు ఆ వస్తువే అనియు అనుభవముచే ఊహింపగలము. ఇప్పుడు ఎంత విచారించినను అందక మనతో దాగుడుమూత లాడుచున్న నేనను వస్తువును ఎట్లో శ్రమించి పట్టజాలితిమి. ఇంక దీని స్వరూప స్వభావాదులను గాఢముగను, దీర్ఘముగను విచారింప వలసి యున్నది. ఈ నేను తనకు సాధనములైన శరీరముచేతను, వాక్కుచేతను, అంతఃకరణముచేతను అన్నింటిని పొందుచున్నది కావున దీనిని "ఆత్మ"* అనుట ఒప్పిదము. ఇప్పుడు నే నన్నను, ఆత్మ అన్నను, జీవుడన్నను, జ్ఞాత అన్నను, సాక్షి అన్నను ఇంచుమించు ఒక్కటే యని గ్రహించుటలో ఆక్షేపము లేదు.

అట్లయినను 'నా ఆత్మ' మున్నగు వ్యవహార సందర్భములనుబట్టి ఆత్మ నేను కాకపోవలసి వచ్చెడి గతి తప్పలేదు. ఆత్మ ఎప్పుడు నేను కాదో, అప్పుడది ఆ 'నేను' కంటె భిన్నము. అట్లు నేనుకంటె భిన్నమై నేనుతో సంబంధముకలది నేనునకు సాధనమని పూర్వము చెప్పబడి యుండుటచే, మనస్సునకు పట్టిన గతియే దీనికిని సిద్ధమయినది. 'తనకంటె భిన్నమయిన ఆత్మ తాను (నేను) కాగలిగినప్పుడు, తనకంటె భిన్నము గాక వ్యవహారమున మాత్రము భేదయుక్తముగ తోచెడి మనస్సే నే నని చెప్పుటలో ఒక సౌలభ్యములేదా? మఱియు మనస్సునకంటె ప్రత్యేకముగా నేను యొక్క ఉనికియు కన్పట్టుట లేదే, అని ఇచ్చట ఒక సందేహము కలుగవచ్చును.

'నా ఆత్మ' మొదలగు వ్యవహారములయందు వినబడెడు ఆత్మ శబ్దము శరీరవాచకమో, లేక మనోవాచకమో అగునుగాని, అంతఃకరణము

---

* "యచ్చాప్నోతి, యదాదత్తే, యచ్చాత్తి విషయా నిహ
యచ్చాస్య సంతతో భావ, స్తస్మా దాత్మేతి కీర్త్యతే."

(మనోబుద్ధిచిత్తాహంకారములనెడి వాటి కూటమి) నకును ప్రకాశకమైన నేను ను గూర్చి, లేదా జ్ఞాతనుగూర్చి ప్రయోగింపబడినది మాత్రము కాదు. ఆత్మ శబ్దమునకు నానార్థము లుండుటచే మనకట్టి భ్రాంతి కలిగినదే కాని వస్తుతత్త్వము వేఱు. సంకల్ప వికల్పములు చేయు మనస్సే నేను కాక పోవుటగాదు. సర్వవిషయములను 'అగును, కాదనుచు' నిశ్చయించెడు బుద్ధియు, కర్తృత్వాదులను వహించెడు అహంకారమునుకూడ అంతః కరణ వృత్తులే అగుటచే అవియు 'నేను, కాదని నిరూపించుట ఇష్టము. వీటి నన్నింటిని ప్రకాశింపజేయు కొందొక పదార్థమును ఉపలబ్ధి నొందు టయే ఆత్మ దర్శన ప్రయోజనము. ఇక రెండవ శంకయగు "మనస్సున కంటెను ప్రత్యేకస్థితి (ఉనికి) లేని ఆత్మను అంగీకరింపనేల ? మనస్సునే నేనుగా భావింపరాదా'' అన్న విషయమును విచారింతము. ఆత్మ యన నేమో విచారించినచో-మనస్సుయొక్క ఉనికియు, స్వరూపమునేకాక, మనోబుద్ధి చిత్తాహంకారముల (అంతఃకరణము) సంగతి కూడ బోధపడ గలదు. కావున మన విచారమును దానిపై పునకు త్రిప్పుదము.



# ఆత్మ

—

"అణో రణీయాన్ మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్."

— కఠవల్లి.

అణువుకంటె అణువును, మహత్తుకంటె మహత్తును అగు ఆత్మ ప్రాణులయొక్క హృదయ గుహయందు కలదు.

సాధారణముగా ప్రతి ప్రాణియు జాగ్రత్, స్వప్న, సుషుప్తులను మూడవస్థలకు లోనగుచుండును. జాగ్రదవస్థ యందు-అనగా మేల్కొంచి యున్నప్పుడు ప్రాణి తన యింద్రియములతో బాహ్యజగత్తు నందలి అన్యోన్య విషయములను గ్రహించుచు సర్వ వ్యవహారములను నడపు చుండును. స్వప్నావస్థ (కల) యందు స్థూలదేహము శయ్యపై బడి యున్నను, దీనిని పోలిన ఇంకొక శరీరమును ధరించి ఈ ప్రపంచమును పోలిన మఱియొక ప్రపంచములో నానారీతుల సంచరించుచు సుఖదుఃఖము లను కూడ పొందుచుండుట అందఱి అనుభవములో ఉన్నదే. కలయందు ఈ ప్రపంచమును పోలిన జగత్తుననే కాక, ఊహింపనలవిగాని ఏవేవో లోకములందు చిత్రవిచిత్ర వ్యవహారములను చేయుచు సంచరించుచుండు టయు కలదు. కలయందు జీవుడు పొందెడు విచిత్రానుభవములు ఊహా తీతములు. ఈ అవస్థలు రెండునుకాక, సుషుప్తియను మూడవ అవస్థ ఇంకొకటి పొడకట్టుచున్నది. దానినే గాఢనిద్ర యందురు. ఏ యవస్థను

పొందిన ప్రాణి కలలనుగాని, సంకల్పములనుగాని కాంచదో, మీదు మిక్కిలి కొంచెమైనను కోరికయను వాసనయేని వానివి కాకదో, అట్టి సర్వసంకల్ప వర్జితమగు అకాశమును బోలిన దశావిశేషమే సుషుప్తి. ఈ అవస్థ సయితము స్వప్నజాగరములవలె ఎల్లరు అనుభవించునట్టిదే; పలువురు నిద్ర నుండి మేల్కాంచినవారై "హాయిగా నిద్రించితిని, ప్రాణ మెటుపోయినదో యేమియు తెలియదు, నిర్వికల్పమగు సుఖము ననుభవించితిని" అని చెప్పుటనుమనము విస్పష్టముగా ఎఱుంగుదుము.

ఈ మూడవస్థల వెంబడి మన ప్రయాణమును సాగించినయెడల ఆత్మ యొక్కయు, మనస్సు యొక్కయు ఉనికి మనకు పొడకట్టి తీరును. జాగ్రదవస్థయందు నే ననువాడు సంకల్పించుచు, కోరుచు, ద్వేషించుచు, విధి నిషేధరూపములగు కార్యములయందు ప్రవర్తించు చున్నాడనుట విస్పష్టము. కావున చేయుటకు చేయకపోవుటకు శరీరమెట్లు సాధనమో, పలుకుటకు పలుకకుండుటకు వాక్కెట్లు సాధనమో, అట్లే సంకల్పాదులు చేయుటకును, చేయమికిని ఒక్కసాధనము ఉండి తీరవల యును గదా! సాధనములేక ఏ కార్యమైనను సాధింప బడకుండుట అంద ఱెఱింగినదే. కావున జాగ్రదవస్థయందు సంకల్ప వికల్పము లొనర్చుటకు, ఆ యా కోరికలను కోరుకొనుటకు ఒక్కసాధనము ఉండి తీరవలసి వచ్చినది. అట్టి సాధనము వెలుపలి శరీరమునకు సంబంధించి నది కాదు. సంకల్ప వికల్పములు చేతియందుగాని, కాలియందుగాని, ఇంక ఇతరములగు ముక్కు, కన్ను, చెవి, నోరు మొదలగువానియందుగాని పుట్టునట్లు ఎవ్వరును చెప్పుట లేదు. అవి శరీరము లోపల ఏ హృదయ స్థానముననో, లేక మెదడునందో కలుగుచున్నట్లు అందఱి అనుభవమును చాటుచున్నది. కావున శరీరాంతర్భాగమున హృదయస్థానమున సంకల్ప

వికల్పములకు సాధనమైన అంతరింద్రియము ఒకటి యుండవలయును. అదియే అంతఃకరణమనియు, మనస్సనియు మనచే పేర్కొనబడుచున్న సర్వసంకల్ప ప్రభవభూమి. ఇప్పుడు చూడుడు. నేనను జీవుడు అథవా ఆత్మ-అంతరింద్రియమగు మనస్సుచే సంకల్పించుకొని, బుద్ధిచే నిశ్చయించుకొని ఆ సంకల్పములను శరీరమునందలి బాహ్యేంద్రియముల ద్వారమున వెలుపలి కర్మక్షేత్రమున ఫలింపజేసికొనుచున్నాడు. నేనను వెలుగు మనస్సుమీద పడి అది ప్రకాశింపగ, అద్దానికి కదలిక కలుగును. ఇదియే సంకల్ప వికల్పాదులు పుట్టెడు అవస్థ; నానావిధ వృత్తు లుదయించు దశ. ఈ సంకల్పాదులు ఆత్మ నుండి కైకొన్న తేజమున సజీవములై యింద్రియముల ద్వారమున లోకమున కార్యరూపమునందును. మనస్సుగాని, శరీరేంద్రియములు గాని జడము లనియు, అనగా స్వయం ప్రకాశత్వము గాని, స్వతఃస్ఫురణముగాని వాటికి లేదనియు, ఆత్మ శబ్దవాచ్యమైన "నేను" చైతన్య స్వరూపుడనియు స్వయం ప్రకాశకత్వము, స్వతః స్ఫురణము కలిగియుండుటచే తేజోమయుడైన సూర్యుడు జగములోని నిస్తేజములైన వస్తువులను ప్రకాశింప జేయునట్లు, ఈ ఆత్ముడును శరీరమును, ఇంద్రియములను, మనస్సును ప్రకాశింపజేయుచు, వాటి వాటి కార్య కలాపములందు వాటిని సమర్థము లొనర్చుచున్నా డనియు ఇచ్చట ఎఱుంగవలసిన పరమార్థము. మనః ప్రాణ శరీరేంద్రియములు జడములను విషయము. ఈ అవస్థాత్రయ విచారమునందే స్పష్టము కాగలదు.

పైని వివరించిన జాగ్రదవస్థను గూర్చి శ్రద్ధాళువులై తెలిసికొన్నచో స్వప్నావస్థ విషయమును సులభముగ తెలియగలదు. ఈ శరీరము ఒక పెట్టెపై పాఱవైచి కలలు కాంచు నపుడును జీవశబ్ద వాచ్యుడగు నేను కలను. మఱియు మనస్సును, శరీరేంద్రియములు కూడ కలవు. అంతియే కాదు. చుట్టపక్కములును, స్నేహితులును, విరోధులును,

ఇంతయేల ! సత్యప్రపంచమును సిద్ధ మగుచున్నది. స్వప్నములో జీవుడు అనుభవించు అనుభవమునకును, జాగ్రద్దశలో జీవుడు పొందు అనుభవమునకును, లవలేశమేని భేదము లేదు. మీదుమిక్కిలి జాగ్రదను భవములకన్న స్వప్నానుభవములు వింతవింతలై అపూర్వములే కాక, అపురూపములునై ప్రకాశించుచుండుట ఆశ్చర్యపడ దగిన విశేషము. ఆకసమున పక్షివలె పరువెత్తుట, భూమిలో జొఱబాఱుట, వింత వింత లోకములను, మనుష్యులను, నానా జంతు సంతానములను కాంచుట, దేవతలతోనేని మంతనములాడుట ఓ ! ఎన్నెన్ని విశేష విషయములు ! ఎంతెంతగా అబ్బురం పడదగిన చర్యలు !! స్వప్నజగమున దుఃఖమను నది మసలక సదా మధురస్వప్నములే కలుగునదైన అంతకు మించిన అహ్లాదకర విషయము వేఱొండు లేదనవచ్చును. ఎన్ని సంవత్సరములేని, ఎన్ని శతాబ్దు లేని ఆ స్వప్నజగత్తునందే నిమగ్నుడయి ప్రాణి జీవిత మును వెళ్ళబుచ్చుకొనుటకు శంకింప దనుకొనవచ్చును.

కన్నులుమూసి, సర్వేంద్రియ విషయములను మఱచి నిదురించు వానికి ప్రక్కపై బడియున్న శరీర మట్లే యుండగా ఇంకొక శరీర మెక్కడిది ? ప్రపంచమును నేత్రములలో చొరనీక తెప్పలనెడి సరదాలు దింపుకొన్నవానికి ఈ ప్రపంచమేకాక, చిత్ర విచిత్ర జగత్తులేమి ? ఇది సత్యమా, లేక యేదేని మాయయా ? గారడియా ? మాయ అనుకొనుటకు ఆ క్షణమున అనుభవములో నున్నదే! జాగ్రజ్జగమునకు వచ్చి స్వప్నాను భవములను నోరూరునట్లు చెప్పుకొందుమే. కావున మాయ అను టెట్లు ? కొంతకాలము జ్ఞప్తియందు స్థైర్యముండునే. సత్యమా? సత్యమైన కన్నులు తెఱవగనే ఈ జగము ఏ గోతిలో దూఱుచున్నది ? మధుర మధురానుభ వము ఏ మంటలో కలియుచున్నది ? ఎప్పటి కుక్కిమంచము, నల్లులు, నవమ్ముత్తయూరేమి ? కావున యథార్థము కాదు – మాయ, ఇంద్రజాలము

భ్రాంతి, కల్పితము. ఓహో! అట్టైన ఈ మాయకా డెవ్వడు? ఈ ఇంద్ర జాలికు డెవ్వడు? ఈ భ్రాంతిని కల్పించిన వాడెవ్వడు? ఇంతటి కల్పన మునకు కారకు డెవ్వడు? అట్టివానిని పట్టుకొన్నచో గుట్టు బట్టబయలు కాగలదు. ఏడీ! వెదకిచూతము ఆ గారడివానిని!

పరికించి చూచిన జాగ్రదవస్థకును స్వప్నావస్థకును భేదము గోచరించుట లేదు. జాగ్రద్దశయం దున్న దంతయు స్వప్నము నందును కన్పట్టుచునే యున్నది. పోగా ఇక ఉన్న భేదమేమన, జాగ్రద్దశయందలి వస్తువులుకాని, ప్రపంచముకాని, కొంతకాలమువఱకు స్థిరముగా నుండును. స్వప్నజగముగాని, అందలి పదార్థములుగాని మెలకువ రాగనే నశించు చున్నవి. కావున అవి అస్థిరములు. జాగ్రదవస్థలో ఒకప్పుడు చూచిన వస్తువులను వేఱొకప్పుడు చూడగలము. స్వప్నావస్థలో అట్టి అవకాశము లేదు. ఇందులకు కారణము-జాగ్రదవస్థలోని ప్రపంచము కొంతకాలమేని శాశ్వతమగుటయు, స్వప్నజగము తాత్కాలికమై అశాశ్వత మగుటయు అని యెఱుంగదగు. జాగ్రదవస్థలోని జగమును పరమేశ్వరుడు సృజించి నాడని నమ్ముచున్నాము కావున దానిని గూర్చియు,తత్కర్తను గూర్చియు సందియము లేదు. ఇక స్వప్నజగమును కల్పించు వానిని గూర్చియే మన చింత!

జాగ్రత్స్వప్నము లనెడు రెండవస్థలయందును జీవుడు (నేను) మనస్సు, శరీరేంద్రియములు, పదార్థముల అనుభవ జ్ఞానము, సుఖదుఃఖ ములు మున్నగునవి తుల్యములని మనము తెలిసికొనియే యున్నాము. ఇంకను జాగ్రత్ప్రపంచము ఈశ్వర సృష్టమనియు ఎఱింగితిమి. ఈశ్వ రుడు సృజించిన జగములోని పదార్థములును వాటి అనుభవమును మనస్సు నకు చిరపరిచితములు. సంసార మేర్పడ్డప్పటి నుండియు జీవుడనువాడు అనేక జన్మములెత్తుచు ప్రపంచమున నానా యోనులందును పరిభ్రమించు

చున్నాడు. ఆ యా జన్మములయందలి అనుభవములు, సంస్కారములు-వాసనలు అంతఃకరణమున పదిలపడి యున్నవి. ఇంతవఱకు జీవుడు అనుభవించిన జీవిత ఘట్టములన్నియు మనో ముద్రితములై, అందు నిద్రించుచుండును. ఒక్కమాటలో చెప్పవలయునన్న 'నేను, అను రాజును మనో మంత్రి ఏయే ప్రపంచములందు త్రిప్పెనో, అవియన్నియు ఆ మంత్రిగారి 'రికార్డు'లో నున్నవన్నమాట. వలసియున్న దేవుడు సృజించినట్టి జగములను బోలిన లోకములను వేలకొలదిగానేని మనస్సు కల్పింపగలదు. ఇట్టి మాయామయమగు మనస్సే తన పూర్వ సంస్కారమునుబట్టి స్వప్నజగము నొకదానిని కల్పించి విచిత్ర నాటక మాడుచున్నది. దానికి జీవునియొక్క స్థూలదేహముతో పనిలేదు. ఇంతటి స్వప్న జగమును కల్పించిన జాణ ఒక్క శరీరమును సృష్టించలేక పోవునా! పాపము, మనస్సుగారు ఎంత శ్రమపడినను జాగ్రజ్జగమును తన కల్పనములో *ఆభాసించునట్లు చేసికొన్నదేకాని, దానికి స్థిరమగు సత్తను చేకూర్ప లేకపోయినది. అంతఃకరణమున నిదురించెడు సంస్కారములు ఒక క్రమమనునది లేక మేల్కాని ప్రతిభాసించుటే కాని, వస్తుతః యాథార్థ్యము వాటికి లేకుండుటయే ఇందుకు హేతువు. మనస్సుయొక్క ఈ కల్పనాసామర్థ్యమును జాగ్రదవస్థలో కూడ మనము గమనింపవచ్చును. మన మొకదానిని గూర్చి తదేకధ్యానముతో చింతించినట్లైన, మనము తలంచెడు విషయము మనకు తోచినట్లే, దానితో మనము వ్యవహారము నడుపుచున్నట్లే. అంతయు కన్నులకు సైతము కన్పట్టుచుండును. అట్టితఱి మన కన్నుల యెదుటనున్న వస్తువులుకూడ తోపక, మనము తలంచెడునదే సాక్షాత్కారమగుట పెక్కుర అనుభవములో ఉన్నది. కావున మనస్సు సంకల్పమాత్రముచేత ఎన్నింటినైన కల్పించి మనకు

---

*ఆభాస యనగా ప్రతిఫలనము. యథార్థముగా లేనిది ఉన్నట్లు తోచుట.

అనుభవములో నున్నట్లుగా చూపగలదని తెలియుచున్నది. అందుచేతనే ఆ మనోభావనలకు యథార్థ స్వరూపములేక, స్వరూపము యొక్క అభాన (ఉన్నట్లు కనుపించుట) ము మాత్రము ఉండుట కటస్థించుచున్నది. కావుననే లోకమునందు అనిత్యములగు వ్యవహారములను గూర్చి "అది స్వప్న వృత్తాంతముగా గడచిపోయినది" "కల వలె అయిపోయినది" మొదలగు రీతిని మాటాడుకొనుట వినుచున్నాము. ఈ స్వప్నజగమును కల్పించునది మనస్సే కాని, సాక్షియై చూచువాడు మాత్రము వేఱు. జీవుడు మనస్సాహాయ్యమున జాగ్రత్ప్రపంచమున పొందిన అనుభవమును బోలిన అనుభవమును మఱల మనఃప్రభావముచేతనే స్వప్నమునందును పొందుచున్నాడని తెలియదగును. స్వప్నకాలమున జీవునకుగల శరీరమును *సూక్ష్మశరీర మనియు, స్వప్నజగమును ప్రాతిభాసిక జగమనియు చెప్పుదురు. జాగ్రత్తునందు వలెనే స్వప్నమునందును నేనని మనము వ్యవహరించుచున్న జీవుడు, వానికి లోపలి సాధనమగు మనస్సును భిన్నములై యున్న విషయమును మఱువ జనదు.

ఇంక విచారింపవలసినది తృతీయావస్థ యగు సుషుప్తి. ఇందు మనస్సుగాని, సూక్ష్మశరీరముగాని కదలికలో నున్న జాడ కానము. ఒక సంకల్పముగాని, ఒక వికల్పముగాని, ఒక కోరికగాని, యేదియు కన్పట్టదు. బాహ్యాంతర్జగత్తులు రెంటియొక్క ప్రళయమే - అభావమే ఆ దశలో పొడకట్టునది. అట్లయినను అనుభవము లేకపోలేదు. ఏ పదార్థములు

---

*జ్ఞాన కర్మేంద్రియములు పది; పంచప్రాణములు, మనోబుద్ధులు అను పదునేడింటితో కూడినది సూక్ష్మశరీరము. దీనినే లింగదేహమనియు నందురు. ఆత్మ,సాక్షిరూపుడై యుండును. అంతఃకరణోపాధికమగు ఆత్మ ప్రతిబింబము జీవశబ్దవాచ్యమై సుఖ దుఃఖములను అందుచుండును.

లేనప్పుడు ఎట్టి అనుభవ ముండును? ఎట్టి క్రీడ యుండును? అని సామాన్యముగా ప్రశ్న పుట్టవచ్చును. ఇంచుక విచారించిన, నిద్రించిన వాడు 'హాయిగా నున్నదనియు, తాను చెప్పుటకు వీలుగాని ఒక ఆనందము ననుభవించితి ననియు, ఏ పదార్థమును పొడకట్టని ఒక అవ్యక్తదశ ఏదో తనకు అనుభూతమైన దనియు చెప్పుచుండుట యెల్ల రెఱింగినదే. కావున ఆ సమయమున సర్వపదార్థముల అభావరూపమైన అనుభవ మొక్కటి కలదని తెలుచున్నది. అభావముగాని, స్వభావముగాని, భావముగాని 'కలదు, లేదు' అని చెప్పుటకు వాటిని చూచిన ఒక సాక్షి కావలయునుగదా! సాక్షి, ప్రమాణము లేని మాటకు ఏటి విలువ! కావున నిద్రలో 'ప్రపంచాభావము' కలదు. అనగా అజ్ఞానము, ఏమియు తెలియకపోవుట కలదు." అను విషయమును అనుభవించిన వస్తు వొకటి ఉండవలసి యున్నది. సూక్ష్మముగా ఆలోచించినచో అప్పుడు అజ్ఞానము ననుభవించిన వస్తువొకటి ఉన్నట్లును తెలియుచున్నది. ఈ వస్తు వేది? దేహమా? అది ఎప్పుడో జడమై పడి యున్నది. ఇంద్రియములా? అవియు దానితోడివే కాని, విశేషము లేదు. ఇక ప్రాణము మాత్రము సుషుప్తియందును నిలిచిపోక లోపలికిని వెలుపలికిని సంచార మొనర్చు చున్నది. కాని ప్రాణమునకు గ్రహణశక్తి అనునది జాగ్రత్స్వప్నముల యందే లేదు, ఇక సర్వప్రళయమైనట్లు తోచు నిద్రలో దానికి తెలివి యెటనుండి కలుగును? పోగా ఇక మిగిలినది మనస్సు. ఏ మనస్సు జాగ్రత్తులోను, స్వప్నములోను జగన్నాటకమును నడపుచున్నదో, అట్టి మనస్సే సుషుప్తియందును అజ్ఞానరూపమైన అనుభవమును పొందుచున్న దని చెప్పవలయును.

స్థూలబుద్ధికి ఇది సమంజసముగా తోచిన తోచవచ్చునుగాని, సూక్ష్మ దృష్టి నవలంబించి చూచినచో-ఇది సరిగాదని తెలియును. సుషుప్తి

యందు మనస్సు నిద్రతక్క* తన సర్వ వృత్తులను నశింప నిమీలిత మగుచున్నది. అనగా వ్యాపారము నుండి విరమించుచున్నది. జాగ్రత్స్వప్నములయందు గాని తిరిగి చిత్తవృత్తులు, సంస్కారములును రేకెత్తవు. సుషుప్తిలో వృత్తిరహితమై అవిద్యయందు విలయము నందిన మనస్సే అజ్ఞానమును గ్రహించుచున్నదనుట సమంజసము కాదు. మఱియు మనస్సునకు స్వయం ప్రకాశకత్వము లేదనియు, స్వప్న జాగరములందే ఆత్మచైతన్యము దాని వృత్తులయందు ప్రతిబింబించినగాని, అది విషయములను గ్రహింప సాధన మగుట లేదనియు ఇదివఱకు చెప్పబడినది. కావున ఇట్లు నిమీలనము నందిన మనస్సును, అనగా పదార్థముల జ్ఞానము నెఱుంగక పడియున్న అవిద్యారూపమగు అంతఃకరణమునే - ఒక సాక్షి చూచి తదనుభవమును పొందుచున్నాడని తెలియుచున్నది. అయిన ఈ సాక్షి ఎవరు? ఏ సాక్షి నేనయి, జీవుడయి జాగ్రత్తులో అంతఃకరణ మొనర్చు సంకల్ప వికల్పముల నెఱుంగుచున్నాడో, ఏ సాక్షి మనస్సు కల్పించిన స్వప్న జగమున నానావిధ సుఖ దుఃఖముల నెఱుంగుచున్నాడో ఆ సాక్షియే ఇప్పుడు నిద్రయందలి పదార్థాభావ రూపమైన అజ్ఞానమును, (సర్వవృత్తులును లీనమగుడు నిద్రావృత్తికి మాత్రము వశమైన మనస్సును) చూచుచున్నాడు. జాగ్రత్స్వప్నములయందు తన ప్రాభవమును చూపి జీవుని నానామార్గముల నడిపించు మనస్సు ఇప్పు డేమూల దాగినదో, దాని శక్తి ఎక్కడ ఉడిగిపోయినదో విచారింపుడు. తన ఇంద్రజాలమంతయు మాటుమణగ నిద్రావృత్తిలో ప్రమగ్గి పడియున్నది. ఇట్టి కుంఠిత శక్తిగల మనస్సే ఆత్మ అగుచో ఈ తృతీయావస్థ యందు (మనస్సు

---

*ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులు చిత్తవృత్తులనియు, అందు అభావ ప్రత్యయాలంబనమైన వృత్తిని నిద్ర యనియు పాతంజల యోగశాస్త్రము చెప్పుచున్నది.

లేనపుడు) దాని లేమిని గ్రహించుచున్న ద్రష్టయొకడు కన్పట్టుచున్నాడే కావున మనస్సెన్నటికిని నేను కాజాలదు. ఆ అజ్ఞానమును గ్రహించెడు పదార్థము వేఱు. అదియే ఆత్మ. దాని నుద్దేశించియే నేను అను వ్యవహారము తగును. జాగ్రత్స్వప్నములయందు మనః ప్రభావముచేత స్పష్టముగా గోచరింపని ఆ ఆత్మరూపుని జాడ ఈ సుషుప్తిలో విస్పష్టమయి పోయినది. ఇప్పుడు మనస్సుకంటెను ఆత్మకు ప్రత్యేకమైన సత్త (ఉనికి) సిద్ధించినది. ''నా మనస్సు'' మున్నగు వ్యవహారములందు నేనునకు, మనస్సునకును భేదము కన్పట్టినను, యథార్థమునకు మనస్సే నేనుశబ్దవాచ్యమనుకొని వాచపౌలభ్యమును సంపాదించుకొంచ మనుకొన్న గతి తప్పినది. ఆత్మదర్శనమే మోక్షాని, ఆత్మయొక్క సత్త మాత్రము స్థిరమైనది. సుషుప్తిలో ఏ వస్తువును మనము పట్ట జాలితిమో అట్టి జీవాత్మ కారణ దేహమును ధరించి గోచరించినది.

జాగ్రత్స్వప్న సుషుప్తులయందు క్రమముగా స్థూల సూక్ష్మ కారణదేహములను ధరించి ఆ శరీరములకంటెను,ఇంద్రియములకంటెను, మనఃప్రాణముల కంటెను విలక్షణుడును విరుద్ధస్వభావుడునయి సర్వసాక్షిరూపమున గోచరించునాతడే జీవుడు; నేను. అదియే ఆత్మ. స్వయంప్రకాశ రూపుడగు నాతనికి ఈ మనఃప్రాణశరీరములుగాని, వాగాదీంద్రియములుగాని సాధనములు మాత్రమే. ఈ అంశము రాబోవు అధ్యాయమున వివరింపబడు 'ఆత్మానం రథినం విద్ధి' అను కఠవల్లిలోని శ్రుతి సందర్భమున సప్రమాణముగ తెలియబడ గలదు. మానవుడు భ్రాంతి వశమున అట్టి సర్వప్రకాశకమును, సర్వసమర్థమునగు పదార్థమును శరీరేంద్రియ కరణసమూహముగా భావించుట మౌఢ్యము. స్థూల సూక్ష్మ కారణ శరీరములందు ఆత్మనకు గల తాదాత్మ్యభావమే (ఆ దేహములే

స్థానముకాను అభిమానము ఆతని జీవునిగా చేసి సుఖదుఃఖములను కుడుపుచున్నది.

దేనిని కన్ను చూడలేదో, దేనిచేత కన్ను చూడగలుగుచున్నదో, దేనిని చెవి వినలేదో, దేనిచేత చెవి వినగలుగుచున్నదో, దేనిని ముక్కు మూర్కొనలేదో, దేనిచేత ముక్కు వాసన చూడగలుగుచున్నదో, దేనిని చర్మము తాకజాలదో, దేని యొక్క కలిమిచే అది వస్తువులను స్పృశింప గలుగుచున్నదో, దేనిని నాల్క ఆస్వాదింపలేదో, దేనిచే అది ఆస్వాదింప గలుగుచున్నదో, దేనిని వాక్కు నిర్వచింపలేదో, దేని యొక్క ఉనికిచే వాక్కు వ్యవహరించుచున్నదో, దేనిని మనస్సు భావింపలేదో, దేని ప్రభావమున మనస్సు భావింప సమర్థమగుచున్నదో, ఇం ద్రి య గోచరము కానిదియు, సర్వేంద్రియ గుణములను ప్రకాశింప జేయుచు ఇంద్రియ వర్జితమైనదియు ''యతో వాచో నివ ర్త న్తే అప్రాప్య మనసా సహ'' అనునట్లు మనోవాగతీతమై పరగునదియు అగునట్టి పదార్థమే ఆత్మ యని ఉపనిషత్తులు గానము చేయుచున్నవి.

అట్టి ఆత్మ తన సూక్ష్మోపాధితోకూడ ఈ శరీరము నుండి తొలగిన నాడు ఈ దేహ మెందుకును పనికిరాక చచ్చినదగును. ఇంక దగ్ధస్థితియే కాయమునకు పట్టవలసినది, ఈ శరీరమును ఇంతపఱకును ప్రేమించు చుండిన జనమే దానిని గర్హించి దగ్గఱకేనియు పోక దూరముననే వీక్షింతురు. ఆ శరీరమునకు సంబంధించిన కన్ను, ముక్కు మొదలగు ఇంద్రియములు చూచుట, మూర్కొనుట, మున్నగు క్రియలను జరుపజాలవు. ప్రాణ మెప్పుడో తొలగి చన్నది. అంతఃకరణ విశిష్టమైన సూక్ష్మశరీరము నే వనువానితో కూడ తన సర్వవాసనలను తీసికొని పోయినది. ఇక ఇక్కడ మిగిలినది తమోమయ పంచభూత వికారమగు మేను మాత్రమే. పలు రంధ్రములు గల కుండలోని దీపము ఆరిపోయిన,

ఆ పెట్టెలోనుండి వెలుగు ఎట్లు వెలుపలికి రాజాలదో, అట్లే శరీరమను ఘటములోని ఆత్మ ప్రతిబింబము అంతర్హితమగుడు, ఇంద్రియ ద్వారములనుండి జ్ఞానప్రకాశము బహిర్గతము కాదు. ఎప్పుడు శరీరాధిష్ఠాత శరీరమును వీడి చనెనో, అప్పుడు గృహపతి లేని గృహమువలె దేహము పాడువడక తప్పేది ఏమి? ఆ గృహమును గూర్చి ఇక ఇతరజనులు రాకపోక లొనర్పరు గదా! ఇప్పుడు చచ్చినది భూతవికారమగు స్థూలశరీరమనియు, శక్తి ప్రకాశకుడయి శరీర విలక్షణుడైన నేను (ఆత్మ) చావలేదనియు గ్రహింపవలయును.

ఈ అంశము మృతునిగూర్చి వ్యవహరించెడు 'ప్రాణి పోయినది' 'ప్రాణములు విడిచినాడు, దేహత్యాగము చేసెను' మొదలగు మాటలయందు సువ్యక్తమగుచున్నది. ప్రాణి యనగా ప్రాణములను ధరించి జీవపద వాచ్యుడైన ఆత్మ యని యెఱుంగుదుము. అట్టివాడు (శరీరమునుండి) పోయినాడనుచున్నాము కాని, చచ్చినాడనుట లేదు. అట్లే ప్రాణములు విడచినాడన్నను, ఎవ్వడు ఇంతవఱకు ప్రాణములను కలిగి యుండి వాటితో క్రీడించుచున్నాడో, అట్టివాడు వానిని విడిచెనని అర్థమే కదా! ఇప్పుడును ప్రాణములే పోయినవి కాని, వాటిని కలిగినవాడు నశింపకుండుట సువిదితము. ఇట్లే దేహత్యాగము చేసెననుటను, దేహముకల దేహిశబ్దవాచ్యుడొకడు దానిని విడిచిపెట్టెనని తెలియుచున్నది. ఆటవస్తువుతో ఆడుకొను బాలుడొకడు ఆడినంత సేపాడి కడకు దానిని అవల పాఱవేసి పోవునట్లే, ఆత్మయు ఆడినంత సేపాడి కర్మానుగుణముగ తుదకు దేహమును వీడు చున్నదని భావము. ఆటవస్తువు పోయినంత పిల్లవాని కెట్లు నాశము లేదో, దేహము పోయినను జీవున కట్లు నాశము లేదని ప్రకృతమున ఎఱుంగవలసిన రహస్యము.

అట్లగుచో 'రాముడు వచ్చెను, భీముడు మరణించెను' మున్నగు వ్యవహారములయందు నేను శబ్దముచే చెప్పబడుచున్న శరీరాధిష్ఠాతలగు రాముడు భీముడు వచ్చినట్లు కాగా, మీరన్న నేను శబ్దవాచ్యమగు ఆత్మ వచ్చినట్లు కాలేదా, అని పూర్వపక్షి శంకింపవచ్చును. కాని ఇచ్చట రాముడు భీముడను పదములు నేనును గూర్చి ప్రవర్తించినవికావు. నేననువాడు ధరించిన శరీరమును గూర్చియే లోకులు ఆ శబ్దములను ప్రయోగించుచున్నారు. లోకమున ప్రతివాడును రామ భీములను శరీరములుగా మాత్రము తలచి వాటితో వ్యవహారములు సేయుచున్నారుకాని, శరీరాంతర్వర్తియగు జీవాత్మ ఈ శరీరములో ఉండుటచే దానికి రామనామమును, భీమనామమును పెట్టి వ్యవహరించు చున్నామను జ్ఞానము జనసామాన్యమునకు లేదు. కాబట్టి 'రాముడు వచ్చెను' మొదలగు వ్యవహారములయందు లోకులు తలంచెడు రాముడు మన దృష్టిలో నేను పదముచే చెప్పదగిన రాముడు ధరించిన శరీరమును ఉద్దేశించినదేకాని, శరీరినిగూర్చినది ఎంత మాత్రమును కాదని విచారించిన తెలియగలదు. పామర జనమునకు శరీర జ్ఞానము తక్క ఆత్మజ్ఞానము లేదనుట దోషముకాదు. మఱియు ''రాముని జీవాత్ముడు ఎక్కడో పుట్టి వుంటాడు.'' మొదలగు పలుకులను బట్టి చూచినను వారు తలంచు రాముడు శరీరమనియే తేలుచున్నది. శరీరమునకు వేఱుగానున్న జీవాత్మనిగూర్చి పోయినట్లు వారు చెప్పినను, ఆ పోయిన జీవాత్ముడు రాముడు కాదనియే వారి తలంపు. కావున ''రాముడు వచ్చెను'' మున్నగు తావుల రాముడు శరీరమే కావున అట్టి శరీరము వచ్చినదన్నను మనకు ఇష్టమే కాని, నష్టము లేదు. జ్ఞానులు వ్యవహారమున రామ భీమ శబ్దములచే చెప్పకొను జీవాత్మ ఎన్నటికిని చావనే చావకుండుట తెల్లమే కదా! ఈ ఆత్మ నిత్యత్వమునుగూర్చి తరువాత ఇంకను గాఢముగా విశదీకరింపబడును.

శరీరమే రాముడనుకొన్న మూఢుల అజ్ఞానమును ఇచ్చట ఇంక కొంత పరికించి చూతము. దేహము మాత్రము రాముడగుచో అట్టి దేహము మరణించిన పిమ్మట ఎక్కడకు పోయినది? చైతన్యము మాత్రము లేక పడియున్న శరీరము ఉండియే యున్నది. అజ్ఞానులు రాముడుగా భావించి ఇంతవఱకు ఏ శరీరముతో వ్యవహారము జరుపుచున్నారో, అట్టి శరీరముతో ఇప్పుడు మాత్రము ఏల వ్యవహారము సాగింపరాదు? కావున ఇంచుక దీర్ఘముగ ఆలోచించినచో వీరు భావించు రాముడు శరీరము కాదనియు, అట్టి శరీరము కదలుచు మెదలుచు కార్యరంగమున నడయాడుటకు ఒండొక శక్తి లోపల ఉండియుండు ననియు, అయ్యది ఇప్పుడు కనబడక మాయమైపోయిన ప్రాణమో, లేక ఆ ప్రాణమును గూడ పిడికిట బట్టియున్న ఒండొక ప్రాణియో అని గోచరింపక పోదు. ఏ జ్ఞానశక్తి ఇంతవఱకును దేహేంద్రియములను ఆడించుచున్నదో, అట్టి శక్తి ఇప్పుడు తిరోహితమగుట మానవులు భావింపరాదా? అట్లు తలంచినచో వీరు రాముడనుకొన్నది శరీరము మాట పొరపాటనియు, రాముడనువాడు ఈ శరీరమును గూడ కదలించి కర్మసమర్థమొనర్పగలవాడనియు, పామరులగువారు అట్టి శక్తితో తాదాత్మ్యమును పొందిన ఆ శరీరమునే శక్తియని తలచుచున్నారనియు, జ్ఞానులదృష్టిలో రామశబ్ద వాచ్యమైన సర్వశక్తి-అఖండజ్ఞానమే ఇప్పుడు దేహమునుండి తిరోహితమైనదనియు సుస్పష్టమగును. అట్టి జ్ఞానప్రభ మఱల ఏ కాలమున, ఏ తావున ఏ విధమైన శరీరమును ధరించి ఈ ప్రాపంచిక క్రీడకు దొరకొనునో ఎవ్వరెఱుంగుదురు?

ఇంతయేల, "రాముడుగాని, భీముడుగాని శరీరమని చెప్పుటలేదు. శరీరాంతర్వర్తియై 'నేను, నాది' యనుకొనుచు సర్వవ్యవహారములను చేయు జీవుడే రాముడనియు, భీముడనియు" మే మెఱుంగుదుము.

అన్నపానములవ రాముడు భీమాది శబ్దములచే పిలువబడునట్టి జీవాత్మయే మరణించుచున్నది. ఇప్పుడు 'రాముడు వచ్చెను, భీముడు మరణించెను' అను మా వాక్యములు అసత్యము లేలయగును ?'' అను సెలవల, ఇది మిక్కిలియు హాస్యాస్పదమగును.

ఆత్మ నశించునదికాని, పెరుగునదికాని, తరుగునదికాని కాదు. ఆకాశమువలె సర్వగతము, నిష్క్రియము, నిరంజనము, నిరవద్యము, శాంతము. అది నిరవయవమైన పదార్థము. నిత్య నిరంజనమై కాలత్రయమందును ఏకరూపముగ వెలుగొందునట్టిది. నశించునట్టి శరీరములందున్నను దానికి నాశము లేదు. వికారముల నందెడి దేహముకాని, మనస్సుకాని దానికి వికారములను కలిగింపలేవు. దానిని నిప్పు కాల్పజాలదు. నీరు తడుపనేరదు. గాలి ఎండింపలేదు. అస్త్రశస్త్రాదులు ఖండింపనేరవు. సర్వబ్రహ్మాండములయొక్క బాహ్యాభ్యంతరముల నిండియున్నది ఇదియే. అట్టి నిత్య వస్తువే నశించుట-నిప్పునకు చెదలంటుట. నశ్వరములైనట్టివి దేహాదులే. అట్టి దేహాదులకును కారణమై శరీరములకెల్ల మహాకారణ శరీరమును, ప్రాణములకెల్ల మహాప్రాణమును, ఆత్మలకెల్ల పరమాత్మయు నగు వస్తువు నాశము లేనిదను విషయము పోను పోను ఇంకను విస్పష్టముగ తెలియగలదు. మఱియు ఆత్మ నశించునన్న ప్రతివాది మతమున కలిగెడి దోషములనుకూడ తెలిసికొందము.

జీవుడన్న శరీరాభిమానియగు ఆత్మయని ఎఱుగుదుము. అట్టి జీవుడు నశించినచో అతడు దేహమును ధరించి దీనితో చేసిన పుణ్యపాపములు ఇంతటితో నాశనమందవలసినవే కదా ? అట్లయిన సుకృత దుష్కృతములయొక్క కర్తవ్యాకర్తవ్యబుద్ధి యేల ? ఇష్టమువచ్చినవిధమున ప్రవర్తించుటకు అడ్డము లేకపోవుకదా. కావున జీవుడు నశించునాదన్న, అతడు చేసిన కర్మలను వ్యర్థము కావలసివచ్చును. ఇది దోషముకాదా ?

జీవుడు పూర్వసిద్ధుడుకాక, హఠాత్తుగా పుట్టి కొన్నాళ్లు శరీరములో నాటక మాడి నశించుచున్నాడన్నచో, ఈ దేహమున అత డనుభవించు సుకృత దుష్కృత కర్మ ఫలములు ఎప్పుడు చేసినవి ? చేయకున్న ఎక్కడినుండి వచ్చినవి ? నిర్నిమిత్తముగా వచ్చుననుట మీ కిష్టమా ? అట్లయిన అందఱు జీవులయొక్క జాత్యాయుర్భోగములు ఒక్కమాదిరిగా ఉండ కుండుటకు కారణ మేమి ? తెలివితేటలలోనేమి, ప్రవర్తనయందేమి, ఇంతింత విభేదములు ఏల కలుగఫలపిషన్నైను ? కావున ఇది యొక తప్పు. వస్తుతః-కృతప్రణాశము, (చేసిన కర్మ వృథగా నశించుట) అకృతాభ్యాగమము (చేయని కర్మల ఫలము వచ్చుట) అను రెండు దోషములు జీవ (ఆత్మ) నాశమును చెప్పువారి మతమున తప్పక సంభవించుచున్నవి. అప్పుడిక చార్వాకమతమే నెత్తిపై కెక్కినట్లు. కావున ఆత్మనాశవాది యే మాత్రము యుక్తాయుక్త విచారము కలవాడైనను రెండు కొసలయందును ఉచ్చులు గల ఈ త్రాడు ఆతని మెడకు పడక తీఱదు. అందుచే ఆత్మ వినాశవాద మెంత మాత్రమును సమంజసము కాదు.

శరీరమునకంటెను, ఇంద్రియములకంటెను, ప్రాణములకంటెను, మనోబుద్ధులకంటెను భిన్నుడయి సర్వవ్యవహారములయందును వానిని సాధనముగా చేసికొని ప్రవర్తించు 'నేను' ను కనుగొన గలిగితిమి. ఇక ఇతని స్వరూపమును గూర్చి విచారింపవలసి యున్నది. ఏ రూపమున ఈ ఆత్మ శరీరమున వెలుగొందు చున్నదియు తెలిసికొన్న పిమ్మటగాని, ఆ 'నేను'నకు కావలసినదానిని అన్వేషింప వీలుపడదు. లోకములో నైతము ఒక ప్రాణి తన స్వరూప స్వభావములకు అనువగు పదార్థములను వెదకి కొని, ప్రయోజనములను సంపాదించుకొనుట ఎఱుఁగుదుము. పులి తినవు కోసముగాని, ఆవు మాంసముకోసముగాని, పాటుపడుటయు, దొరకినప్పటికిని తినుటయు ఎందును ప్రసిద్ధముకాదు. కావున ప్రకృతమున ఆత్మ స్వరూప స్వభావముల విచారణము ఆవశ్యకము.

# ఆత్మస్వరూపము

"స వా ఏష మహానజ ఆత్మాఽజరో
అమృతోఽభయో బ్రహ్మాభయం వై
బ్రహ్మాభయం హి వై భవతి య ఏవం వేద"

— బృహదారణ్యకోపనిషత్తు. 4.4.25.

పూర్వము వర్ణింపబడిన ఈ ఆత్మ జన్మ,జరా,మృత్యువులు లేని అమృతస్వరూప మైనది.అవిద్యాలక్షణములగు భయాదులు లేనిది. ఇంత యేల ? అది సాక్షాత్పరబ్రహ్మయే ! దీని నెఱింగినవాడుకూడ స్వయముగా బ్రహ్మమే అగుచున్నాడు.

జాగ్రదవస్థయందు ఇంద్రియములు-శబ్దము, స్పర్శము, రూపము, రసము - మొదలగు నానావిషయములను గ్రహించుచున్నవి. అనగా బాహ్యజగమునందలి వివిధ పదార్థములను ఎఱుంగుచున్నవి. మనస్సు కూడ సంకల్ప వికల్పాదులను చేయుచు అంతర్జగత్తునుండి ఇంద్రియముల ద్వారమున వెలుపలి ప్రపంచమున సంచారము చేయుచున్నది. వెలుపలి జగమునందలి విషయములు, వస్తువులు, నానావిధములై యున్నవి. ఒకదానికి ఇంకొక దానితో ఐక్యము లేదు. శబ్దమునకన్న స్పర్శము, స్పర్శమునకన్న రూపము, రూపమునకన్న రసము, దానికన్న గంధము పరస్పర భిన్నములు. [illegible] చెట్టుకంటెను పుట్ట, పుట్టకంటెను స్తంభము, దానికన్న ఘటము, ఘటముకంటె పటము మిక్కిలియు భిన్నములని యెల్లరెఱింగినదే. ఈ నాన పదార్థములకు ఐక్యమున్నదని యెవ్వరును చెప్పజాలరు

వెలుపల నున్న పదార్థములలో నానాత్వము, భిన్నత్వము ఉన్నప్పటికిని జాగ్రద్దశలో కలిగెడి వీటి అన్నింటిజ్ఞానము ఏది కలదో అది మాత్రము ఏకరూపమే. ఘటమనియు, పటమనియు, పశువనియు, మనుష్యుడనియు ఈ జ్ఞానము ఘట పటాది రూపములచే భిన్నమగుట లేదా యని తలంప జనదు. ఘటత్వ పటత్వములు వస్తువిష్ఠములైన భేదములే కాని, జ్ఞానమునకు సంబంధించినవికావు. ఘటముయొక్క తెలివిగాని, పటము యొక్క తెలివిగాని, మఱొక విషయముయొక్క, పదార్థముయొక్క తెలివిగాని జ్ఞానరూపమైనట్టిదే. దానికి భేదము లేదను విషయమును సూక్ష్మముగా విచారించిన తెలియగలము. జ్ఞానము చైతన్యాత్మకము. దానికి గోచరించిన పదార్థమును అది ప్రకాశింపజేయుటే (గ్రహించుటే) దాని స్వభావము. అద్దమొక్కటే అయినను, దానికి ఎదుట నున్న యే వస్తువు నైనను అది తనలో ప్రతిఫలింప జేసికొన గలదు. ఎన్నింటిని ప్రతిబింబింప జేసికొనుచున్నను అద్దము ఒక్కటే కదా! దానికి మార్పు గాని, మఱే వికారముగాని లేదు. అట్లే ఎన్నివస్తువులను చూచుచున్నను, కన్ను మార్పులేక ఒక్కటే విధమున ఉండునని మన మెఱుంగుదుము. ఈ విధమువనే నానాపదార్థములను, విషయములను గ్రహించు జ్ఞానముకూడ ఒక్కటేయై ఏకరూపమున తేజరిల్లుచున్నది. ఎట్లన. మనోవృత్తి ఇంద్రియముల ద్వారమున వెలుపలి పదార్థములయందు వ్యాపించును. మనోవృత్తియందు ప్రతిఫలించిన ఆత్మచైతన్యము మనస్సు ఏవిషయ ముపై పడునో దానిని ప్రకాశింప జేయుచుండును. ఇప్పుడు చూడుడు, జ్ఞానమునకు భేద మున్నదియు లేనిదియు తోపగలదు. ఒక్కటే దీపము పెక్కు పదార్థములను ప్రకాశింప జేసినంత మాత్రమున ఆ దీపము యొక్క స్వరూప స్వభావములు (ప్రకాశాదులు) మాఱ నక్కఱ లేదు కదా! ఏ వస్తువుమీద పడినను ఒక్కటే వెలుగు.

గ్రహించు స్వభావముగల ఈ జ్ఞానము గ్రహింపబడు నానాపదార్థములకంటె భిన్నమై తీరవలయును. తనకు భిన్నములగు పెక్కు విషయములను జూచెడి కన్ను ఆ చూడబడువాటికంటెను భిన్నమై ఉన్నట్లు, ప్రకాశింపజేయు దీపము ప్రకాశింపబడు వస్తువులకన్న వేఱైనట్లు ఈ జ్ఞానముకూడ తనకు విషయములగు పదార్థములకన్న నియతముగా భిన్నమై ఉండవలయును. కావున జాగ్రదవస్థలో పదార్థములు, వాటికంటె భిన్నమయిన జ్ఞానము ఉన్నట్లు స్పష్టమగుచున్నది.

అట్లే స్వప్నావస్థయందును నానాపదార్థములును వాటిని గ్రహించు జ్ఞానము ఉన్నదని ఎఱుంగ వచ్చును. స్వప్నములో కల్పితమైన ప్రపంచమును చూచు ద్రష్ట ఒకడు కలడని పూర్వము తెలిసికొని యుంటిమి. మఱియు కలనుండి మేల్కాంచిన పిదప అందలి అనుభవములను చెప్పుకొనుచున్నాము కావునను, అందు వివిధ విషయములను గ్రహించు జ్ఞానము కలదని రూఢి యగుచున్నది. స్వప్న జ్ఞానమునకును, జాగ్రద్ జ్ఞానమునకును భేదము అవంతయు లేదు. దేనిని గ్రహించుచున్నను ఆ గ్రహించు జ్ఞానము ఒక్కటే అయి తీరవలయునని పూర్వమే సదృష్టాంతముగా నిరూపింపబడెను. కావున పదార్థములు, వాటికంటెను భిన్నమయిన జ్ఞానము అనునవి రెండవస్థలయందును సమానమే. ఇక స్వప్న జాగరములకు కల భేదము పదార్థముల సత్యత్వమునకు మాత్రము సంబంధించినది. స్వప్నములోని వస్తువులు జాగ్రత్తులో ఉండక మెలకువరాగనే నశించుచున్నవి. కాని ఆ పదార్థములను గ్రహించెడు జ్ఞానము మాత్రము నశింపక శాశ్వతమయి జాగ్రత్తునందును నిలిచియున్నది. మెలకువలో స్వప్నవృత్తాంతమును స్మరించుచున్నాము కావున నాటి అనుభవజ్ఞానము స్థిరమని ఊహింపవచ్చును. కావున స్వప్న జాగరములు రెండింటియందును ఏకరూపమైన జ్ఞానము మాత్రము నశింపక నిలిచి యున్నదనియు, జాగ్ర

ద్వస్తువులవలె స్వప్న పదార్థములు స్థిరములుకాక కేవలము మనస్సంకల్ప మాత్రమున కల్పితములైన సంకల్పాకారములనియు ఎఱుంగవలయును.

ఇక మూడవదగు సుషుప్తిలో పదార్థములు లేవు. కాని పదార్థాభావమును గ్రహించు జ్ఞానము మాత్రము లేకపోలేదు. నిదురించినవాడు "నా కేమియు కన్పడలేదు, ఏమియు తెలియకపోవుట తక్క వేఱొక విశేషమును నేనెఱుంగను" అను చున్నాడు. కావున అప్పుడు జ్ఞానము కలదని రుజువగుచున్నది. అజ్ఞానముకాని, సుజ్ఞానముకాని, పదార్థములు కాని, తదభావముకాని కలదు లేదని చెప్పుటకు ఆ అనుభవమును హొందిన ఒక సాక్షి కావలయునని పూర్వము తెలిసికొంటిమి. కాబట్టి సుషుప్తిలో అజ్ఞానమును గ్రహించు జ్ఞానము ఒకటి కలదని నిస్సంశయముగా తెలియు చున్నది. అది తనచే గ్రహింపబడు అజ్ఞానమునకంటెను భిన్నమును, స్వప్న జాగరములయందలి జ్ఞానమువలె ఏకరూపమును, నిత్యమును అని యెఱుంగవలయును.

ఒక్కనాడు అనుభవింపబడిన జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడవస్థలయందలి ఈ జ్ఞానము మార్పులేక యేక రీతినే ప్రకాశించుటను ఎఱింగితిమి. ఈ ప్రకారమే నిన్నటి జ్ఞానముగాని, మొన్నటిజ్ఞానముగాని, నెలనాటిజ్ఞానముగాని, సంవత్సరమునాటి జ్ఞానముగాని, యుగములనాటి జ్ఞానముగాని, కల్పములనాటి జ్ఞానముగాని అనంతముగా ముందు రాబోవు కాలమునందలి జ్ఞానముగాని మార్పులేక ఒకే రీతిని ప్రకాశించుననువిషయము దీనిచే స్పష్టమగుచున్నది. అవస్థాత్రయమునందలి ఆ యా కర్మలకు సాక్షిభూతమగానున్న ఈ సంవిత్తు (జ్ఞానము) కాలత్రయమునందును అవికృతమై విలుచునట్టిదే. దీనికి నాశమనునది లేదు. ప్రపంచోత్పత్తికి ముందును పిమ్మటను, ప్రళయానంతరమున్నాడ నిత్యమై ప్రకాశించుచు, ఈ ప్రపం

భమయొక్క అవస్థ స్థితి భంగములను కూడ పరికించున్నట్టి సర్వసాక్షి ఇదియే.

ఈ సంవిత్తు చైతన్యాత్మకమని మున్నే చెప్పకొనియుంటిమి. ప్రపంచమున చిజ్జడములు (చిత్తు, జడము) తప్ప ఇతరములు లేవు. ఆ రెంటిని బట్టియే చేతనాచేతన వ్యవహారము ఆకాశాది భూతములును, వాటి వికారము లగు పదార్థములును జడములు: తద్భిన్నమైన ఈ జ్ఞానమే చైతన్యము. నిఖిల ప్రాణుల యొక్క స్థూల సూక్ష్మ కారణదేహములు జడములు. మృత్పిండమగు శరీరము, అందలి ప్రాణము, సూక్ష్మ పంచ భూతములచే ఏర్పడిన ఇంద్రియములు జడములన్న సంగతి విస్పష్టము. ఇక అంతరింద్రియమగు అంతఃకరణము కూడ భౌతికమే. సూక్ష్మ పంచ మహాభూతముల యొక్క సత్వగుణాంశములచే ఇది యేర్పడుటచే పంచేంద్రియ విషయములందు వ్యాపింప వలతియై, వివిర్మలమగుటచే ఆత్మ చైతన్య ప్రతిబింబమును పడయ సమర్థమై ఉన్నదేకాని, యథార్థమునకు అది భౌతిక (జడ) పదార్థమే కాని ఇతరము కాదు. చైతన్య ప్రతిబింబ మును బింబింపజేసికొనబట్టియే తన వికారముల నన్నింటిని కూడ నిర్వి కారుడగు పురుషునికిని కలిగినట్లు మోహపెట్టుచున్నది. చైతన్యము స్వయముగనే ప్రకాశింపగలది కావున, తనంతటతానే వెలుగు దీపము స్వయంప్రకాశకత్వము లేని వస్తువులనువలె, స్వయంప్రకాశము లేని జడవర్గమును ప్రకాశింపజేయ గలుగుచున్నది. మఱియు ఈ చైతన్య వస్తు చావు పుట్టుకలు గల జడవస్తువులయొక్క వికారములనుకూడ సాక్షి రూపముగ చూచుచున్నది. ఈ జ్యోతి ఒకప్పుడు పుట్టలేదు; ఇక ప్పుడు మాత్రమే ప్రకాశించి ఉండలేదు. కొంత కాలమే ప్రకాశించి అవల అరిపోదు. కావున ఇది నిత్యమనుట ముమ్మాటికిని సత్యము.

బాల్య కౌమార యౌవన వార్ధకములనెడి నాల్గుదశల యందును, జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను మూడవస్థలయందును ఏకరూపముగ ప్రకాశించెడి ఈ జ్ఞానమే నేను. ఇది త్రికాలాబాధ్యము; త్రికాలసిద్ధము. నేను శబ్దముచే ఎఱుంగబడిన ఈ చైతన్యమే ఉపాధితాదాత్మ్యమున జాగ్రద్దశయందు స్థూలదేహముతో సర్వప్రపంచ వ్యవహారములను నడపుచున్నది. స్వప్నావస్థయందు స్థూలదేహము లేకున్నను, సూక్ష్మ దేహముతోడనే స్వప్నానుభవములను పొందుచు ద్రష్టయై ఒప్పుచున్నది సుషుప్తియందు ఆ సూక్ష్మ శరీరమునుకూడ విడిచి కారణదేహమును ఆశ్రయించి అజ్ఞానానుభవమును పొందుచు సాక్షియై మిగులుచున్నది. సమాధియందు ఆ కారణ శరీరమును కూడ దాటి స్వ స్వరూపమునందు-తనతోనే ఏకమాత్రమై క్రీడించుచున్నది. ఇప్పుడు చూడుడు. జాగ్రత్తు నుండి స్వప్నములోనికి పోవుతటికి స్థూలదేహముయొక్క ఉనికి పొడ కట్టబలేదు. అటనుండి సుషుప్తిలోనికి అరుగునప్పటికి సూక్ష్మదేహము కన్పట్టుట లేదు. అక్కడనుండి సమాధిలోనికి చనునప్పటికి కారణశరీరము ఉండుట లేదు. కాని ఈ నాల్గు దశలయందును ఆత్మమాత్రము నశింపక సాక్షిభూతముగ నిత్యమై తేజరిల్లుట కనుచున్నారము. ఈ చెప్పిన మూడు కాలములయందును ఆయా అవస్థలకు చెందిన శరీరములు బాధింపబడు (మాయమగు) చున్నవేకాని, శరీరాధిష్ఠాతయగు "నేను" నకు బాధ లేదు. అతడు ఎల్లవేళలను అఖండముగ ప్రకాశించుచునే ఉన్నాడు. శరీరములు ఒకప్పుడు ఉండి ఒకప్పుడు లేకపోవుటచే అవి త్రికాల సిద్ధములు కావు. కనుక అనిత్యములు, మాయా కల్పితములు. ఆత్మ త్రికాల సిద్ధము; నిత్యము. అది నిత్యము కానిచో అనిత్య పదార్థముల జ్ఞానము దానికి కలుగనేరదు. లోకములో ఒక అనిత్య వస్తువును వేఱొక అనిత్య వస్తువు ఎఱుంగుట కల్ల. చెట్టును చెట్టన్నటికిని తెలియజాలదు. తద్భిన్న మగు ప్రాణియే దానిని ఎఱుంగ సమర్థమగును. 'నేను' మార్పు లేనిది.

కావుననే అది పలువిధములైన మార్పులను ఎఱుంగ గలుగుచున్నది. ఎల్లప్పుడును మాఱు స్వభావము గలది మార్పులను కనిపట్టలేదు. కనుక మార్పు అనిత్యము. మార్పు లేకపోవుటయే నిత్యత. నేను ఏకరూపము. కావుననే ప్రకృతిలోని అనేకత్వమును అది గుర్తింప గలుగుచున్నది. నేను భేదములేనిది. కావుననే అది పలుభేదములను పసిపట్టుచున్నది. నేను అక్షరము. కావుననే అయ్యది క్షరముల నన్నింటిని తెలియ గలుగుచున్నది. నేను సదాత్మకము. కావుననే అసత్తు దానకి గోచరమగు చున్నది. నేను జ్ఞానఘనము. కావుననే అజ్ఞానమునకును ప్రకాశక మగు చున్నది.

ఈ విమర్శచేత ఆత్మ (నేను) జ్ఞానస్వరూపమనియు, నిత్యమనియు విస్పష్టమైనది. అనగా ఆత్మస్వరూపము సత్తు (శాశ్వతము - సత్యము)ను, చిత్తు (చైతన్యాత్మకము - జ్ఞాన స్వరూపము) ను అని యెఱింగితిమి. సత్తనగా ఎల్లప్పుడు స్థిరముగా ఉండునది. చిత్తనగా ప్రకాశస్వరూప మైనది. ఈ రెంటిచేతనే కాక, వేఱొక లక్షణముచేత కూడ ఆత్మస్వరూప మును ఎఱుంగవచ్చును. అదియే ఆనందము.

ఆత్మ ఆనంద రూపము. ప్రపంచమున ప్రేమాస్పద వస్తువులెల్ల నియతముగా ఆనంద స్వరూపములై ఉండవలయును. ప్రతివాడును తన్ను తాను ప్రేమించుకొనుట సర్వానుభవసిద్ధము. కావున తానగు ఆత్మ ఆనందస్వరూపమై ఉండునని యెఱుంగదగు. ఇంక విశేష మేమన? లోకములో అన్ని పదార్థములును ఒక్కతీరైన ఆనందమునే కలిగించుట లేదు. కొన్ని అల్పానందమును, కొన్ని అధికానందమును కలిగించు చున్నవి. ఏ పదార్థము ఎంతెంతగా ఆనందమును కలిగించుచుండునో దానిపై అంతంతగా ప్రీతిని ప్రకటించుచుందుము. దీనిననుసరించి చూచి నచో ఏ వస్తువు మన పరమప్రేమకు ఆస్పదమై యుండునో, అదియే

నిరతిశయ సుఖస్వరూపమనియు, పరమానందస్వరూపమనియు నిర్ణయించుకొనుట పొరపాటు కాదు. మానవుడు తన గృహారామ క్షేత్రాదులకంటెను, పితృ పుత్త్రీ భ్రాతృ కళత్రములకంటెను తన్నే సర్వాధికముగా ప్రేమించుకొనుచున్నాడు. ఒక్కొక్కపరి ఆత్మరక్షణ మొనర్చుకొనవలసి వచ్చినచో పైని నుడివినవారిని కూడ తృణప్రాయముగా త్యాగముచేసి తన్నే రక్షించుకొనుట మన మెఱుంగుదుము. ఇప్పట్టున వారియందుకంటెను తనయందు అధిక ప్రేమము లేకున్నచో వారిని వదలుకొనుటయు, తన్ను రక్షించుకొనుటయు సంభవింపదు. ఇందులకు ఈ దిగువ ఉదాహరింపబడు మర్కట వృత్తాంతము దృష్టాంతముగా ఉండగలదు.

ఏటిలోని యొక సన్నని చీలికలో గల ఒక చెట్టుపై కోతియొకటి నివసించుచుండెను. ఆ చెట్టు నదీమధ్యప్రదేశమున ఉండుటచే అధిక ప్రవాహము వచ్చినచో వృక్షము సాంతముగా మునిగిపోవును. ఇట్లుండ ఒక సమయమున ప్రవాహము రానే వచ్చినది. వఱద వచ్చినపుడు సామాన్యముగ చిన్నచిన్న లంకలుకూడ మునిగిపోవుట, కొన్నికొన్ని చెట్లు, తీవెలు, పొదలు కొట్టుకొనిపోవుట అందఱెఱింగినదే కదా! క్రమక్రమముగా నీరు చెట్టు పైభాగము వఱకు ఉబుకుచుండెను. కోతి పొట్టను కఱచుకొనియున్న తన బిడ్డలను, తన్ను రక్షించుకొనుటకై చెట్టు పైభాగమువఱకు ఆ కొమ్మనుండి ఆ కొమ్మకు ఎగప్రాకుచుండెను. కాని ప్రవాహము మాత్రము తగ్గలేదు. చెట్టుయొక్క చిటారుకొమ్మ వఱకును నీరు ఉబికినది. అంతవఱకు మర్కటము బిడ్డలతో కూడ చేరుకొన్నది. అంతకంతకును ఎక్కువగుచున్న నీటివెల్లువ చెట్టుమీది మర్కట కుటుంబమునుకూడ తనతో తీసికొనిపోవ సిద్ధపడెను. ఇప్పుడు కోతికి చేయవలసినదేదియు కన్పట్టలేదు. గర్భరూపములైన బిడ్డలను, తన్ను ఇంత

పఱకును కాపాడుకొన్నది. ఇంకొక్క క్షణమునకు అందఱును చచ్చు స్థితి సంభవింప నున్నది. కావున బిడ్డలపై నున్న మమకారమునుకూడ చంపుకొని తన్ను రక్షించుకొను ఉపాయమేదైన కలదా అను ఆలోచన ములో మునిగెను. బిడ్డలయందలి ప్రేమ- సదలి తన యందలి ప్రేమయే మిక్కుటమాయెను. అప్పుడా కోతి తన పిల్లలలో ఒకదానినితీసి కాలిక్రింద పెట్టుకొని దానిమీద నిలిచెను. తరువాత రెండవదానిని కూడ అట్లే ఒనర్చెను. పిమ్మట మూడవదానినికూడ ఆ రీతినే చేసెను. ఈ విధముగా మూడు పిల్లలను కూడ కాళ్ళక్రింద ఉంచుకొని వానిపై కోతి నిలబడుటచే ఐదా అంగుళములు నీళ్ళుబుట్టు పఱకును కోతి జీవించుట తటస్థించెను.

దీనినిబట్టి చూచిన సర్వపదార్థములందు కంటెను తనయందలి ప్రేమయే మిక్కుటమని తెలియుచున్నది. తనకోసమై సర్వమును బలి గొనుట ఇప్పుడు ఉదాహరించిన కోతి విషయమునవే కాదు; ఇతర ప్రాణుల విషయమునను కన్పట్టుచున్నది. లోకములో ప్రతిప్రాణియు తన్నుతాను ఎక్కుడుగా ప్రేమించుకొనుట పెక్కు దృష్టాంతములయందు మనము చూడవచ్చును. తా నన్నను, నే నన్నను ఆత్మయని మనకు తెలిసియే యున్నది. కావున ఆత్మ పరమ ప్రేమాస్పదమగుటచే అనంద రూపమే కాక, పరమానంద స్వరూప మనియు తెల్లమగుచున్నది. పూర్వ మిచ్చిన దృష్టాంతమునందును, ప్రతి ప్రాణియు తనయందుంచు ప్రేమ విషయమునను, "వానికి ఆత్మజ్ఞానము లేదుకదా, అట్టి తఱి ఈ పరమ ప్రేమ ఆత్మతత్త్వమును ఎఱింగినది కాదు. మఱి గ్రుడ్డి ప్రేమయే" అని శంకింపవచ్చును. ఆత్మజ్ఞానము ఉన్నను లేకున్నను, అనగా ఆత్మ స్వరూపము ప్రతిబింబ వశముచేత వానికి కన్పట్టినను కనబడకున్నను, ఆత్మ యను పదార్థమే తాను కావున, దానికి సహజమైన ప్రేమాస్పద త్వము దానిని పాసి చనజాలదు. వ్యక్తముగనో అవ్యక్తముగనో,

తెలిసియో తెలియకయో ఆ ఆనందస్వరూపము నందలి ప్రేమప్రవాహము ప్రసరించుచునే ఉండును. ఈ విషయము ఇంకను తరువాతి గ్రంథమును చదువుటచే విశదము కాగలదు.

ఆత్మ ఆనంద రూపమే అగుచో దానికి దుఃఖస్పర్శ ఉండకూడదు; ప్రేమాస్పదమే అగుచో అట్టిదానికి తనపై ద్వేషమే ఉండరాదు. లోకములో దీనికి వైరుధ్యము పొడ కట్టుచున్నది. ప్రతిప్రాణియు కొన్ని కొన్ని ఘట్టములందు దుఃఖార్తుడగుటయు, "ఈనా వ్యర్థజీవన మేల" యని తన్ను తాను ద్వేషించుకొనుటయు, అది కారణముగా ఆత్మహత్య సైతము ఒనర్చుకొనుటయు మనము చూచుచున్నాము. కావున ఆత్మ ఆనంద స్వరూపమే అని ఏల తలంపవలయును? సుఖ దుఃఖ స్వభావములు రెండును, రాగ ద్వేషములు రెండును దానికి కన్పట్టుచున్నవి." అని ఒక సందేహము పొడమ వచ్చును. కాని ఇంచుక దూరము ఆలోచించిన ఈ శంక సమాధానమను గాలిలో దూదిపింజ కాగలదు.

ఒక వస్తువునందే విరుద్ధములైన రెండు గుణములుండుట ఎన్నటి కిని పొసగదు. ఉష్ణము నైజగుణమగు అగ్నికి శీతము కల్గుట ప్రకృతి విరుద్ధము కాదా? కావున అత్యంత విరుద్ధములగు సుఖ దుఃఖములు, రాగ ద్వేషములు ఒక్కదానికే ఉండుననుట పొసగని మాట. యథార్థ మాలోచించిన ఆత్మకు దుఃఖ మనునదియే లేదు. దానిని భ్రాంతిచే జీవుడు కల్పించుకొనుచున్నాడు. అట్లే తన్ను తాను ఏవగించుకొన్నను, తన దేహమును హత్యచేసికొన్నను, దుఃఖమును సహింపలేకయే - అనిష్టరూప మగు దుఃఖమును దేహికి చేకూర్ప లేకయే అతడట్లొనర్చుచున్నాడు కాని, నిజముగా తన యందలి ద్వేషముచే కాదు. తనయం దుండెడి పరమ ప్రేమయే తనకు అనిష్టము కలుగుటను సహింపనిదై తన శరీరమును

కలింపజేసికొనుటకును పాల్పడుచున్నది. కావున అది ద్వేషము కాదు; మఱి పరమ ప్రేమయే.

మఱియు దేని కేది స్వరూపమో, స్వభావమో అది శాశ్వతముగా ఉండవలయును. ఆత్మవిషయమున దీర్ఘకాలము ఉండునది దుఃఖమా? లేక ఆనందమా? అని ఆలోచించినచో, ఎవ్వడుగాని చిరకాలము దుఃఖియై ఉండుటను కాంచలేము. తనకు ప్రియమైన వస్తువుతో వియోగము కలిగినప్పుడో, లేక ఏదేని కష్టము కలిగినప్పుడో అల్పకాలము మాత్రము దుఃఖము ననుభవించి మఱల స్వభావమును పొందుట ప్రతివారి విషయమునను మనము చూచుచున్నాము. జీవుని స్వభావము నిరతానందము కావున, ఎల్లప్పుడును అతడు ఆనందరూపుడై ఉండుటయు, ఆ స్వభావమునకు ఏదైన భేదము తటస్థించిన అట్టితఱి ఇంకొకడు "రామశర్మా! ఈ వేళ ఏదో ఒక తీరుగ వ్యాకులుడ (దుఃఖి) వై ఉన్నావే" మని అడుగుటయు గమనించి చూచిన, రామశర్మ స్వభావము ఆనందమో, లేక దుఃఖమో తేటతెల్లము కాగలదు. కాబట్టి ఆత్మ ఆనంద సాంద్రమనియు, ఆగంతుకముగ అప్పుడప్పుడు సంభవించు దుఃఖము కల్పితమగుటచే భ్రాంతిసిద్ధమును, అజ్ఞాన జనితమును, ఆరోపితమును అని యెఱుంగవలయును. ఆత్మభిన్నములగు వాటికి సంభవించు వికారములను ఆత్ముడు అజ్ఞానము చేతను, తాదాత్మ్యభావమువలనను ఆత్మయందు ఆరోపించుకొనుటవలనే తనకు దుఃఖము పొడసూపుచున్నదే కాని, యథార్థమున ఆత్మ దుఃఖదూరము.

అట్లయినను "లోకములోని నానాపదార్థములవలె ఉపయోగమును బట్టి ఆత్మయు ఆనందమును కలిగించునట్టిది కావలయునుకాని, ఆనంద స్వరూపము కావలయునన్న నియమము లేదని" పూర్వపక్షము రావచ్చును. ఈ పక్షమున కలిగించునట్టిది కారణమును, కలుగునట్టిది

కార్యమును కావలయును. అప్పుడు ఆనందజనక పదార్థములు కారణము లనియు, ఆనంద దుఃఖములు కార్యము లనియు సిద్ధమగుచున్నది. కార్య మునకు మార్పును, వినాశమును సర్వదా కలుగుచుండును, కారణమునకు ఆ మార్పులు లేవు. దీనినిబట్టి ఈ ఆనందము కూడ మార్పును, వినాశ మును కలది కావలయును. ఆనంద విషయమున అట్టి మార్పుకాని, నాశముగాని కన్పట్టుట లేదు. యథార్థ మాలోచించిన ఏ పదార్థమైనను ఆనందరూపమై యుండుట సంభవించునుగాని, ఆనందజనకమై యుండుట ఎన్నటికిని పొసగనేరదు. ఆనందమును కలిగించుటయే, దుఃఖమును కలిగించుటయే వస్తువులయొక్క స్వభావమైన, ఆనందమును కలిగించు నట్టివి దుఃఖమునుగాని, దుఃఖమును కలిగించునట్టివి ఆనందమును గావి ఎప్పుడును కలిగించుట సంభవము కాదు. లోకములో ఈ నియమమునకు విపరీతముగ ఒకేపదార్థము ఒక్కనికి ఆనందమును, వేఱొకనికి దుఃఖ మును కలిగించుటను చూచుచునే ఉన్నాము. ఒక్కనికైనను ఒక్కొక్క పదార్థము ఒకప్పుడు ఆనందమును, మఱొకప్పుడు దుఃఖమును కూడ కలిగించుచుండును. కావున ఆనందమును కలిగించుట అను లక్షణము వస్తువులకు కలదనుట ఎంతమాత్రమును ఒప్పిదము కాదు. మఱియు దేనికి ఏది స్వభావమో దానికి నాశము కలుగుటయు అసంభవము.

ఇంకను విచారించిన, వస్తువులకు ఈ ఆనంద దుఃఖములు గుణ ములని చెప్పుటకును వీలు గాకున్నది. స్థితి గతులవలె విరుద్ధ స్వభావము గల ఆనందదుఃఖములు ఒక్కదానినే ఆశ్రయించి యెట్లుండును ? కావున అగ్నియందు చల్లదనము ఉండనట్లు, ఆనందగుణక పదార్థమునందు దుఃఖగుణము ఉండుటకు వీలులేదు. అందుచే ఇంకను దీర్ఘముగా ఆలో చించి ఈ దుఃఖమును ఎగుర గొట్టవలెనని లోకములో దుఃఖదూరులమై ఆనంద స్వరూపముతో జీవించుటకు వలసినది.

ప్రపంచమునగల అన్ని పదార్థములచేతను ప్రతివానికిని ఒకానొక ప్పుడైనను ఆనందము కలుగుచునే యున్నది. కావున ప్రస్తుతము సర్వ పదార్థములు ఆనందరూపములని చెప్పుకొందము. ఇట్టిస్థితిలో అప్పు డప్పుడు ఆనందమునకు భిన్నముగ దుఃఖమేల కలుగుచున్నదన్న, దానికి అజ్ఞానము, భ్రాంతి తక్క వేఱొక కారణము లేదు. సత్యదృష్టిని అవ లంబించి చూచినచో దుఃఖమునకు ఉనికియే లేదు. ఎండమావులయందు సత్యముగా లేని జలప్రవాహము ఉన్నట్లు కన్పట్టినరీతిని, సహజానంద మయ వస్తువులయందును లేని దుఃఖము భ్రాంతిసిద్ధమై అజ్ఞానముచే కల్పింపబడుచున్నదనుట సత్యము. ఇందుకు జీవుని శాశ్వతస్వభావము దుఃఖము కాక ఆనందమే అని పూర్వము చెప్పిన అంశము ఇచ్చటను కారణము. మఱియు మానవుడు ఆ యా పదార్థములచేతను శాశ్వత ముగా సుఖమునే అనుభవించుచున్నాడు కాని దుఃఖమును అందుట లేదు. అట్టి దుఃఖము ఎప్పుడేని ప్రాప్తించినను - అది క్షణికమై నశించుచున్నది గాని, ఆనందము ఆ రీతిగ నశించుటలేదు. కావున దుఃఖము ఆగంతుక మనియు, ఆనందము స్వరూపమనియు ఎఱుంగుట పరమార్థము. దుఃఖ మునకు ఆగంతుకత్వమైనను అజ్ఞానముచేతనేగాని, విజ్ఞానదృష్టిలో దానికి సత్తయే లేదనుట మఱువ వగదు

ఇప్పుడు దుఃఖము భ్రాంతిసిద్ధము అను అంశము నిర్ధారణ చేయ బడుటచేత, కేవలాత్మునియందు ప్రపంచమును, ఏకాత్మునియందు జీవాత్మ పరమాత్మ భేదమును, ఒక్క జీవునియందు తాను, ఇతరుడు అను భేదమును సంపాదించిన అజ్ఞానమే - అవిద్యయే-మిథ్యాజ్ఞానమే ఆనంద రూపములందును దుఃఖభ్రాంతినికూడ కలిగించుచున్నదని తెలియవల యును. ఇయ్యదియే మాయావిలాసము :

ఇప్పుడయినను 'ఆనందరూప పదార్థములందు దుఃఖము భ్రాంతిచే కల్పితమైనదన్నట్లే, దుఃఖరూప వస్తువులయందే ఆనందము భ్రాంతిచే

కల్పితమయినదని అన కూడదా' అన్నచో, దుఃఖము ఆగంతుకమనియు, ఆనందమే శాశ్వత స్వరూపమనియు, ఈ విషయమును ప్రాణి జీవితమున అనుభవించునది సహజముగ ఆనందమనియు, ఎప్పుడేని అజ్ఞానముచే కలుగునది దుఃఖమనియు పూర్వమే చెప్పబడినది. కావున ఈ ప్రశ్న పుట్టుటకు వీలే లేదు.

ఆనందము పదార్థములకు స్వరూపమని చెప్పబడినది. ఈ స్వరూపము నేత్రమునకు గోచరించునది కాదనియు, ఆత్మ విషయముగ మాత్రమే అనుభూతమగునదనియు ఎఱుంగవలయును. కాని సర్వపదార్థములు ఆనందరూపములని అనుటచే ఆత్మేతరవస్తువులకును ఆనంద రూపత్వము సిద్ధించి, అసత్తు, జడము, దుఃఖము- స్వరూపముగా గల జగమునకు కూడ ఆత్మ లక్షణమగు ఆనందముండుట యెట్లా అని శంకింప వలదు. సర్వము ఆత్మయే అని పోను పోను నిరూపింపబడనుండుట చేతను, ఒకవేళ భ్రాంతి వశమున ఆత్మభిన్న పదార్థములు తోచుట సంభవించినను, అవి ఆత్మయొక్క ఆధారము చేతనే తోచుచున్నవి కావున, ఆ ఆత్మయొక్క ఆనందాంశమే తద్భిన్నముగా కన్పట్టిన పదార్థములయందును భాసించుచున్నది కావున, ఇంతకుపూర్వము కలిగిన శంక సూక్ష్మ విచారముచే సమాధానము పడయగలదు. మట్టినుండి తద్భిన్నములుగా కన్పడు కుండ, మూకుడు, బాన మున్నగు స్వరూపములు సిద్ధమయినను, వాని అన్నింటియందును మట్టి ఉండియేయున్నది కదా! అట్లే ఆత్మయొక్క ఆనందాంశమే ఆత్మేతరములందును ఉండుట విరుద్ధము కానందున, సర్వపదార్థములు ఆనంద రూపము లనవచ్చును. ఆ ఆనంద కళను యథార్థముగ పడయజాలకపోవుటచేతనే దుఃఖము తోచి జగము దుఃఖాత్మక మనుటకు కారణమైనది. అట్లే అసృత జడరూపములు కూడ బుద్ధి చిత్స్వరూపమును యాథాతథ్యముగ పడయజాలనందున తోచెడివే.

జగద్బ్రహ్మలను గూర్చిన ఈ విషయము రాబోవు ప్రకరణములయందు ఇంకను సుస్పష్టము కాగలదు.

ఈ విచారముచేత ఆత్మ అనంత స్వరూపమను అంశము రూఢమైనది. ఆత్మయొక్క సత్య జ్ఞాన స్వరూపములను ఇదివరకే తెలిసికొని యుంటిమి. కాగా ఇప్పుడు ఆత్మ సచ్చిదానంద స్వరూపము అనుట సువిదితము. మనోబుద్ధ్యహంకారముల యందును, అవ్వాని బహిరంతర్వృత్తులయందును ప్రతిబింబించి, శరీర ప్రాణ మనోవృత్తులను, వాటి విషయములను తానుగాను, తనవిగాను, అభిమానించి, అది నిమిత్తముగా కలిగెడి సుఖదుఃఖాదులచే వికారి యైనట్లు (వస్తుతః నిర్వికారుడయ్యు) తోచుచు జీవపదవాచ్యుడై ఒప్పుచున్న 'నేను' ఈ ఆత్మయే. పలువిధము లగు ఆవరణములచే కప్పబడి అపరిశుద్ధునివలె కన్పడు ఈ జ్యోతియే ఆవరణభంగము జరిగిన పిమ్మట బింబరూపుడై పరిశుద్ధుడై తేజరిల్లు 'నేను' పద లక్ష్యభూతుడైన విశుద్ధప్రత్యగాత్ముడు. కావున ఈ నేనను వాడు అఖండసత్తు; వాని కెన్నడును నాశము లేదు. నేననువాడు అఖండ చిత్తు; స్వయంప్రకాశమగు అనంత జ్ఞానరాశి. వాని కెన్నడును అజ్ఞానము, జడత్వము లేదు. నేననువాడు అఖండానందము. వాని కెన్నడును దుఃఖస్పర్శ లేనే లేదు.

సచ్చిదానంద సుందరమగు ఈ ఆత్మతత్త్వమును గూర్చి ఉపనిషత్తులు చేసిన గానమును ఇంచుకంత ఆలింతము. సర్వభూతముల యొక్కయే కాదు, సర్వము యొక్కయు బాహ్యాభ్యంతరముల నన్నిటిని నిండి యుండిన ఈ ఆత్మ కదలును; కదలదు. అది దూరములో; అది దగ్గరనే. అది మనస్సుకంటెను వేగముగలది. అది ఒక్కచో నిలిచియు పరుగెత్తు వారలను దాటగలదు. నిష్కంపమైన దానియందే జల వాయువులు చలింప సమర్థము లగుచున్నవి. అది అన్నివైపులను నడచెను

(వ్యాపించెను). అది సర్వ పరిపూర్ణము. శుభ్రమైనది; స్థూల సూక్ష్మ కారణ శరీరములు కానిది; లేనిది. సునిర్మలము. ద్వంద్వముక్తము కావున ధర్మాధర్మములకు అతీతమైనది. కవి (సర్వద్రష్ట); సర్వజ్ఞము. సర్వమునకును పైనుండునదియు అదియే. అది స్వయంభువు; అనగా తనంతట తానే అగునది. సర్వార్థములను యాథాతథ్యము (నియతి నతిక్రమింపక) న నియమించునది. దాని రూపము కల్యాణతమ మైనది. దానికి పాణి పాదములు లేకున్నను పట్టుకొనగలదు; నడువగలదు. అనగా సాధనాంతర నిరపేక్ష మగునది. చెవులు లేకున్నను వినగలదు. కన్నులు లేకున్నను చూడగలదు. అది తెలియదగినదాని నంతటిని తెలియగలదు. కాని దాని నెఱుంగ సమర్థమగు పదార్థము వేఱొకటి లేదు. అన్నింటి కన్నను, అంతటి కన్నను ముందును, తరువాతను కూడ మార్పులేక శాశ్వతమై ఉండి సర్వాగ్ర్యముగ ఒప్పెడి మహాపదార్థము ఇదియే. అణువుకంటె అణువు, మహత్తుకంటె మహత్తు అయి చిట్టచీమ మొదలు బ్రహ్మవఱకునుగల సర్వప్రాణుల హృదయాంతరాళములం దధివసించి పురుషశబ్దవాచ్యమై 'నే' ననుచు సర్వవ్యవహారములను చేయు ఆత్మ వస్తువే యిది.

''అణో రణీయా న్మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్.''

— కఠవల్లి. 1-2.20

ఇంతవఱకు శరీర ప్రాణేంద్రియ మనోబుద్ధులకన్న విలక్షణమును విభిన్నమును అగు ఆత్మవస్తువు ఒకటున్నదని నిశ్చయించి, దాని స్వరూపమునుకూడ తెలిసికొంటిమి. శరీరమను ఈ రథమును అధిష్ఠించి నిరంతరమగు ఆధ్యాత్మిక జీవనయాత్ర చేయు బాటసారియు ఈ ఆత్మయే

జగద్ద్రష్టృత్వమును గూర్చిన ఈ విషయము రాబోవు ప్రకరణములయందు ఇంకను సుస్పష్టము కాగలదు.

ఈ విచారముచేత ఆత్మ అనంత స్వరూపమను అంశము రూఢమైనది. ఆత్మయొక్క సత్య జ్ఞాన స్వరూపములను ఇదివఱకే తెలిసికొని యుంటిమి. కాగా ఇప్పుడు ఆత్మ సచ్చిదానంద స్వరూపము అనుట సువిదితము. మనోబుద్ధ్యహంకారముల యందును, అవ్వాని బహిరంతర్వృత్తులయందును ప్రతిబింబించి, శరీర ప్రాణ మనోవృత్తులను, వాటి విషయములను తానుగాను, తనవిగాను, అభిమానించి, అది నిమిత్తముగా కలిగెడి సుఖదుఃఖాదులచే వికారి యైనట్లు (వస్తుతః నిర్వికారుడయ్యు) తోచుచు జీవపదవాచ్యుడై ఒప్పుచున్న 'నేను' ఈ ఆత్మయే. పలువిధము లగు ఆవరణములచే కప్పబడి అపరిశుద్ధునివలె కన్పడు ఈ జ్యోతియే ఆవరణభంగము జరిగిన పిమ్మట బింబరూపుడై పరిశుద్ధుడై తేజరిల్లు 'నేను' పద లక్ష్యభూతుడైన విశుద్ధప్రత్యగాత్ముడు. కావున ఈ నేనను వాడు అఖండసత్తు; వాని కెన్నడును నాశము లేదు. నేననువాడు అఖండ చిత్తు; స్వయంప్రకాశమగు అనంత జ్ఞానరాశి. వాని కెన్నడును అజ్ఞానము, జడత్వము లేదు. నేననువాడు అఖండానందము. వాని కెన్నడును దుఃఖస్పర్శ లేనే లేదు.

సచ్చిదానంద సుందరమగు ఈ ఆత్మతత్త్వమును గూర్చి ఉపనిషత్తులు చేసిన గానమును ఇంచుకంత ఆలింతము. సర్వభూతముల లోపలనే కాదు, సర్వము యొక్కయు బాహ్యాభ్యంతరముల నన్నిటిని నిండి యుండిన ఈ ఆత్మ కదలును; కదలదు. అది దూరములో; అది దగ్గరనే. అది మనస్సుకంటెను వేగముగలది. అది ఒక్కచో నిలిచియు పరుగెత్తు వారలను దాటగలదు. నిష్కంపమైన దానియందే జలవాయువులు చలింప సమర్థము లగుచున్నవి. అది అన్నిటికై [illegible]

(వ్యాపించెను). అది సర్వ పరిపూర్ణము. శుభ్రమైనది: స్థూల సూక్ష్మ కారణ శరీరములు కానిది: లేనిది. సునిర్మలము. ద్వంద్వము క్తము కావున ధర్మాధర్మములకు అతీతమైనది. కవి (సర్వద్రష్ట): సర్వజ్ఞము. సర్వమునకును పైనుండునదియు అదియే. అది స్వయంభువు: అనగా తనంతట తానే అగునది. సర్వార్థములను యాథాతథ్యము (నియతి నతిక్రమింపక) న నియమించునది. దాని రూపము కల్యాణతమ మైనది. దానికి పాణి పాదములు లేకున్నను పట్టుకొనగలదు: నడువగలదు. అనగా సాధనాంతర నిరపేక్ష మగునది. చెవులు లేకున్నను వినగలదు. కన్నులు లేకున్నను చూడగలదు. అది తెలియదగినదాని నంతటిని తెలియగలదు. కాని దాని నెఱుంగ సమర్థమగు పదార్థము వేఱొకటి లేదు. అన్నింటి కన్నను, అంతటి కన్నను ముందును, తరువాతను కూడ మార్పులేక శాశ్వతమై ఉండి సర్వాగ్ర్యముగ ఒప్పెడి మహాపదార్థము ఇదియే. అణువుకంటె అణువు, మహత్తుకంటె మహత్తు అయి చిట్టచీమ మొదలు బ్రహ్మవఱకునుగల సర్వప్రాణుల హృదయాంతరాళములం దధివసించి పురుషశబ్దవాచ్యమై 'నే' ననుచు సర్వవ్యవహారములను చేయు ఆత్మ వస్తువే యిది.

''అణో రణీయా న్మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్.''

— కఠవల్లి. 1-2.20

ఇంతవఱకు శరీర ప్రాణేంద్రియ మనోబుద్ధులకన్న విలక్షణమును విభిన్నమును అగు ఆత్మవస్తువు ఒకటున్నదని నిశ్చయించి, దాని స్వరూప మునుకూడ తెలిసికొంటిమి. శరీరమును ఈ రథమును అధిష్ఠించి నిరంతర మగు ఆధ్యాత్మిక జీవనయాత్రను చేయు వాటసారియు ఈ ఆత్మయే

అను అంశమును కఠవల్లిలోని మనోహర వర్ణనముచేత తూరా తెలిసికొందము.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ.
ఇంద్రియాణి హయా నాహు ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనో యుక్తం భో క్తే త్యాహు ర్మనీషిణః."

— కఠవల్లి. 1-3-3,4.

పూర్వగ్రంథమున నిరూపింపబడిన కేవలాత్మ అంతఃకరణోపాధియందు ప్రతిబింబించి దేహాద్యభిమానముచేత బద్ధమై సంసారి అయి ఆ యా క్షేత్రములందు తిరుగుచు జీవపద వాచ్యమైనది. అట్టి జీవాత్మయే రథికుడు. వాడధిష్ఠించిన ఈ శరీరమే రథము. వానికి బుద్ధి, రథమును నడిపించుసారథి. మనస్సు పగ్గము. ఇంద్రియములు రథమును లాగు గుఱ్ఱములు. ఇంద్రియములకు విషయములగు శబ్దస్పర్శాదులు సంచార భూములు. ఇంద్రియ మనములతో కూడిన ఈ ఆత్మయే సుఖదుఃఖములను అనుభవించు భోక్త (నేను).

ఆత్మ రథికుడనుటచేత వానికి సర్వప్రాధాన్యము సిద్ధించుచున్నది. యుద్ధములోగాని, మఱొక కార్యములోగాని జయమును ప్రధాన ప్రయోజనము, లేదా గమ్యస్థానమును చేరుట అను ముఖ్యకార్యసిద్ధి రథము నెక్కిపోవు యజమానునకేకాని, తదితరులకు కాదనుట మన కెల్లరకు విదితమే. సారథి యజమానుని జీతగాడు. పగ్గము గుఱ్ఱములనులాగు సాధనము. గుఱ్ఱములు జంతుకోటిలో చేరినవై సారథి ఇష్టప్రకారము వర్తింప వలసినవి. ఇక ఇవి తిరుగవలసిన ప్రదేశములును సారథి యొక్క ఇష్టమునకు లోనుకావలసినవేకాని, స్వతంత్రములు కావు.

దీనినిబట్టి ఆత్మ (నేను) కు సర్వమును సాధనమగుట తెల్లమగుచున్నది. మఱియు ఈ ఆత్ముడు ఏ పరమ లక్ష్యమును గూర్చియో ప్రయాణ మొనర్చుచున్నా డనియు సుస్పష్ట మగుచున్నది.

దీనింబట్టి ప్రస్తుతమున 'ప్రాణుల జీవితయాత్రకు గమ్యస్థాన మెద్ది? ఎచ్చటకు చేరినపిమ్మట ఈ యాత్ర ముగిసి, సారథి మొదలగు సాధనములకు వీడ్కోలు చెప్పి ఈప్రయాణికుడు విశ్రమింప గలుగును?' అను ప్రశ్నములు ఎదుర్కొనుచున్నవి.

మొట్టమొదట మనము వేసికొన్న ప్రశ్నలలో మూడవదగు 'ఈ నే ననువానికి కావలసినదేమి?' అను ప్రశ్నమును, ఇదియు ఇంచు మించు ఒక్క తీరుననే ఉన్నవని తోచుచున్నది.సంక్షేపముగా 'నే నెక్క డకు పోవలయును?' నా కేమి కావలయును?' అను ప్రశ్నముల సమాధా నములు మనకు అవసరము. నీవు పోవలసిన తావునకు పోయినచో నీకు కావలసినది చిక్కగలదు; లేదా, నీకు కావలసిన వస్తువున్న తావునకు నీ ప్రయాణము సాగింపుము. ఇట్లు చేసిన, రెండు ప్రయోజనములు సిద్ధించును. సిద్ధించుటేకాదు; రెండింటికిని స్వరూప మొక్కటే యగుటచే సాధనవిషయమున చేయవలసినశ్రమ ఒక్క తీరుననే రూపొందును.

నా కేమి కావలయునన్న ప్రశ్నకు 'నీ వెక్కడకో ఒక గమ్య స్థానమునకు చేరుట కావలయును' అని చెప్పుకొన్న ఇక మిగులు సమా ధానము ఒక్క ప్రశ్నకే అగును. అయినను ఈ రెండింటిని కలిపి సమా ధానము ఆలోచించి చూతము. ముమ్ముందుగ కఠోపనిషత్తులోని వర్ణ నమునుబట్టి ప్రాణి ఎక్కడకు ప్రయాణము చేయవలయునను అంశమును గూర్చి అందే చెప్పబడిన విషయమును పరికింతము. కఠవల్లిలోని పై వాక్యములను దాటి రెండు మూడడుగులు వేయుచో-

"స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే"
"సోఽధ్వనః పార మాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్."

"అట్టి ప్రయాణికుడు తిరిగి పుట్టుకగాంచనట్టి ఒక స్థానమును చేరుచున్నాడనియు, వాడు ఆ విష్ణువుయొక్క పరమపదమగు మార్గము కడపటి హద్దును చేరుచున్నాడనియు" రెండు వాక్యములు కనబడుచున్నవి. దీనినిబట్టి నరుని జీవితయాత్రకు ఒక అవధి కలదనియు, అంతవఱకు చేరువందాక ప్రాణి చావు పుట్టుకల నందుచు ప్రయాణింపవలసినదే అనియు, ఆ అవధిని చేరినపిమ్మట జనన మరణముల అలజడిగాని, సంసారచక్ర పరిభ్రమణముగాని లేక, జీవుడు భగవానుని పరమపదమును అందునని యు తెలియుచున్నది.

అట్టి అవధికి ప్రయాణించుటకే ఈ శరీరమను రథము ఈతనికి ప్రాప్తించినది. ఈ ప్రయాణసరణిని, దీని పరమావధిని గూర్చి ఇంక వివరించి తెలిసికొందము. అఖండసత్తు, అఖండచిత్తు, అఖండానంద మును మాత్రమే అగు సచ్చిదానంద సాగరములోని జలకణమే ప్రాణి. వస్తుతః ఈ నీటిబిందువునకు గాని ఆ మహాసముద్ర జలమునకుగాని స్వరూప స్వభావములందు భేదము లేదు. ఏ వాయువశముననో చెదరి వచ్చి మంటి కుండ (శరీరము) లో పడిన ఈ జీవుడు తనకు ఉపాధి యగున కుండయే తా ననుకొని తన స్వరూపమును మఱచిపోయినాడు. ఈ అజ్ఞానము కారణముగా తన్నెప్పుడు మఱచెనో, తన పుట్టుకను గూర్చియు తనకు కారణమైన వస్తువునుగూర్చియు మహా మోహములో పడిపోయినాడని వేఱుగ చెప్పనక్కఱ లేదు. అట్టి భ్రాంతిలో మునిగి తన యందు తోచిన సర్వమును తానే యని మోహపడుచు, నానాత్వముతో కూడిన ప్రపంచమే తాననియు, తన్నది బాధించుచున్నదనియు ప్రపంచ

కల్పితములకెల్ల పలుదయిపోయి ఆనందస్వరూపమయిన సర్వమును దుఃఖ
మయముగా తలపోసి చిక్కులపడుచుండుట అతనికి అలవాటై పోయినది.
ఈ ప్రకారము ఎన్ని జంతలు మాటివను తాను తుండకాదనియు,
తుండను హేతువుగా చేసికొని పాటిల్లుచున్న సుఖదుఃఖములతో తనకు
సంబంధము లేదనియు అనెడి జ్ఞాన మాతనికి ఆ నాటి కా నాటికి దూర
మగుచున్న దేకాని సమీపమగుట లేదు. అనంత సచ్చిదానందసాగరము
లోని జలకణమే తానని తెలిసికొనువఱకును అతని సంకల్పములుగాని,
క్రియాకలాపములుగాని తుండను ప్రధానీకరించుకొనియే - దానికి తగినట్లే
జరుగునుగాని, సుంతైన మాఱువనుట నిక్కువము. కల వచ్చి తన్నె
వ్వరో పట్టుకొని తన్నుచున్నారని కలవరించువానికి ఆ కలమండి మెలకువ
వచ్చువఱకును అం దనుభవింపవలసిన దుఃఖము తప్పకుండుట సుప్ర
సిద్ధము. స్వయముగా అతడు జాగ్రద్దశలోనికి వచ్చుటగాని, ఒరులెవరైన
కలవరించుచున్నాడని యెఱింగి మేల్కొలుపుట కాని తటస్థించువఱకు
అతని చేష్టలు అట్లే యుండును. కాని మెలకువలోనికి వచ్చియు ఎవ్వడును
ఏడుపజాలడు. యథార్థమైన తాను ఇప్పుడు వ్యవహారములోనున్న అత
డనియు, ఇందాక స్వప్నములో తాడితుడై యేడ్చువాడు కల్పితుడనియు,
ఇందుకు దృష్టాంతముగా ఆ కలయందు తిన్న దెబ్బలు తన శరీరమున
లేకుండుట మున్నగు లక్షణములను సరిపోల్చుకొని స్వస్థచిత్తు డగును.
ఇప్పుడు జాగ్రత్ప్రపంచములోని ఈతని సంకల్పములుగాని, కార్య
క్రమముగాని స్వప్నములోని వానికంటె విలక్షణమై తన శ్రేయస్సునకు
సంబంధించి నడచు ననుట నిత్యమును కలలు కాంచు మన అనుభవ
ములో ఉన్న విషయమే ః

అట్లే మానవుడు ఎంతవఱకు శరీరమే తానని అనుకొనుచు, అది
కారణముగా సంఘటిల్లు సంబంధములను, సుఖదుఃఖములను తనయందు

ఆరోపించుకొనునో, అంతవఱకును శోక మోహములు, సుఖ దుఃఖ ములు, మంచి చెడుల అను ద్వంద్వములు తప్పవు. ఎంతవఱకు పురు షుడు ద్వంద్వములకు పరుడై సంచరించునో అంతవఱకు ఏకద్వరూప మగు నిరతిశయానందము వానికి నున్నది. ఈ ప్రపంచములోని సంకల్ప ములు, ఇంపలి కార్యములు, ఇందలి నరుని ప్రవృత్తి దీనికి సంబం ధించి ప్రాపంచికముగ - భౌతికముగ మాత్రమే ప్రవర్తించునవనుట యథార్థము.

ఏ నాడు శరీరాదులు తాను కానని జ్ఞానచంద్రోదయము కలుగునో, ఆ నాడే అతని వెనుకటి చీకటియెల్ల విరియబాఱి జీవితమనెడి చెంగల్వ కొలనిలో అమృతరసము నిండి వెల్లివిరియును. అప్పటినుండి అతని సత్ప్రవృత్తులును మాఱిపోవును. జీవితకావ్యమున నూతనాధ్యాయము ఆరంభమగును. ఇప్పుడు నిన్నటివఱకు ఉన్న 'తాను' కాదు నేటి తాను. నిన్నటివఱకు వ్యవహారములో ఉన్న తాను పాంచభౌతికమగు మాంసపు ముద్ద; లేదా ప్రాణేంద్రియముల కూటమి; లేదా కొన్ని సంకల్పముల రాశి. ఈ నాటి తాను అట్లు కాదు. వాటికన్నింటికి విలక్షణుడు. ఇంద్రియ గోచరము కాని ఒక దివ్యసుందరమూర్తి. అతిభౌతికమైన తన దివ్య సౌందర్యములోని ఒక స్థూలాంశము మాత్రమే తాను సాధనములుగా చేసికొన్న మనః ప్రాణ శరీరములు; వాటి సంసర్గముగల ఈ సమస్త ప్రపంచమును. ఓహో! నిన్నటికి, నేటికి ఎంత విభేదము! ఎంత అంతరము!!

ఇక ఇప్పటి తన కార్యప్రణాళిక వేఱు; తన సంకల్ప వికల్ప ములు వేఱు. తన చూడ్కి, తన వినికిడి, తన పలుకుబడి, తన కదలిక, తన సర్వేంద్రియప్రవృత్తులును విలక్షణములే. నిన్నటివఱకు భౌతికములై, ప్రాపంచికములై, బంధకములై నయవి నేటినుండి దివ్యత్వములోనికి ఉద్ధ

రింపబడును. పడినవికూడ. ఈ దివ్యత్వము స్వర్గాదులయందలి దేవతల దివ్యత్వమువంటిది కాదు. దానికంటె వేఱైనది. బ్రహ్మాండమున ఎన్నెన్ని దేవలోకములున్నను, వాటికంటెను సర్వోపరితలమున విరాజమాన మగుచు వాటి కెల్ల పరమకారణమగు అక్షయ దేవత్వ మిది.

ఇట్టి దేవత్వము - లేదా అమృతత్వము తనకు సిద్ధించినపిమ్మట తాను కోరునది లేదు; ద్వేషించునది లేదు. కర్తవ్యముగాని, అకర్తవ్యముగాని అచ్చట లేదు. ప్రవృత్తి నివృత్తులును లేవు. ఈ రాగద్వేషములకు అవ్వల, ఈ కర్తవ్యాకర్తవ్యములకు అతీతమున, ఈ విధి నిషేధములకు పరమున వర్తించెడు కొండొక దివ్య సంసిద్ధి ఇది. ఈ మాత్రమున సర్వప్రపంచమును వీడి మునివృత్తితోడనో, లేక సన్న్యాసముతోనో పరుగెత్తి చేసెడు అరణ్యావాసముగా దీనిని భావింప తగదు. శరీరమును వీడనక్కఱ లేదు. ఇంద్రియకృత్యములు కట్టుపడ నవసరము లేదు. సర్వ సంకల్పములు శూన్యములు కానక్కఱ లేదు. శరీరపాతమగు వఱకు ప్రారబ్ధము భోక్తవ్యమే అగుగాక! ఈ భోగము విశిష్టము. సామాన్య జనముయొక్క ఇంద్రియభోగమునకును, దీనికిని హస్తిమశకాంతర మున్నది. 'త్యక్తేన భుంజీథాః' అన్న త్యాగముతోడ మాత్రమే కూడుకొన్నదికూడ కాదీ భోగము. ఏ నిఘంటువును సరియగుపదమును ఇవ్వజాలనిదియు, త్యాగ భోగములకు కూడ అవ్వలిదియు అగు విశిష్ట భోగ మిది!

లోకములోని సన్న్యాసుల సన్న్యాసముకాని, త్యాగముకాని ఒక ప్రాపంచిక నియమమునకు, కొండొక సామయికాచారమునకు లోబడినదే. తత్పూర్వభావి యగు మునివృత్తియు అట్టిదే యగును. అత్యాశ్రమమగు ఈ స్థితి లోక నియమము ననుసరించి పలురీతుల వ్యవహరింపబడుచున్న గేస్తునకుగాని, బ్రహ్మచారికిగాని, మఱొక ఆశ్రమమందున్న వానికిగాని, గ్రుడ్డికిగాని, కుంటికిగాని సంభవింప వచ్చును. లోకప్రవృ

ఓ స్థితి మానవుడు కల్పించుకొన్న నియమములకు లొంగునవస్థ దీనికి చేయు. అద్భుతమయమగు ఆత్మప్రసాదము వర్షినయంత ఇది ఆవిష్కృతమగును. అట్టి ఆత్మావిష్కారము నందినవాడు తన ఇంద్రియములను, వాటికృత్యములను విశిష్టము లొనర్చుకొన్నాడు. పుటము పెట్టిన పసిడి నిర్మలమగునట్లు ఇతని శరీరేంద్రియ కరణజాలమును పరిశుద్ధము. వాటితోడనే అతడీ ప్రపంచలీల జరుపును.

అఖండానంత సచ్చిదానందసాగరములోని జలకణమే తానని మానవుడు అపరోక్షముగ ఎఱింగిన పిమ్మట అతని కిక బంధము లేదు; మోక్షము లేదు. బంధమోక్షములును ద్వంద్వములే అగుడు, తనకు బంధమే లేదనియు, అట్టితఱి మోక్షమేమనియు అత దెఱుంగుటంజేసి ద్వంద్వాతీతస్థితి కి ఆత్ముడు సముద్ధరింపబడును. ఇప్పుడు అంతయు ఒక్క అఖండజ్యోతి మాత్రమే యనియు, ఆ జ్యోతియొక్క వెలుగే ప్రపంచమనియు, ఈ వెలుగునకు కారణమగు కాంతిసమూహ ఘనస్వరూపమే జ్యోతియనియు, ఆ జ్యోతిప్రప్రకాశము యొక్క అభివ్యాప్తికిని, జ్యోతికిని భేదము లేదనియు విదితమగును.

జీవాత్మ ప్రయాణము-అనృతము, జడము, దుఃఖము నగు జగములోనుండి సత్యము, జ్ఞానము, ఆనందమునగు పరములోనికని ఈ సూక్ష్మ విచారముచేత సూత్రప్రాయముగ తోపవచ్చును. అట్లే ఖండములోనుండి అఖండములోనికి, నానాత్వములోనుండి ఏకత్వములోనికి అని యు ఊహింపవచ్చును. ఈ ఖండాఖండములను పరిపూర్ణమొనర్చుకొన్నయెడల రథికునకు సారథి యున్నగువారి చెలిమి అవనపరమయి సర్వ సాధ్య సాధనములకును తానే మూలభూతుడై ప్రకాశింపగలడు. ఈ అర్థము రాబోవు అధ్యాయములయందు ఇంకను విస్పష్టము కాగలదు.

# నాకు కావలసినది

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మంతవ్యో నిదిధ్యాసితవ్యః"

— బృహదారణ్యకోపనిషత్తు 4. 5. 6.

ఓ మైత్రేయీ ! ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది.

ఇంతవఱకు నేనెవ్వరో తెలిసికొని అతని ప్రయాణోద్దేశ్యమును కూడ ఇంచుకంత తెలియ యత్నించితిమి. ఈ అధ్యాయమున నేను వానికి కావలసిన దానిని గూర్చి గాఢముగ విచారింతము.

లోకమున ప్రాణిమాత్రమునకు సహజములైనవి ఆకలిదప్పులు. తల్లి గర్భమునుండి భూమిపై బడగనే శిశువు పాలకోసమై వెదకులాడును. నోటివద్ద ఏదేని మెదలినచో నాల్కసాచి ఆస్వాదించుటకు కన్నులు తెఱవని కూనయేని తహతహ పడును. జీవునకు ఏనాడు దేహముతో సంబంధ మేర్పాటైనదో అప్పుడే శరీరముయొక్క పరిపోషణభార మాతనిపై పడినట్లే కదా ! ఆ స్థితిలో ముమ్మందు తాను తగిలించుకొన్న శరీరమునకగు ఆకలిదప్పులను స్వాభావికముగనే తీర్చుకొన యత్నించుటలో దోసము లేదనవచ్చును. కావుననే లోకములో ఎల్లప్రాణులకును ఆహారపానీయములు ముఖ్యముగా మున్ముందు వెదకికొనవలసినవై యున్నవి. తరువాతిది నిద్ర. ఈ రెంటికి అవల మైథునకర్మము. ఈ ఆహార నిద్రా భయ

మైథునములు సర్వప్రాణులకు తుల్యములు. తినుట, త్రాగుట, భోగించుట, భయపడుట, మోదించుట మున్నగు క్రియలు ప్రతిజంతువునందును నియతములై ప్రవర్తిల్లుట మనము చూచుచునే యున్నాము. అహంకార పరవర్తియగు జీవుడు ఎప్పుడు శరీరమే తనస్వరూపమని భావించునో, అప్పుడు తత్సంబంధములగు వాటికి ప్రాధాన్య మిచ్చి చరించుటలో వింత లేదు. తన స్వరూపమునకు తగిన కృత్యములందును, సంకల్పములందును, కర్తవ్యములందును ప్రతిప్రాణియు యత్నము సలుపునని పూర్వమే తెలిసికొని యుంటిమి. కావుననే శరీరాత్మ వాదులైన చార్వాకులు ఆహారనిద్రా భోగములకే ప్రాధాన్యమిచ్చి, ఆ శరీరభోగములకు తగినట్లు తమ లోకయాత్రను నిర్మించుకొని యున్నారు.

ప్రపంచములోని మతములలో చార్వాకమత మొకటి. దీని సిద్ధాంతములు మనకు కడు విచిత్రములుగ నుండును. ఇందు ప్రత్యక్షమొక్కటే ప్రమాణము. అనుమానాది ప్రమాణములు వీరికి ఇష్టములు కావు. కావుననే శూన్య స్వరూపమైన ఆకాశమును ప్రత్యేక భూతముగ ఒప్పుకొనక పృథివ్యప్తేజో వాయువులు నాలుగుమాత్రమే సృష్టికి కారణమైన భూతములని వీరు వాదించిరి. నానా ప్రాణిశరీరములు ఈ నాల్గు భూతముల యొక్క కలయికచేతనే యేర్పడుచున్నవి. మన కంటికి కనబడుచున్న శరీరమునకంటె అతిరిక్తుడగు జీవుడు కాని, ఆత్మపదార్థము కాని శూన్యము. భూతముల కలయికచేతనే చైతన్య ముద్భవించి, వాటి కలయిక వీడగనే చైతన్యము కూడ నాశమయి పోవుచున్నది. జీవుడు భూత భౌతికములకంటె వేఱుగా లేడు కావుననే, వాడెక్కడో అనుభవింపవల సిన లోకాంతరములుకాని, స్వర్గ నరకములుగాని శూన్యములు. ఇంద్రియములతో తనివితీర ననుభవించు విషయభోగమే స్వర్గసౌఖ్యము. కంటకాదుల (ముండ్లు మొదలగువాని) చే కల్గు బాధయే నరకము. అవి

రెండును ఈ లోకముననందే కావునను, లోకాంతరములకు పోవు జీవుడు లేడు కావునను, స్వర్గ నరక లోకములను కల్పించుకొను ప్రయాసము వ్యర్థము. చావు పుట్టుకలనునవి యథేష్టముగ సంభవించునవే కాని, ఒక కర్మసిద్ధాంతము ననుసరించికాని, లేదా ఒకదేవుని అనతిప్రకారముగాని చేకూరునవి కావు. స్త్రీ పురుషుల కలయిక యొక్కటే సృష్టికి ప్రధాన కారణము. రజో వీర్యములచేత ఉత్పన్నమైన ప్రాణి శరీరమును రోగము లాక్రమించి, దానిని జర్జరిత మొనర్చి పడవేయునంతవఱకు ఇష్టము వచ్చినట్లు భోగములను కుడుచుటయే ప్రపంచములో నెఱవవలసిన కృత్యము. ఇది పాపమనికాని, ఇది పుణ్యమనిగాని శంకింపవలసిన పని లేదు. తనకు సౌఖ్యమును సంపాదించు సర్వమును హితము. తనకు సౌఖ్యముకానిది అహితము. 'ఇది నా ధనము, ఇది నా స్త్రీ, నేను నా ధనమునే వాడుకొనవలయును, నా స్త్రీనే అనుభవింపవలయును' అను విచారము పర స్త్రీ ధనములను హరింపజాలని దుర్బలులు పాటింపవలసిన నియమమే కాని, పౌరుషలక్షణము కాదు. అర్థ కామములు రెండే పురుషార్థములు. భోగములకు అవసరమగు ధనము నేవిధముచేనైన సంపాదించుట, ఇచ్చవచ్చిన ఇంతుల కవయుట. ఇంతకుమించి చెప్పెడు ధర్మ మోక్షములనెడి పురుషార్థములు కల్లలు. మరణానంతర మేదోలోకమున, ఇంతకన్న విశేషసుఖముల ననుభవింతుమనుటయు, లేదా చెప్పుటకు అలవిగాని ఏదో మోక్ష మబ్బుననుటయు విశ్వాసార్హములు కావు. కారణ మేమన, సుఖములను పొందెడి శరీరము ఇక్కడనే భస్మమగుచుండ, పర లోకసౌఖ్యము, మోక్షము అన నెట్టివి? వాటిని అనుభవించున దెవరు? శరీరపాతమే (మరణము) మోక్షము. నాల్గుభూతముల కలయికచేత దేహ మేర్పడుచున్నది. వాటి వియోగముచేత నశించుచున్నది. అట్టి తటి శరీరమునకంటె వేఱుగ ఏదో కలదనుకొనుట ప్రత్యక్ష విరుద్ధము. కావున -

''యావ జ్జీవేత్ సుఖం జీవేత్ ఋణం కృత్వా ఘృతం పిబేత్,
భస్మీభూతస్య దేహస్య పున రాగమనం కుతః.''

బ్రతికినంతకాలము ఋణము చేసి యైనను నేతిదోసిళ్లను జుఱ్ఱవల యును. అనగా సమస్త శరీరసౌఖ్యములను స్వేచ్ఛగా అనుభవింపవలయు నన్నమాట. తినుట, త్రాగుట, భోగించుట-వీటికి మించి వరుడు చేయవలసి నది లేదు. తగులబడి పోయిన దేహము మఱల వచ్చుట ఎప్పుడును సంభవింపదు.

విషయసుఖములు దుఃఖమిశ్రములు కావున త్యాజ్యములనెడి వాదము, వడ్లపై పొట్టున్నది కావున బియ్యము వీడ దగినవనునట్లు అవివేకమూలకము, హాస్యాస్పదమేకాని, ప్రయోజనకారి కాదు. దుఃఖ ములను తొలగించుకొనుదు సౌఖ్యములను సంపాదించుకొనుట పురుష లక్షణముకాని, అది కారణముగా సుఖములను తెగనాడుట పౌరుషము కాదు.

చార్వాకుల వాద మింతమాత్రమే కాదు. వేద మతానుయాయులు కావించు శ్రౌతకర్మలయందును, వారి ధర్మములయందును పై మతము వారు చేసెడు దోషోద్ఘాటనము ఆశ్చర్యకరముగ నుండును. అగ్నిహోత్రా దులచే స్వర్గాదులను సాధించి సుఖింతు మనుటను గూర్చి -

''అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదండం భస్మగుంఠనం
బుద్ధి పౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః.''

అగ్నిహోత్రము, వేదములు, వాఙ్నియమము, మనో విగ్రహము, శరీరనియమము, భస్మము పూయుట మున్నగు కృత్యము లన్నియు బుద్ధియు, పౌరుషమును లేనివారికి బ్రతుకుతెరువులేకాని వేఱు కాదు.

ఇంతేకాదు. ఇంకను వైదికమతముమీద మీరు కు రి పిం చి న ప్రశ్నలవర్షము, చేసిన విమర్శలు కొంతవరకు హే తు వా ద బద్ధము లై యుండును. యజ్ఞములు చేసిన యజమానులు స్వర్గమునకు పోయి అచ్చట విశిష్టములగు ఆ యా ఫలములను అనుభవింతురని వై ది కు లు చెప్పుదురు. యజ్ఞములో చంపబడిన పశువునకు కూడ స్వర్గప్రాప్తి కలుగుననియు, తత్కారణమున అందు చంపబడిన పశువునకు ఉత్తమ గతియే కాని, అధోగతి లేదనియు వేదవాదులందురు. ఇందుకు చార్వాకులు-

"నిహతస్య పశో ర్యజ్ఞే స్వర్గప్రాప్తి ర్యదీష్యతే
స్వపితా యజమానేన కిన్ను తస్మా న్న హన్యతే ?"

యజ్ఞములో చంపబడిన పశువునకు స్వర్గము లభించునట్లైన యజమానుడు తన తండ్రినో, మరొక ఆప్తునో చంపి యజ్ఞము చేసినచో వారికి సులభముగా స్వర్గలాభము కలుగును గదా ! ఇందుచేత శ్రోత్రియులు చెప్పునట్లు స్వర్గనరకము లున్నచో, ఏ నరకమునకో పోవలసిన అతనికి ఆ నరకప్రాప్తి తప్పుటయే కాక, విశేషముగ స్వర్గముకూడ దొరకునే యని ప్రశ్నించుచున్నారు.

అట్లే మృతుల నుద్దేశించి చేసెడు శ్రాద్ధాది కర్మలను గూర్చియు -

"మృతానా మపి జంతూనాం శ్రాద్ధం చే త్తృప్తికారణం
నిర్వాణస్య ప్రదీపస్య స్నేహ స్సంవర్ధయే చ్ఛిఖామ్."

చచ్చినవారికి శ్రాద్ధము తృప్తి నివ్వగలిగిన పక్షమున, దీపమారిన ప్రమిదలో చమురుపోసిన వెలుగవలయును, అది యెక్కడను చూడమైతిమి. మరియు మీరు చెప్పుచున్నట్లు పితృలోకములో నున్న వారికి ఈ శ్రాద్ధభోజనము సంక్రమించు నట్లైన, గ్రామాంతరమ్ము వెళ్ళెడు మనుజులకు చద్దిమూట కట్టక, ఇంటివద్ద తద్దినము పెట్టి తృప్తి

కలిగింపవచ్చునే. లోకాంతరములో ఉన్నవానికి చేరుటకంటె ఈ లోకములోనే కొలది దూరములో నున్న యాత్రికునకు ఈ భోజనముచేరుట సులభముకూడ నగును. కావున మీ శ్రాద్ధ సిద్ధాంతము కూడ వట్టి కల్పితమై బ్రాహ్మణుల పొట్టకూటి కుపయోగించుచున్నది కాదా? చచ్చినవాడు తినుటా లేదు, వానికి తృప్తి యగుటా లేదు. ఇక దేవుడు, పుణ్యము, పాపము, స్వర్గము, నరకము, ధర్మము - అధర్మము, ఇట్టివి అన్నియు మాయావులగు వేదమత కర్తలు ప్రజలను వెల్లించుకొని తినుటకై యేర్పఱచిన కపట నాటకములోని పాత్రలే.

ఈ విధమైన పూర్వపక్షములతో చక్కని హేతువాదములతో ఒక దర్శనశాస్త్రమును బృహస్పతి రచియించి యున్నాడు. దానికి ప్రచారకుడు చార్వాకు డగుటచే చార్వాక దర్శనమని పేరు గలిగినది. ఈపూర్వ పక్షములు శబ్దప్రమాణ పరతంత్రమగు వైదికమతముచేత ఖండింపబడినవి. ఆ విస్తర మిట అనవసరము. అసురములగు ఈ దర్శన సిద్ధాంతములు ఖండనీయములే యయినను, ప్రకృతమున తత్త్వపక్తి యేల కలిగె నన్న, అద్దానిచే ఎఱుంగదగిన విశేషములు కొన్ని కలవనుటయే ఇందుకు కారణము. మానవునకు సందేహములు నివారితము లయినగాని వస్తువును గూర్చిన సిద్ధాంతదృష్టి బలపడదు. సందియములనెడి అడ్డంకులున్నప్పుడు, వస్తువున్నదని చెప్పుచున్నను, మబ్బులు తొలగనిది సూర్యప్రకాశము తోపనట్లు వస్తువును శుద్ధముగ నెఱుగ జాలదు.

మానవుడు సహజముగ ఈ చార్వాక మతములో నుండియే పై పై మతములలోనికి ఎదుగుచున్నారు కావున, దీనిచేత మనుష్య విజ్ఞానము యొక్క క్రమవికాసము, దాని యంతరువులు - బోధపడగలవు. చార్వాక మతము నట్లుండనిచ్చి చూచినను ఈ యవస్థ మానవున కొకప్పుడు సంభవించుననుట సత్యదూరము కాదు. నరునిబుద్ధి వికాసము






వందుటకు కొరుత అతడు ప్రత్యక్ష ప్రమాణమునకంటె ఇతరమైన దానిని అంగీకరింపకుండుట సహజమే.

పుడమియందలి వస్తుజాలమును కనిపెట్టుటకు ఏ సాధనములు మనకు కలవో ఆ సాధనములచే లభించిన జ్ఞానమును మాత్రము సత్యమని ఒప్పుకొనుటకు ఎవ్వరును కొంకుటలేదు. పుడమినే కాదు, విశ్వములోనున్న పదార్థరాశినికూడ మానవుడు ఈ కొలతపాత్రతోడనే కొలువ జూచుచున్నాడు. బాహిర ప్రపంచ సామగ్రిని తెల్సుకొనుటకు ప్రాణికున్న ప్రథమ సాధన సంపత్తి ఇంద్రియములు. ఎద్దానిని కంటితో చూచునో, దేనిని చెవితోవినునో, దేనిని నాల్కతో ఆస్వాదించునో, దేనిని చర్మముతో తాకునో, దేనిని ముక్కుతో వాసనచూచునో ఆ యా వస్తువుల ఉపలబ్ధి విషయమున మానవునకు సందేహము లేదు. వాటి ఆంతరిక గుణము మాట అటుంచినచో, తద్బాహ్య స్వరూపమును తత్త్వముగ నిర్ణయించుటలో పెద్దలైనవారు పలుకరు. జీవునకు ప్రథమోపకరణము ఇంద్రియములు కనుక వాటితోడ అతడు వస్తుస్వరూప నిర్ణయమునకు పూనుకొనుట యుక్తముగనే తోపవచ్చును. కావున జిజ్ఞాసను ప్రేరేపించునవి - వస్తువు యొక్క బాహ్యస్వరూప నిరూపణమున (అయథార్థముగ గాని, యథార్థముగ గాని) ముందడుగు వేయునవి ఇంద్రియములే.

కావున జ్ఞాన సంపాదనము బాహ్యేంద్రియములతో ఆరంభమగుచున్న దనుట నిజము. ఈ విషయమున శిశువు యొక్క జ్ఞానస్ఫురణము ననుసరించి చూచిన, మన యాలోచనము వ్యర్థపడఁగల్గదు. ప్రథమమున వస్తుమాత్ర పరిజ్ఞానమే బాలునకు కలుగుచున్నది. అందును బాహ్య స్వరూపముతోని అంగములుకూడ వృత్తక్కులుగ తోపవు. క్రమముగ అలవడిన పరిచయముచేగాని, జ్ఞాన వికాసముచేగాని పదార్థముల (దృశ్య

వస్తువుల) బాహ్యాంగములనేటి సుస్పష్టముగ తెలుసు గుర్తింపబడలేము. దేని కంటె కాలు వేలనియు, చెవికంటె కన్ను భిన్నమనియు తెలియు జ్ఞానశక్తి క్రమగతిచేతను, చిరపరిచయముచేతను అలవడుచున్నది. కాలు చేతులతో కూడిన ముద్దయొక్క స్ఫూర్తిమాత్రము మున్ముందు తోచును. ఈ సందర్భమున చెప్పబడునది భాషారూప జ్ఞానము కాదు. అది మనము నేర్పనట్టిది కావున కృత్రిమ మగును. ఇదిగాక సహజోత్పన్నమయిన జ్ఞానమొకటి శిశుమానసమును అంటియున్నదని మన తత్త్వ శాస్త్రవేత్తలకు చెప్పబడిలేదు. ఆ జ్ఞానము నేయితము ఉపాధిగత తేజో విశేషముకుబట్టి కొన్ని ప్రకృతులయందు అధికముగను, కొందఱియందు హీనముగను ఉండును. బాల్యమున అరంభింపబడిన ఈ ప్రత్యక్షజ్ఞానమే (ఇంద్రియ సన్నికృష్ట జన్య జ్ఞానము) సామాన్య బుద్ధివికాసము కలిగిన పిమ్మట కూడ మానవునియందు స్థైర్యము నందుచున్నది. కావుననే ఇతర ప్రమాణముల కంటె ఇదియే సుదృఢమయి ఇంద్రియాతీత జ్ఞానమును అపలాపము చేయగల్గుట. కొద్ది పరిశ్రమచేతనే లభ్యమగునది కావున, ఈ జ్ఞానము నాశ్రయించుటలో జీవులు ముందంజ వేయుచున్నారని చెప్ప నొప్పును. సృష్ట్యాదికాలమునుండి పరోక్ష పదార్థజ్ఞానమును అపలపించు ఈ ప్రత్యక్షజ్ఞానము మానవసంఘమును అకట్టుకొనియే యున్నది. ఇందుకు చార్వాకాది నాస్తికమతములే ప్రబల నిదర్శనములు. ఎదుట కన్పట్టు జగత్తు మాత్రమే సత్యమనియు, ఇంద్రియ గోచరములైన విషయములే బ్రహ్మానందములనియు చెప్పబోవు ఇట్టివారి జ్ఞానము ఎంత స్థూలమును నింద్యమో విచారింపుడు. పసిపాపని తెలివినిం బోలిన ఈ నాస్తికుల ప్రజ్ఞ వికసించిన విధాన మిది.

క్రమగతిని బుద్ధి వికసించిన పిమ్మట, జ్ఞానతేజము కలుగ నారంభించినప్పుడు పరుడు ప్రత్యక్ష జగము యొక్క సాహాయ్యముచే అప్రత్య

క్షముగ నున్న పదార్థ రాశియొక్క ఉనికిని గూర్చి నిర్ణయింప తివురు చుందురు. ఇప్పుడనే అనుమాన ప్రమాణమును ఉపయోగించుచున్నారు. కార్యమునందు, అనగా స్థూలప్రపంచమున మాత్రము సంసక్తమయిన చిత్తము కారణతత్త్వాలోచనము (సూక్ష్మవస్తు విచారము) నకు పూను కొనునది ఈ అవస్థలోనే. ఇది చిత్తవికసనములోని ఒక దశ. బృహ ద్రూపమున కొన్న చెట్టు విత్తనములోనిదే యనియు, పొగ వచ్చు చున్నది కావున నిప్పు ఉండితీరుననియు చేసెడు నిర్ణయములు ఈ దశ లోనివి. ఈ అనుమాన ప్రమాణ జన్య జ్ఞానము నయితము ఒక్కొకప్పుడు బాధితమగును. అగుగాక. ప్రత్యక్షమునకన్నను ఇది ఒక మెట్టు పైనున్న దశను రూఢి. ప్రత్యక్షపరిధి కన్నను ఈతని బుద్ధి వికాససీమలో విహా రముచేసి పరోక్ష పదార్థజాలమును పసిపట్టజాలినది. కార్య కారణరూప ములను అనుమానించు ఈ ఊహాబలముచేతనే కార్యరూపమయిన ఈ జగత్తునకు కారణము ఉండితీరునని తార్కికులు సిద్ధాంతీకరించి యున్నారు. కాని జగత్కారణమును అనుమాన ప్రమాణముచే నిర్ణయిం చుట వేదోక్త మతమువారికి గిట్టదు. ఇప్పట్టున నైయాయికులకును, ఉత్తర మీమాంసకులకును ఘటిల్లిన ఖండన మండనములు ఉత్తరోత్తర ప్రౌఢములు. అవ్యవస్థితమును, భ్రమాదావహమును అగు పురుషబుద్ధితో విశ్వకారణ సద్భావమును నిర్ణయింపనేల? అది ఒకానొకప్పుడు అసత్యము కావచ్చును. విశ్వకారణమును అపరోక్షానుభూతికి తెచ్చుకొన్న ఆప్తుల మాటతో అద్దాని నంగీకరించిన మనకు బాధ లేదని శ్రోత్రియులు. ఈశ్వరదత్తమైన ఏ వేదమును నీ వాప్త వాక్యమని నొడువుచున్నావో, ఆ శ్రుతికి ప్రమాణమే లేదు. ఏలన? ఈశ్వరసద్భావము కలిగిన పిమ్మట నేకదా తద్దత్తమైన వేదమునకు ప్రామాణ్యసిద్ధి. ఈశ్వరసత్తయే నిశ్చయము కానప్పుడు ఆతనినుండి వేదము వచ్చెననుట యెట్లు పొసగును?

అట్టి అ కర్తృకమైన దానికి ప్రామాణ్యమెక్కడిది? కావున మీ వాదము దోషయుక్తమని నైయాయికులు. ఈశ్వర కారణుల (జగమున కీశ్వరుడు కారణమను తార్కికులు) హేతువాదము బాధితమగు హేతువులు కొన్ని యుండుగాక; బాధలేని హేతువును గ్రహించి బాధితమును వర్జించుటయు, పౌరుషమగు జ్ఞానమును ఊతగాగొని అతీంద్రియ వస్తువు స్థిరీకరించుటయు ఏల యని ఉత్తర మీమాంసకుల ఆక్షేపము. అందుకే ప్రత్యక్షానుమానములను దాటిన ఒండొక్క ప్రమితిని శాబ్దికమును అంగీకరించినారు. ఆ శబ్దప్రమాణము వలననే దృష్టాదృష్ట విషయములు నిర్ణీతములు కావలయుననియు, జగత్కారణ వస్తువుకూడ ఆ శబ్దప్రమాణముచేతనే యెఱుంగవలెననియు వీరి రాద్ధాంతము. అందుకే వేదవాక్యము అపౌరుషేయమనియు, పరమ ప్రమాణమనియు మీమాంసకులు.

ప్రత్యక్షానుమానాగమ ప్రమాణములయందు మానవుని బుద్ధివికాసమును తెలియజేయుటకే ప్రస్తుత విస్తరమునకు పూనుకొనవలసి వచ్చినది. ఈ మూడు తరగతులను బట్టియే లోకములో మానవుడు తన వ్యవహారములను నిర్ణయించుకొనుచున్నాడు. నానావిధములైన మతములు కూడ తమ తమ లక్ష్యములను ఈ ప్రమాణములనుబట్టియే నిశ్చయించుకొనుచున్న వనుటయు సత్యము. ఏవారికి ఏ ప్రమాణమునందిష్టమో, ఎవరి జ్ఞానము ఏ ప్రమాణమువఱకు వికసించినదో వారి లక్ష్య ప్రయోజనములును తదనుకూలములయియే యేర్పడుచున్నవి. ఇక ప్రకృతము ననుసరింతము.

యథార్థమునకు మానవుని స్వభావమును పరిశీలించి చూచిన - తినుట, త్రాగుట, భోగించుటలతో ఎవ్వడును తనియడు. దేహమునకు సంబంధించిన ఈ క్రియలతో కొంతవఱకు బాహ్యమగు సంతృప్తి కలిగినను, అంతరిక జగత్తుతో ఏదో అసంతృప్తి చెలరేగుచునే యుండును.

ఏవేవో కోరికలు, ఏవేవో ఆకాంక్షలు, ఏవేవో సంకల్పములు ఉవ్వెత్తుగ మానవిక జగత్తున తలయెత్తుచు మానవుని ప్రేరేపించుచుందును. శరీర భోగము, శరీరసౌఖ్యమే కాక వీటిని మించిన భోగమేదో మానసికముగ కలదని నరుని బుద్ధి తలంచుచుండుట పరిపాటి. అట్టి తలపోతయే శరీర సౌఖ్య సంపాదనమాత్రమున మానవప్రాణిని విడిపోనీయక, తద్వ్యతిరిక్తమైన ఏదో ఒక తృప్తి కావలయునని అతనిని వేధించుచున్నది. విచారింపగా ఇట్టిది మనోమయముగ అందవలసిన ఒక సంతృప్తి, ఒక ఆనందము అని తోచుచున్నది. కావుననే సర్వప్రపంచ సామ్రాజ్యాధిపత్యము చేకూరినను మానవుని కోరికలు, భోగవాంఛ కడముట్టుట లేదు.

ఈ విచారణచేత ఇప్పుడు శారీరకమగు మానవభోగము మనస్సనియెడు ఒక లోపలిమెట్టు నెక్కుట గమనింప దగినది. ఇప్పుడీతని తృప్తి సంపాదన మంతయు మనస్సునకే సంబంధించి, మనస్సు మీదనే ఆధారపడియుండును. శరీరము, దానికి సంబంధించిన భోగము, మనోభోగమును, మనస్తృప్తిని చేకూర్చుటలో సాధనము మాత్రమయి అప్రధానమయి పోయినది. కాగా శారీరకములగు సుఖదుఃఖముల కిప్పుడు ప్రధాన గణనము లేదు. అంగభావమే కాని అంగిత్వము శూన్యము. మేడ నెక్కువానికి పైకి చేరుటకును సోపానము లెట్లు సాధనములై, మేడనెక్కుటయను పరమ ప్రయోజనము సిద్ధించిన పిమ్మట ఆ మెట్లు వీడ దగినవే యగుచున్నవో, అపాటి ప్రాధాన్యమే దేహమునకు కూడ అని యట పరమార్థము. అగుగాక; ఇక మానసికముగా నీతడు పొందవలసిన సిద్ధి యేమో విచారింతము.

శరీరమునకు తినుట త్రాగుట మున్నగు ఇంద్రియవిషయముల ననుభవించుటే స్వధర్మమయినట్లు మనస్సునకు కూడ కోరుట, సంకల్పించుట, ఆలోచించుట మొదలగు గుణములే ధర్మములా, లేక ఇంక ఇతర

ధర్మము లేవైన కలవా అని మున్ముందు తెలిసికొనవలసి యున్నది. ఒక దాని ధర్మమును, స్వభావమును తెలిసినప్పుడైన దానినిబట్టి దానికి కావలసిన ప్రయోజనమును తేల్చుట సులభమనుకొంటిమి కావున, మన దృష్టి కోణము దానిపై పడుచున్నది. పరిశీలించి చూచిన సంకల్ప వికల్పములు, కోరుట, ద్వేషించుట, ఆలోచించుట మున్నగునవి మనోధర్మము లయినట్లే విదకట్టుచున్నవి. జాగ్రత్స్వప్నావస్థలయందీ వ్యవహారమును మనము కాంచగల్గుచున్నాము. ఒక్క సుషుప్తియందు మాత్రము మనస్సు యొక్క ఊహాపోహలన్నియు బీజప్రాయముగా అణగిపడియుండును గాని, ఇతర సమయములందు మనస్సేదో ఒక పరిశ్రమము ఒనర్చియే తృప్తినిగాని అతృప్తినిగాని పడయుచున్నది. ఒక విషయమునో భావించియో, ఏదో ఒక ఆకాశసౌధమును నిర్మించియో, సుందర సుందరములగు కల్పనముల నొనర్చియో మనస్సుమది తనియు తృప్తినిగాని, తదనంతరము దివ్యసుఖానుభూతిని పొందిన అది సంతసించుట లేదు. వేరొక భావనీయ వస్తువును కల్పించుకొనుచు మాత్రమే చిత్తము వేధింపబడుచున్నది. తన భావనాపథమున పోగినప్పుడును, ఆ మార్గమున రాళ్ళు, గుట్టలు, మిట్టలు నిండుకొన్నప్పుడును దెబ్బతిని యెదతడ భిన్నమగుచున్నదే కాని తృప్తి చెందుటలేదు. దీనినిబట్టి చూచినను మానసికసౌఖ్యము, శాంతి ఎట్లు చేకూరగలదో తోచకున్నది. సంకల్ప వికల్పములే మనోధర్మములు కావున, వానిచేతనే అంతర్గతమైన విశిష్ట భోగము మానవునకు లేదని రుజువగుచున్నది. సర్వసంకల్ప వర్జితమగు స్థితి యేదేని ఉన్న అట్టి నిర్వికారమగు ఒకానొక అనుభూతి మానవునకు శాంతిదాయక మగునేమో కాని, అంతకుమించి వేఱు తెరువు కన్పడుట లేదు. అట్టి స్థితిని వాంఛించు మనస్సుల సంఖ్యయు చాల తక్కువగనే ఉన్నది. కావుననే పార్థివ (మట్టి) శరీరముతో పొందెడు ఇంద్రియ సౌఖ్యములను సామాన్యముగా భావించి, స్వర్గాది లోకములందలి దివ్యసౌఖ్యము

లను ఛవిచూచుటకు జనుడు తహతహపడుచున్నాడు. ఈ లోకములోని భోగములకన్న, ఇంపలి ఆనందమునకన్న, స్వర్గాది పారలౌకిక సౌఖ్యములు, అందలి ఆనందము కొన్నిరెట్లు మిన్నయను వరుని విశ్వాసమే అతని నచ్చుటికి ఆకర్షించుచున్నది. అది కారణముగా త్రయీ (వేద) ధర్మము ననుసరించి పలువిధ సాధనములతో అనేకయజ్ఞము లొనర్చి పురుషుడు లోకాంతరమును జేరుచున్నాడు. ఇక అట్టి స్వర్గలోకమునందు అతడనుభవించున దేమి? పెక్కు విషయములందు దేవ మానవ భోగములకు సామ్య మున్నది. ఇక చెప్పవలసిన దేమన? ఇహలోక భోగమంతయు పార్థివము. పారలౌకిక మగున దంతయు దివ్యము; జ్యోతిర్మయము.

ఈ దివ్యభోగ మెన్నాళ్లు? ఇహలోక భోగమెట్లు కర్మననుసరించి ఏ విధముగా ఎన్నాళ్లు భోగ్యమగుచున్నదో, అట్లే స్వర్గభోగమును కర్మానుగుణముగ కొన్నాళ్లు మాత్రమే భోగ్యమగుచున్నది. కారణమేమన, ఉభయలోకములును కర్మ సంపాదితములే. ఏవిధమైన కర్మములొనర్చిన, ఆ కర్మలకు తగిన లోకములలో తల్లోకోచితములైన ఫలములను అనుభవించి, తత్కర్మజన్యమగు పుణ్యము క్షీణింపగా తిరిగి మర్త్యయోనియందు ప్రాణి పుట్టకతీరదు. ఏ లోకమున కేగుటకైనను ఇదియే (భూలోకము) కేంద్రస్థానము. ఇచ్చటకు వచ్చి ఇటు కొంత కర్మ నొనర్చి, పై లోకముల కేగి ఆ కర్మ ఫలమును కుడిచి మరల ఈ పార్థివలోకమునకే, పార్థివదేహమునకే జీవుడు వచ్చుచుండును. ఈ విధముగ కోట్ల కొలది యుగములు జరిగినను, జన్మములు చెల్లినను కర్మబద్ధులకు ఈ రాకపోకలు తప్పవు. నిన్న తిన్న తియ్యనిదో లేక పుల్లనిదో అగు కూరయే నేడును. కావుననే వేదధర్మానుష్ఠాతలు పొందెడి ఈ సౌఖ్యము శాశ్వతమును, నిరతిశయమును కాదని వేదాంతము (ఉపనిషత్తు) లు ఉద్ఘో

షించు చున్నవి. పరలోకములలోని దివ్యసౌఖ్యములను వలచి, నానావిధ కర్మములచే వాటిని సంపాదించి అచ్చటికేగి అనుభవించుచున్నను, జీవుని అచ్చటకు కొనిపోయిన ఈ మనస్సు స్వధర్మమును మాత్రము వీడదు. దాని సంకల్ప వికల్పములు, ఆలోచనా వ్యవహారములు యథాప్రకార ములే. అక్కడకును సంతృప్తిలేదు. చెప్పరాని కొఱత, వచింపరాని అశాంతి మనస్సును బాధించుచునే యుండును. "కర్మజీవినగు నేను మఱల భూలోకమున కేగుదును కాబోలు; అచ్చట సుఖముతో కూడ దుఃఖమును సైతము అనుభవింపవలయును కాబోలు. కావున మఱల ఈ దివ్యసుఖమును పొందు కర్మల నొనర్చి ఈ సౌఖ్యమునే పొంద యత్నింతునుగాక'' అను ఆలోచనకు అంతముండదు. ఈ ప్రకారముగ స్వర్గ మర్త్యములకు జరిపెడి ఈ యాత్ర నిరంతర మగుచున్నది. ఎక్కడకు వెళ్ళినను శరీరసంబంధము పోలేదు. ఇక్కడ స్థూల శరీరము ఉండగా, అక్కడ కలలో వలె సూక్ష్మ శరీరమేకాక, జ్యోతిర్మయ దేహ మొకటి స్థూలముగ తగులొన్నది.

స్వర్గ మర్త్యములనెడి రెండు లోకములందును గల జీవనములలో దివ్య మర్త్య భేదము తక్క సంసార మనునది రెండింటను సమానమే. జీవుడు నానా యోనులందు సంచరించు అవస్థమాత్రము తప్పలేదు. ఇంత వఱకు ఈతని కార్యము శరీరాహంకారమును పురస్కరించుకొనియే, దాని సౌఖ్యముల కోసమే కేంద్రీకృతమై యున్నది. పారలౌకికమైన దివ్యసుఖమునందు దివ్యత్వ మొక్కటి తప్ప, నిత్యత్వ నిరతిశయత్వా దులు లేకపోవుటచేతనే ప్రస్థానత్రయము దానిపట్ల నీరసం పడినది.

''ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞ రూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మ,
ఏత చ్ఛ్రేయో యేఽభి నందంతి మూఢా
జరా మృత్యుం తే పునరే వాపియన్తి.''

''ఇష్టా పూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్య చ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశన్తి.''

— ముండకోపనిషత్తు. 1 - 2. 6, 7.

పదునార్వురు ఋత్విజులు, పత్ని, యజమానుడు అను పదునెని మిదింటి నాశ్రయించి ప్రవర్తించు యజ్ఞరూపములగు కర్మములు అస్థిరములును, నశించునవియునై యున్నవి. ఆత్మజ్ఞాన శూన్యులయి, ఏ మూఢులు ఈ శ్రేయస్సునే ఘనమని అనుసరింతురో, వారు జరా మరణ రూపమగు సంసారమునకు మరల రావలసినదే.

జ్యోతిష్టోమాది శ్రౌతకర్మలను, వాపీ కూప తటాకాది ప్రతిష్ఠా రూపములగు స్మార్తకర్మలను సర్వశ్రేష్ఠములని భావించి, వాటియందే ఆసక్తి కలవారయి ఐహికాముష్మిక భోగలంపటులగువారు ఆత్మజ్ఞానరూపమగు పరమశ్రేయము విషయమున మూఢులై, స్వర్గమున పుణ్యఫలముల ననుభవించి, ఆ ఫలము కడముట్టగనే తిరిగి మనుష్యలోకమున గాని, అంతకన్న హీనమగు తిర్యగ్యోనులయందు గాని పుట్టుచుందురు.

''త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్య మాసాద్య సురేంద్ర లోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్.''

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే.''

— భగవద్గీత. 9. 20, 21

వేదవాద రతులై యజ్ఞములు చేసి సోమపానముచే పుణ్యము నార్జించి స్వర్గమునకేగు సోమయాజులు దేవలోకమున అపార్థివములైన దేవభోగముల ననుభవించి, ఆ పుణ్యము క్షీణింపగా మర్త్యలోకముననే తిరిగి ప్రవేశించుచున్నారు. త్రయీధర్మ పరాయణులైన ఈ కామారాధకులు స్వర్గ మర్త్యములకు గమనాగమనము లొనర్చుచున్నారని గీతామాత నుడువుచున్నది. అంతియేకాక, వేఱొకచోట కూడ జన్మము లొనర్చు వీరినిగూర్చి గీత -''భోగైశ్వర్యములు లోభపెట్టుచుండ, ఇంతకుమించిన కర్తవ్యము పురుషునికి లేదనుచు కర్మము లొనర్చుచుందురని'' వారి చర్యను గర్హించుచు అట్టివారికి వ్యవసాయాత్మకమగు బుద్ధి (సమాధి యందు) అలవడదని పలుకుచున్నది.

బ్రహ్మసూత్రము లందలి ''అథాతో బ్రహ్మ జిజ్ఞాసా'' అను సూత్రములోని 'అతః' అను కారణవాచకము కూడ యజ్ఞ కర్మములనే నిందించుచున్నది. ఎందుచేత అగ్నిహోత్రాదులచే కలుగు స్వర్గఫలము కూడ నశించునదై జనునికి ఆరాధ్యము కాకున్నదో, ఆ కారణమున, ఓ మానవుడా ! నీవు బ్రహ్మ జిజ్ఞాస చేయు మనుట దాని హృదయము. ఈ విషయము నే ఉపనిషత్తు కూడ ఇట్లు వాకొనుచున్నది -

''త ద్యథేహ కర్మచితో లోకః క్షీయతే
ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే.''

— ఛాందోగ్యోపనిషత్తు. 8. 1. 6

కర్మసంపాదితమైన ఇహలోకము వలెనే, పుణ్య సంపాదితమైన పరలోకమును నశించుచున్నది. కావున ఈ నశ్వర లోకములందలి సౌఖ్యములను ఆశించి మానవుడు శ్రమించుట ఎంత శోచ్యముగ నుండును।

ఇంతవఱకును నరునకు కావలసిన పరమ పదార్థము చిక్కలేదు. చిక్కినవి సంతృప్తిదాయకములు కాలేదు. ఇహమునకన్న, స్వర్గమున కన్న ఇంక ఏదో విశిష్టమును, అతీతమునగు పదార్థమువైపునకు నిరతిశయ సౌఖ్యము దిక్కునకు మానవుని మనస్సు మొగ్గుచున్నది. ఏ సౌఖ్యము చేకూరిన పిమ్మట ఇక ఇతర సుఖాపేక్ష మానవునికి ఉండదో అట్టి సుఖము - సుఖములకెల్ల పరమసుఖమగు నిరతిశయ సుఖము. అది సాధనాంతర నిరపేక్షము కూడ కావలయును. ఆ పరమ సౌఖ్యము దేనియం దుండునో, ఎక్కడ లభించునో విచారించుటకు పూర్వము, ఇప్పటికి లభించిన స్వర్గ మర్త్యలోకముల యందలి సుఖముల స్వరూప లక్షణములను, సాధనములను గూర్చి విచారించిన, ఇంతకంటె విలక్షణమైన స్వరూపమును, సాధన విధానమునుగల పరమసుఖ వస్తువును అరయ వచ్చును.

భూతలమునందలి ఫలములుగాని, స్వర్గమునందలి భోగములుగాని సాధ్యసాధనములతో కూడుకొనియున్నవి. జీవుడు మనస్సంకల్ప పూర్వకముగ ఇంద్రియములను విషయములతో సంయోగ మొనర్చుటచే కలుగునది దేహసౌఖ్యము; మఱియు ఈ సౌఖ్యము వెలుపలి జగత్తులోనిది. దానిని లోపలికాకర్షించుటకు కన్ను, ముక్కు, చెవి, కాలు, చేయి, ఉపస్థ మున్నగు ఇంద్రియములు సాధనములు. ఈ సాధనములు బాహ్యమున నున్న విషయసుఖము లోపల ప్రవేశించి అంతరింద్రియము (మనస్సు) నకు అనుభూతమగుటలో వాకిళ్ళ వంటివి. కావున ఇరుదు

సాధ్యసాధనముల బాహుళ్యము మిక్కుటము. వెలుపల సాధ్యమగు ఒక సౌఖ్యము, దానిని సాధింపవలయునని మనస్సులో ఒక సంకల్పము, సాధించుటకు కావలసియుండు బాహ్యసాధనములగు ఇంద్రియములు- ఇన్ని యున్నగాని ఈ సౌఖ్యము బుద్ధిగోచర మగుట లేదు. ఇందేది కొఱవడినను సుఖోపలబ్ధి లేదు. ఈ సాధనసామగ్రికి విషయమైన వెలుపలి సౌఖ్యమును బుద్ధిప్రతిఫలిత చిదాభాసు (జీవుడు) డు ఆస్వాదించి, అనగా అతడు విషయసౌఖ్య స్వరూపుడే అయిపోయి, తనకు తృప్తిగాని, లేక దుఃఖముగాని కలుగుచున్నట్లు తలంచుచున్నాడు. ఈ సందర్భమున సాధనసంపత్తి పుష్కలముగా ఉన్నను వెలుపల సాధ్యమగు విషయజాతము లేనిచో లోపలి సంకల్పములు వ్యర్థమగును. విషయసంపద కొల్లగా ఉన్నను ఇంద్రియపుష్టి లేని యెడల సంకల్పమున కిక దుఃఖమే శరణ్యము. మనోహరదృశ్యములను అవలోకించు నిచ్ఛ పూర్తిగా నున్నను, గ్రుడ్డివాని ఆ కోరిక యెట్లు ఫలింప గలదు? లలిత గంధర్వగానములను ఆలింప వేడ్క యున్నను చెవిటివానికి తత్ఫలము నుదూరమే కదా! నపుంసకుని సంభోగేచ్ఛ యెంతవఱకు సఫలము! అజీర్ణరోగియొక్క చతుర్విధాహారాసులవేచ్ఛ నిష్ఫలమే కాదా! ఈ విధముగ చూచిన సాధ్యసాధనముల కలిమిబలము ఉన్ననే కాని, శరీరభోగము సిద్ధించుట లేదు. కనుక ఈ సుఖములన్నియు సాధ్యసాధన సాపేక్షములు.

ఇక స్వర్గము, పుణ్యము అనువానిని గూర్చి ఆలోచింతము. స్వర్గసౌఖ్యము మానవునకు పూర్వసిద్ధమై లేదు. నానావిధ సాధనములచే అది సాధ్యము. యజమానుడగువాడు యజ్ఞ మొనర్చుటచేత ఆ యజ్ఞమునకు తగిన ఒక అపూర్వము పుట్ట గలదు. అపూర్వమనగా పూర్వము లేనిదని యెల్లరికి సుబోధమే. అట్టి అపూర్వము భూతకాలమున లేనిది; కాని

కాలమున ఈ యజమానునకు అనుభోగ్యము కావలసినది. ఇదే సాధ్యము. దీనికి యజ్ఞము సాధనము. యజ్ఞమను సాధనముచేత విశిష్టఫలరూపమగు సాధ్యమును (అపూర్వమును) యజ్ఞకర్త తాను భోగించుటకై పుట్టించు చున్నాడు. కావున ఇది పురుషవ్యాపారమున కధీనమైనదే కాని, స్వతం త్రము కాదు. ఈతడొనర్చు క్రతుకర్మము కూడ నానాసాధనములతో సాధింప దగిన ఒక అసాధ్యమగు సాధ్యమే కాని, సామాన్యమైనది కాదు. కావున బహు ప్రమాదములకు నెలవును కామకర్మ బహుళము అయినది యజ్ఞము. అందుచేతనే దవ్వంత వ్యత్యాసము కలిగినను, ఇది అభీష్టఫలము నిచ్చుచున్నది. ఇంతగా శ్రమించి సంపాదించిన ఈ సౌఖ్య మైనను ఒక దేహమును ధరించి ఆ శరీరసాధనముచే అనుభవింపవలసి నదే కాని సాధనము లేక చేకూరునది కాదు. దీనింబట్టి పూర్వము చెప్పిన పార్థివ సుఖమువలె ఇదియు సాధ్యసాధనసాపేక్షమే అయినది కాని, అంతకు మించిన విశేషము గలది కాలేదు. ఇట్టి వీటి స్వరూపములను నశించునవే కాని, శాశ్వతములు కావని మున్నే తెలిసికొనియుంటిమి. శరీరేంద్రియ విషయములు ఉన్నంతకాలమే - వాటి తేజము క్షీణింప కున్నంతవఱకే కర్మానుగుణముగ మాత్రము స్వర్గమర్త్య భోగములు అనుభవింప దగినవగుచున్నవని సారాంశము.

ఇక దీనినిబట్టి శాశ్వతమును, నిరతిశయమునగు సుఖము ఎట్టి లక్షణములు కలిగియుండ వలయునో విచారింతము. ఇంతవఱకు విచా రించిన ఐహిక పారలౌకిక సుఖములు రెండును పూర్వసిద్ధములు కావు. అనగా భూతకాలమున లేనివని భావము. పురుషుడు కామ కర్మ వ్యవ హారపూర్వకముగా ప్రయత్నించి నానాసాధనములచే సంపాదించి అనుభ వింపదగినవి. అట్టి సుఖములకు, వాటిని చేకూర్చు వస్తువులకు కాలత్రయ మునందును ఉనికి లేదు. ఒకప్పుడుండి, ఒకప్పుడు లేకపోవుట తప్పనిది.

చేతితో విసరిన రాయి విసరిన వాని బలము కొలది కొంత దూరమేగి తరువాత వేగము చచ్చి నేల బడునట్లు, ఈ ఉభయలోకములలోని సౌఖ్యము లైనను కర్మములందు శక్తి యున్నంతవఱకే అనుభోగ్యము లయి పిమ్మట అణగారు చున్నవి. చమురున్నంతసేపు వెలిగెడు దీప కళికవలె వీటి వైభవమును క్షణికమే అగుచున్నది.

ఇక మానవునికి కావలసినది కాలత్రయమునందును నశింపనట్టి సుఖము; మార్పులేక ఒకే రీతిగ వెలుంగ జాలెడు సుఖము-అని సులభ ముగనే తెలియుచున్నది. అది వెలుపలి జగత్తున ఉండునట్టిది కాక, అంతఃప్రపంచమున ఉండునట్టిది కూడ కావలయును. అది అంతరారా మమునందలి అంతర్జ్యోతి కానియెడల వెలుపల దానిని వెదకిపట్టుకొనుట కష్టము. మఱియు వెలుపలి వస్తువు మనకు స్వాధీనము కాకపోవచ్చును కూడ; ఒకప్పుడు చిక్కినను వేఱొకప్పుడు లభింపకపోవచ్చును. అంతియే కాక లోపల దాని స్వరూపానుభూతిని పొందినట్లయిన - బయటను, వెలు పలను, అది యుండెడి అన్నిదేశము లందును దానిని ఉపలబ్ధి నందుట సులభతరము. ఇక అట్టి సుఖము సాధనాంతర నిరపేక్షమును కావల యును. పూర్వోక్త సుఖములు సాధనము ఉండినవే కాని సాధింపబడ లేదు. ఇది అట్టిది కాకూడదు; కాదు కూడను. ఏలయన? ఎప్పుడీ పరమసుఖము త్రికాలములయందు ఏకరూపమైన ఉనికి కలదని చెప్పు కొంటిమో, అప్పుడు దానికి భవిష్యత్కాలమున రాబోవు సాధ్యావస్థ తప్పిపోయి, భూత భవిష్యద్వర్తమాన కాలములయందు సర్వదా సర్వథా సిద్ధమై తేజరిల్లుటయే స్వభావము కాగలదు. పూర్వమే సిద్ధమై యున్నదానిని మానవుడు ఏ సాధనములచేత సాధ్యముగా చేసికొన గలడు? అట్టిదాని విషయమున సాధనములుగాని, పురుషవ్యాపారానుష్ఠానములు గాని నిష్ఫలప్రయోజనములు. అందుకే సర్వస్వతంత్రమైన ఈ సుఖము

పురుషవ్యాపారమునకు పరతంత్రమయినదియు కాదని చెప్పబడెను. ''సర్వం పరవశం దుఃఖమ్, సర్వ మాత్మవశం సుఖం'' అనునట్లు పరతంత్రమలైన సుఖములలో దుఃఖస్పర్శయు, అనిత్యతయు ఉండును. ఇది పరతంత్రమును-సాధ్యమును కాదు కావున, ఇక ఉన్నదాని నెఱింగి అనుభవించుటయే - లేదా దాని మనోహర దర్శనముచే సంతృప్త మగుటయే మానవుని కర్తవ్యము.

ఇట్టి ఈ పరమసుఖానుభూతి విషయమై శరీరము యొక్కయు, ఇంద్రియములయొక్కయు తోడ్పాటు ఆవంతయు అవసరము లేదు. ఒక వేళ అట్టి శరీరేంద్రియ సంసర్గము కలదో, ఆ యా సాధనములగు అకరణములు లేనిచో ఆ సుఖము అనుభావ్యము కాకపోవలసి వచ్చును. కావున ఈ సుఖమును దేహాతీతము, విదేహము అనవచ్చును; ఇంద్రియాతీతము, అతీంద్రియము అనవచ్చును. అతీంద్రియమైనది అతిమానసము, అతిబౌద్ధము ఏల కాదు? అంతియేకాదు; అమనస్కము, అతి బౌద్ధము వగుట కేవలాత్మకమును కూడ కాగలదు.

''ఇంతింతై వటు డింతయై'' అనునట్లు దేహము మొదలుకొని అనంతబ్రహ్మాండముల వఱకు అంతులేకుండ పెరిగిపోవుచున్న మానవుని మానసిక వాంఛలు (పలువిధములగు కోర్కెలు) ఇప్పటికి కడముట్టునా? ఇంతకన్న ఎక్కుడు సుఖము, దీనిని మించిన విశిష్టానందము, అను కొనుచు ఎంతకాలము నుండియో మనస్సు బహువిధముల శ్రమించుచున్నది. కోరిక లన్నింటిచే కోరదగిన దగు ఈ కడపటి కోరికలో నడుమ కోరికలెల్ల కట్టువడ మనస్సు నిరభిలాషమును, నిర్విషయమును అగునా? అట్లయినచే ఇది నిరతిశయమగు పరమ సుఖము; పరమానందము. గారుడమంత్రములో కాలసర్పములు కట్టుపడినట్లే, కాలత్రయ సిద్ధమగు ఈ సుఖానుభూతిలో వాంఛాజాలమునకెల్ల పరిసమాప్తి.

"కామాన్ యః కామయతే మన్యమానః
న కామభి ర్జాయతే తత్ర తత్ర,
పర్యాప్త కామస్య కృతాత్మన స్తు
ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః."

— ముండకోపనిషత్తు. ౩. ౨. ౨.

ఐహికాముష్మిక విషయములను గూర్చిన పలువిధములగు కోర్కులు కోరువాడు ఆ కోరికల ఫలమును ననుభవించుటకు అక్కడక్కడ పుట్టుచుండవలయును. చిత్తమును ఆత్మాయత్తము చేసిన పరమార్థదర్శి క్షీణకాము డగుటచేత అతని కోరికలు ఈ జన్మముననే నశించును.

ఇంతవఱకు కాలత్రయమునందును నాశము లేనిదియు, మార్పులేనిదియునగు నిత్యనిరతిశయ సుఖమొకటే పురుషునకు (జీవునకు) సంపాదనీయ మనియు, అంతకుమించి లోకమున నరునికి వేఱు కర్తవ్యము లేదనియు తెలిసికొంటిమి. ఇక అట్టి నిత్యమును, నిరతిశయమును అగు సుఖము ఎద్దాని నాశ్రయించి యుండునో యెఱింగిన గాని, అట్టి పరమార్థ వస్తువును పొంది, నరుడు నిరతిశయతృప్తిని అందజాలడు. నిత్యసుఖము నిత్యమగు వస్తువునే ఆశ్రయించి ఉండవలయును; నిరతిశయానందము సర్వాతిశాయి యగు వస్తువునే ఆశ్రయించి ఉండవలయునని సులభముగనే తెలియుచున్నది. ఏల యన? అనిత్యపదార్థము శాశ్వతానందమును ఈయజాలదు కదా? శాశ్వతమగు ఆనందమును ఇచ్చుటకు అట్టి వస్తువును శాశ్వతమై పరగవలయును. అట్లే ఏ పదార్థమునకన్న మించిన అతిశయము గల వస్తువు వేఱొకటుండదో, అట్టి వస్తువే నిరతిశయము కావలయును. అట్టి నిరతిశయ వస్తువునకే నిరతిశయానందస్థితి సాధ్యము. ఒక కొలతలో మితమగు జలము నీయగల తటాకము, కొలను, మున్నగు జలాశయములు కొలతలకు లోబడని అమితమగు

నీటి నీయలాలతో పోవుట తథ్యమే కదా! ఎంత కాలము తీసికొనుచున్నను తరుగని జలపూరము కావలెనన్న జలరాశి (సముద్రము) నే ఆశ్రయింప వలయును. కావున పైని జెప్పినట్టి నిత్య నిరతిశయ పరమసుఖ స్వరూపోపలబ్ధి కలిగిన పిమ్మట పూర్వమువలె అనిత్యములను ఆశ్రయించి "దీనికన్న ఘనమగు సుఖము, ఇంతకన్న అధికసుఖము కావలయు" న నెడు నరుని ప్రాకులాటయు తుదముట్టి వ్రాలయును. ఇదియు దీనియొక్క విశిష్టలక్షణమే. అట్టి సర్వోత్తమ వాంఛ ఈడేరినచో, దానికి లోపలివగు వాంఛలన్నియు పరిపూర్ణము లయినట్లే. నిఖిల భూమండల సామ్రాజ్యాధిపత్యమే చేకూరినప్పుడు ఇక అతనికి పొందదగని వస్తు వేది? తనకు లోబడియున్నవే సర్వవస్తువులును, ఎల్లపదవులు అగుటచే వాటిని అతడనుభవింప దలచిన అనుభవించును; లేకున్న లేదు. రాజగువాడు బంటు పని చేయ దలచినచో అది యాతనికి లీల - వేడుక మాత్రమే యగును గాని, గతిలేక చేసెడు నీచవ్యాపారము కాదు. అగుగాక! ఇక ఇపుడు నిత్య నిరతిశయ వస్తువేదా అని వెదుకవలసి యున్నది.

సర్వేంద్రియసుఖములను అనుభవించుటకు సాధనమైన శరీరము ఒకప్పుడు నశించుట మనము చూచుచున్నాము. పార్థివమగు ఈ దేహము నశించు స్వభావము కలదనుకొన్నను, లోకాంతరములందు జీవుడు స్వీకరించెడు జ్యోతిర్మయకాయము, అమ్మయ (జలమయ) శరీరము లు*

*జీవుడు అయా లోకముల కేగినపుడు తత్తల్లోకోచితములై తత్తద్వికారములైన శరీరములను ధరించి కర్మఫలము ననుభవించు నని శ్రుతి. స్వర్గమున జ్యోతిర్మయదేహము, వరుణ లోకమున జలమయ శరీరము. భూలోకమున పార్థివకాయము—మున్నగునవి ధరించుట యిచ్చట నెఱుంగ వలయును. తత్తన్మయ శరీరము అనగా, ఆ యా భూతములకు ప్రాధాన్యమ్మగల దేహములనియే కాని, ఇతర భూత సంబంధము లేనివని కాదు.

కూడ నశించునవే అని తెలియుచున్నది. ఈ శరీరములే కాక, ఈ దేహములతో అనుభవించెడు నానావిధ విషయోపభోగములును క్షణమాత్ర సత్తాకములై నశించిపోవునని యెఱింగియే యున్నాము. ఇంతయేల! మనము కంటితో దేనిని చూచుచున్నామో, అట్టి రూపముగల వస్తుజాల మంతయును నశించిపోవుట సిద్ధమను నంశము మన జీవితకాలముననే నిశ్చిత మగుచున్నది. ఒక్క చూడబడు పదార్థములే కాక, వినబడునట్టివి (శబ్దజాతము) ఆస్వాదింపబడునట్టివి, ఆఘ్రాణింపబడునట్టివి - ఈ విధముగా ఇంద్రియగోచరము లగుచున్న వన్నియు నశ్వరములే యగుచున్నవి. ఇంకను లోపల ప్రవేశించి చూచిన, మనస్సునందు సైతము ఈ క్షణమున పుట్టిన సంకల్పము వేఱొక క్షణములోనే మాయమగుచున్నది. ఇప్పటి యూహ, ఇప్పటి నిశ్చయము కాలాంతరమున రూపాంతర మందియో, లేక స్వరూపనాశనమే పొందియో తారుమారగుట మన అనుభవములోనే కనుచున్నారము. ఈ అవస్థలు ఈ లోకములోని వస్తువులకే కాక లోకాంతరములలోని పదార్థములకును సిద్ధమే.

దీనిబట్టి చూచిన ఏ యే వస్తువులు పుట్టుచున్నవో, అవి యెల్ల నశించుచున్నవని తెలియుచున్నది. అట్లే ఏది మరణించునో అదియెల్ల పుట్టుటయు నియత ధర్మమే. కావున ఈ చావుపుట్టుక లనెడి సహజ ధర్మములు సర్వపదార్థములకును ప్రకృతి నియతములై ఎవ్వనిచేతను తప్పింప వలని కాకుండుట విస్పష్టము. ఒక చావు పుట్టువులే కాక, నశించులోపల నానా విధావస్థలను పొందుచుండుటయు భౌతిక పదార్థములయందు కాంచగలము. నేడు పుట్టినది రేపటికి మాఱిపోవుచున్నది. మఱికొంతకాలమునకు ఇంకొక మార్పు, ఇంక కొంతకాలమునకు ఇంకొక మార్పు. ఈవిధముగా నశించులోపల వస్తువు పొందెడి ఈ మార్పులకు లెక్కలేదు. ఒక్క వివర్తనమును చూదురు. పుట్టుట-గిట్టుట లట్లుంచినను,

మధ్య-కొంతకాలము దానికి స్థితి, ఈ స్థితిలో కొన్నాళ్ళు చిన్నదిగా ఉండుట, క్రమముగా పెరుగుట, పెద్దదగుట, పూయుట, కాయుట, ఫలించుట, కోపుడుడుగుట, పాటవము తప్పుట, జీర్ణమగుట, మఱల కట్ట కడపటి పెద్ద యవస్థయగు వినాశమును పొందుట. కాని మనదృష్టిలో అది నశించినట్లున్నను దాని సర్వనాశనము జరుగుట లేదని సూక్ష్మ విచారణచే ఎఱుంగ గలము. ఇది అవాంతర విషయము.

బృహద్రూపమగు వృక్షము తన స్వరూపమును బీజములో నిక్షేపించి మఱి రూపఱుచున్నది. తిరిగి ఈ బీజము తనకు జనన కారణ మైన వృక్షము పొందిన అవస్థలనే పొంద నారంభించును. మఱల ఎప్పటి కార్యక్రమమే. దీనినే పిష్టపేషణ మనియు, చర్వితచర్వణ మనియు శాస్త్రములు వాకొన్నవి. విత్తనమును మాడ్చివేయువఱకును అది వికార ములను అందుచుండవలసినదే. దగ్ధబీజము మాత్రము మొలకెత్తజాలదు. సర్వనాశనమే దానికి శరణ్యము. విత్తనమును ఉదాహరణముగా గైకొని తెలిసికొన్న ఈ అర్థము బ్రహ్మాండములోని ఇంద్రియ గోచరములగు సర్వభౌతికపదార్థములకును తుల్యమే. ఇయ్యది శరీరాదుల పట్లను అను వర్తించుచునే యున్నది. శరీరమునకును పుట్టుక కలదు, నాశము కలదు, స్థితికాలమున బాల్య యౌవన వృద్ధత్వములు, కాపు వడుట కాపుడుడుగుట, జీర్ణమగుట-మున్నగు అవస్థలు స్వభావసిద్ధములే యగుట చూచుచునే యున్నాము.

ఇట్లు నానా వికారములకు లోనైనవి గనుకనే ఈ నశ్వర పదార్థ ములు నిర్వికారమగు నిత్యానందమున మానవుని ఓలలాడింప జాల కున్నవి. కాగా ఇక నిత్యమేది? శరీరము నిత్యము కాదు. ఇంద్రియ ములు నిత్యములు కావు. వాటికి గోచరములగు వస్తువులు కావు. ఈ సకల చరాచరాత్మక ప్రపంచములో కంటికి గోచరించు దృశ్యజాత

మంతయు-అంతే కాదు, ఇంద్రియ గోచరమగు పదార్థరాశియంతయు పలు మార్పులకు లోనయి నశించి పోవునట్టిదే. అయినను వీటియందు అంతర్లీనమై ఒక్క-వస్తువు నిత్యత్వ నిర్వికారిత్వములను ప్రకటించుచు వెలుగొందుటను అరయఁ గల్గుదుము.

అంతవంతములగు వస్తువులయందు అనంతమైయుండి, వాటి ఆద్యంతములను పరికించుచు, క్షరములగు వాటియందు అక్షరమై వెలయుచు, వాటి క్షరత్వమును ఎఱుంగుచు, సవికారముల యందు నిర్వికారమై పరగుచు, వాటి వికారములను గమనించుచు, చావుపుట్టు కలుగల వస్తుజాలమున అజరామరమై ప్రకాశించుచు, వాటి సంభవ వినాశములకు సాక్షీభూతమగుచు, ఖండములయందు అఖండమై, వివిధ భేదముల యందు భేదములేనిదై, జడములయందు చైతన్యమై దుఃఖస్పర్శలో అంతర్లీనమైన ఆనంద కణమై అలరారు నొక్క- వస్తువు లేకపోలేదు. అదియే - విషయములకంటెను, ఇంద్రియములకంటెను, దేహముల కంటెను, ప్రాణములకంటెను, అంతఃకరణమునకంటెను అవ్వలిదగు ఆత్మ. దీనినే 'నేను' అని పూర్వము తెలిసికొని యుంటిమి: జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడవస్థలయందును మార్పు లేనట్టి దీని చైతన్య ప్రకాశమును వడసి యుంటిమి. అట్లే త్రికాలములయందును సత్తామాత్రమగు ఇద్దాని ఉనికిని ఎఱింగి యుంటిమి. ఎల్లవేళల యందును ఆనందాత్మకమగు దీని సంపూర్ణ స్వరూపమును కాంచియుంటిమి. కావున నిత్య వస్తువు శరీరములోనే శరీరాతిరిక్తమై శరీరమును ప్రకాశింపజేసి ప్రేరేపించును భోక్తరూపమునను, మనశ్శరీర కృతములగు కర్మలకు అంటక వాటిని కాంచు సాక్షి రూపమునను అలరారుచున్నదనుట మనకు క్రొత్తది కాదు; పూర్వాధ్యాయ పరిచితమే।

ఇక నిరతిశయత్వము: సచ్చిదానందమగు ఆత్మనుమించి ఒండొక పదార్థము ఉన్నట్లు ప్రమాణముకాని, అనుభవము కాని లే మి చే ఇది సర్వాతిశాయి - నిరతిశయమునై తనరారు చున్నది. కావున దీనికి సంబంధించిన సుఖము నిత్యము, నిరతిశయము ఏల కాదు ? ఏ ఆత్మను కన్ను చూడలేదో, చెవి వినలేదో, ముక్కు వాసన చూడజాలదో, నాల్క ఆస్వాదింప జాలదో, చర్మము తాకలేదో, దేనినిగూర్చి కరచరణములు ఆదాన ప్రదానములను, గమనాగమనములను ఒనర్పలేవో, వాక్కు చెప్ప లేదో, మనస్సు భావింపలేదో, బుద్ధి నిశ్చయింపజాలదో, అట్టి అతీంద్రియ మైన - అవాఙ్మనస గోచరమైన - అతిబౌద్ధమైన ఆత్మయందే నిత్య నిరతిశయమగు పారమార్థికసుఖము పరిపూర్ణమై వెలయుచున్నది. అట్టి మహా సుఖస్వరూపమే ఆత్మ. ఇట్టి ఆత్మను, ఆత్మానందస్వరూపమును ఎవడు దేనితో చూచును ? దేనితో వినును ? దేనితో ఆఘ్రాణించును ? దేనితో చెప్పును ? దేనితో భావించును ? దేనితో అనుభవించును ? కాబట్టి ఆత్మసుఖము ననుభవించుటకు ఏ సాధనములును పనికిరావు. సాధనములకు అది చిక్కునదియు కాదు. సాధనాంతర నిరపేక్షమైన స్వతంత్ర సుఖ మిదియే. దీనిని ఆత్ముడు (జీవుడు) ఆత్మయందే-ఆత్మచేతనే అనుభవింప వలయును. అనగా తాను తనతోడనే తన యందే అనుభవించెడు నిత్య నిరతిశయ సంతృప్తి యిది. జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము, ధ్యాత, ధ్యేయము, ధ్యానము-ఇక్కడ ఏకీభవించు చున్నవి. త్రిపుటికి సంబంధించిన భేదభావము చేయుటకు ఇక్కడ వీలులేదు. ఇచ్చట సర్వము ఆత్మస్వరూపమే । ''యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూ త్త త్కేన కం పశ్యేత్, కేన కం విజానీయాత్'' అను పరమార్థస్థితి యిదియే ॥

కావుననే కాళిదాసు పరమేశ్వరుని పరమసమాధిని వర్ణించుచుండిన, కుమారసంభవములో 'ఆత్మాన మాత్మ న్యవలోకయన్తం' అని వచించి

వాడు. అక్కడ 'ఆత్మని' అనెడి ఆత్మ శబ్దమునకు హృదయము కూడ అర్థము కావచ్చును. ఆత్మ ప్రతిబింబమును గ్రహించుటకు హృదయమే తగినది కావున, దానియందు తొలుత ఆత్మోపలబ్ధిని చెప్పుట అసంగతము కాదు. ఇంతమాత్రముచేత ఆత్మకు హృదయము ఆధారమని పొరపాటు పడరాదు. అద్దములో సూర్యుని చూచుచున్నను, సత్యముగ సూర్యునకు అద్దము ఆధారము కాదుగదా? హృదయము ఆత్మోపలబ్ధికి స్థానము కనుక, దాని యందలి చిదాత్మ ప్రతిబింబమును పరమాత్మతో ఐక్యసంధానము ఒనర్చు దివ్యయోగమే ఈ పరమసమాధి యనుట రహస్యము.

ఈ ఆత్మతేజము ప్రజ్వరిల్లు తఱికి మనోబుద్ధ్యహంకారములు, వాటియొక్క నానావిధ వికారములు ఏ మూలకో ఒదిగి పడియుండును. ఆత్మ అపరోక్షము (దర్శనము) కాక మాటుపడి ఉన్నంతవఱకే వాటి కోలాహలము; స్వాతంత్ర్యము. ఆత్మసింహము గర్జించునప్పటికి అంతర్వికారములనెడి గజములు గుహలలో దూరుకొనవలసినదే.

ఇంతవఱకు నిరూపించిన గ్రంథముచేత నే నను వానికి ఒక నిత్య నిరతిశయ సుఖము కావలయు ననియు, అట్టిది నిరతిశయమగు ఆత్మ యందే కలదనియు నిర్ధరింపబడినది. ఈ యర్థమున ఉపనిషత్తుల అంగీకారమును కూడ భావించి చూతము.

"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మంతవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రే
య్యా త్మని ఖల్వరే దృష్టే శ్రుతే
మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్."

— బృహదారణ్యకోపనిషత్తు. 4. 5. 6.

ఓ మైత్రేయీ! ఆత్మయే చూడతగినది, వినదగినది, భావింప దగినది, అనుభవింప దగినది. కారణమేమన? ఆత్మను చూచినను, విన్నను, తలపోసినను, అనుభవించినను - తెలిసికొన్నను ఈ సర్వమును తెలియ గలదు. ఈ మంత్రమునందు ఆత్మదర్శనము, దానికి సాధనము లగు శ్రవణ మనన నిధిధ్యాసములు చెప్పబడినవి.

మానవునిలో నున్న అజ్ఞానము అసంతృప్తికి కారణ మనియు, సర్వప్రపంచము యొక్కయే కాక, సర్వముయొక్క కూడ పరమజ్ఞాన సంసిద్ధి కలిగినగాని జనునికి పరమశాంతియు, పరమ సంతృప్తియు కలుగదనియు ప్రథమాధ్యాయమున చదివి యుంటిమి. మానవుని జీవిత కాల మంతటిని వ్యయించినను, లేక కొన్ని జన్మములెత్తి పదార్థవిజ్ఞానము నకు కృషి సల్పినను, అతడు జ్ఞేయవస్తువుల జ్ఞాన విషయమున కడపటి హద్దునుచేర జాలడనుట నిక్కపము. ఒకవేళ-బాహ్యమును, భౌతికమును అగు వస్తుజ్ఞానమున కృతకృత్యుడు కాగల్గినను, వానికి ఆత్మశాంతి, ఆత్మ తృప్తి అనునవి బాహ్యజ్ఞానముచే చేకూర జాలవు. అటైన జీవితమునకు సాఫల్య మనునదే లేకపోవలసి వచ్చును. కావున ఇందుకై ఒక సూక్ష్మో పాయము-సర్వజ్ఞాన సంసిద్ధిని చేకూర్చునట్టిది వెదుక దగినదై యున్నది. అట్టి పరమసూక్ష్మోపాయమే ఆత్మదర్శనమని మనుష్యుని గాఢ విచారముచే కల్గిన నిశ్చయమును, శ్రుతిసూత్రములును చెప్పుచున్నవి. దీనినే ఏక పదార్థ జ్ఞానముచేత సర్వపదార్థ జ్ఞానమును పొందుట అనియు, కారణ జ్ఞానముచే కార్యస్వరూపమును తెలిసికొనుట అనియు చెప్పుదురు.

శౌనకుడు ఒక బ్రహ్మజ్ఞుడగు అంగిరస్సుని యొద్దకు పోయి, 'గురువర్యా, ఏ వస్తువు యొక్క జ్ఞానము కలుగుటచే సర్వపదార్థముల జ్ఞానము కల్గునో అట్టి సుసూక్ష్మమగు జ్ఞాన విద్యను నాకుపదేశించవే'

యనవుడు, ఆ బ్రహ్మవిద్వర్యుడు ఆత్మతత్త్వ విద్యను ఉపదేశముచేసి శిష్యుని అఖండజ్ఞానిగా నొనర్చినాడని ఉపనిషత్తులలో కథమనెరుగగలము. ప్రతి మానవుడును అట్టి సూక్ష్మోపాయమును ఆశ్రయింపకున్న సముద్రము వలె అపారములైన వేదశాస్త్రాదులను ఎన్నాళ్ళభ్యసించి విశ్వ వస్తు పరిజ్ఞానమువ కృతకృత్యుడు కాగలడు? కావుననే పూర్వము చెప్పిన ఋషిచంద్రముడు పరము - అపరము - అని విద్యలను రెండు తెఱగులుగా విభజించి, ఋగ్వేదాది బహుళ వాఙ్మయ ప్రపంచమును త్రిగుణములకు విషయమగు దానిని అపరవిద్య యనియు, తద్భిన్నమును, గుణాతీతస్థితికి సోపాన ప్రాయమును, అక్షరవస్తు ప్రకాశకమును అగు ఆత్మవిద్య (బ్రహ్మవిద్య)ను పర మనియు నిర్దేశించి చెప్పియున్నారు.

ఇప్పట్టున, ''చెట్టును చూచినచో పుట్ట మొదలగు అన్ని వస్తువులను చూచినట్లే వాటి వాటి జ్ఞానము మానవునకు కలుగునన్నట్లు, ఆత్మను చూచుట, వినుట, తలచుట యేమి? తద్భిన్నములగు ఏవో పదార్థముల అన్నింటి జ్ఞానమును కలుగు టేమి? ఇది అనుభవ విరుద్ధము కాదా" అని సందేహము రావచ్చును. కాని ఇది అవిచారమూలకము. ఒక్క మంటి ముద్దను చూచుటచే ఎట్లు మంటికంతటికిని సంబంధించిన జ్ఞానమే కాక, ఆ మట్టితో చేయబడిన కుండ, చట్టి, మూకుడు, ప్రమిద మున్నగు వాటి జ్ఞానముకూడ కలుగుచున్నదో, ఒక్క బంగారమును చూచుటచేత దానితో చేయబడి తద్వికారములై నానారూపములతో ఒప్పెడి కంకణ, మురుగులు, గొలుసులు, గాజులు, ఒడ్డాణము మొదలగు భూషణముల అన్నింటి జ్ఞానమును ఎట్లు కలుగుచున్నదో, అట్లే ఆత్మవస్తుజ్ఞానము కలిగినచో, అది కారణముగా జనించిన నామరూపాత్మకమగు ప్రపంచముయొక్క జ్ఞానమును, అందలి సర్వవస్తువుల జ్ఞానమును కలుగుటలు వింతకాదు. సచ్చిదానంద లక్షణమగు ఆత్మ స్వరూప జ్ఞానమునకును, తద్విపరీత

లక్షణములుగల (అనగా అనృత జడ దుఃఖరూపములగు) నానావస్తువుల జ్ఞానమునకును సంబంధమే లేదే అన్నచో, వస్తువు నాశ్రయించిన నామరూపాంశలను విడిచినయెడల ఇక శేషించి యుండునది-సదంశ, చిదంశ, ఆనందాంశమే. ఈ మూడంశములును ఆత్మాంశములే కావున బాహ్యములను భేదములకు హేతువులైన స్థూలములగు నామరూపాంశలు నిరంతరము మాఱునవియు, నశించునవియు నశించునవియునై అస్థిరత్వమునే ప్రకటించుచున్నవి. కావున సర్వమును పరమార్థదృష్టియందు ఆత్మపదార్థమునకు భిన్నము కానేరదు. అట్లుకాక, సర్వమును ఆత్మభిన్నముగా తలంచుట మానవుని ప్రమాదము, మోహము, అజ్ఞానమేకాని వస్తుగత యాథార్థ్యము వేఱు.

ఈ లక్షణములు పూర్వము చెప్పికొన్న మట్టిదృష్టాంతమునందును కలవు. కుండ మొదలగువవి విశిష్ట నామరూపములను పొందిన వస్తువిశేషములు. నామరూపములను ఆశ్రయించి చూచిన వీటియందలి వివరీత భేదములకు లెక్కయుండదు. ఈ నా నా భేదములకు కారణములగు నామరూపములను తొలగించి చూచినచో ఇక మిగులునది మట్టియే కదా! ఈ స్థితిలో భేదము నశింపగా వస్తుస్థితి, మట్టికున్న లక్షణములే మిగులుచున్నవి. మృద్వికారములైన కుండ మున్నగువాటి రూపములు శాశ్వతములు కావు; అవి ఎప్పుడో ఒకతూరి భంగము నంది తీరును. వానితో కూడ నామములును నశించి వ్యవహారమున మట్టి మాత్రమే మిగులును. కావున నామ రూపాంశలు నశ్వరములనియు, అంశత్రయము (సచ్చిదానంద ములు) యొక్క లీలావిలాసములు మాత్రమే ఇవి అనుటయు ఎఱుంగదగిన రహస్యము. కావున, "నే" నను వానికి ఆత్మయే ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మంతవ్యము. దానియందే నిరతిశయ నిత్య సుఖమును సాధకుడు జూఱుకొన గలడు.

పైని వివరించిన మంత్రవాక్యములో ఆత్మ ద్రష్టవ్య మనియు, శ్రోతవ్యమనియు, మంతవ్యమనియు, చెప్పబడి యుండుటచే దానిని చూచుటకును, వినుటకును, భావించుటకును-కన్ను, చెవి, మనస్సు అను ఇంద్రియములు కావలయును గదా! అప్పుడాత్మ ఇంద్రియగోచరమే కాని అతీంద్రియ మెట్లని ఒక లఘుశంక రావచ్చును. ఇది నిజమేకాని, పై మంత్రమునకు రెండర్థములు చెప్పుకొనవచ్చును. ఒక పక్షమున ఇంద్రియములు అవసరములు; వేఱొక పక్షమున ఇంద్రియములు అనవసరములు. సాధకుడగువాడు ఆత్మనుగూర్చిన శ్రవణ మనన నిదిధ్యాసములు చేయవలెనని చెప్పుకొన్నచో, గురువులు చెప్పు ఆత్మతత్త్వమును ఆలించుటకు చెవులు కావలయును. దానిని భావించుటకు మనస్సు కావలయును. దానిని ధ్యానించుటకు బుద్ధికావలయును. ఈ ప్రణాళిక పూర్తి అయిన పిమ్మట కల్గు అపరోక్షానుభూతి (దర్శనము) లో కన్ను, చెవి మున్నగు బాహ్యాంతరింద్రియములు నిరపేక్షములు. అప్పు డాత్మదర్శన, శ్రవణ, మననములను చేయునవి మనకు వెలుపల కన్పట్టుచు వ్యవహారములోనున్న ఈ కన్ను, చెవి, మనస్సులు కావు.

"శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో, యద్ వాచోహ
వాచంగ్, స ఉ ప్రాణస్య ప్రాణ, శ్చక్షుషశ్చక్షుః...."

— కేనోపనిషత్తు. 1. 2.

చెవులకెల్ల చెవియగు ఆత్మకర్ణముతోనే దానిని ఆలకించుట. మనస్సులకెల్ల మనస్సగు ఆత్మయను మనస్సుతోనే దానిని తలంచుట. ప్రాణములకెల్ల ప్రాణమును, వాక్కులకెల్ల వాక్కును, కన్నులకెల్ల కన్నును అగు ఆత్మనేత్రముతోడనే వీక్షించుట, ఆత్మవచనముతోడనే నిర్వచించుట. ఇక్కడ కార్యకరణ సంఘాతాత్మకమగు త్రిపుటి లేదనియు, దర్శన మాత్రమే యనియు మున్నే చెప్పబడినది.

"న తత్ర చక్షు ర్గచ్ఛతి, న వా గ్గచ్ఛతి, నో మనః
న విద్మో, న విజానీమో, యథై తదనుశిష్యాత్.
అన్యదేవ త ద్విదితా దథో అవిదితా దధి"

— కేనోపనిషత్తు. 1.3

ఏ ఆత్మస్థానమును చొచ్చుకొని కన్ను పోవలేదో, ఎక్కడ మాటలు మునలవో, తుదకు మనస్సుకూడ దేనిని సమీపింపజాలదో, ఏది జ్ఞానాజ్ఞానములు (ఎఱుక మఱుపుల) కంటె విలక్షణమో, అట్టి అమేయ వస్తువును తోలుకంటితో చూడబోవుట, చూతుననుట, అర్థరహితములైన వాగ్జాలముతో నిర్వచింప బోవుట, వాచ్యమొనర్తుననుట, బహు వికల్ప ములకు నెలవగు మనస్సుతో తలంపబోవుట, తలంచుట-హాస్యాస్పదమును అజ్ఞాన విలసితమునే కాని వేఱు కాదు.

కావున ఆత్మదర్శన, శ్రవణ, మనన, ధ్యానములకంటె చేయ దగినది వేఱొక్కటి లేదు. ఆత్మదూరమగు ఇతరకృషి అంతయు వృథా శ్రమ మాత్రమే. శరీరేంద్రియ కరణ జాతముతో బుద్ధిమంతుడు ఎద్దాని నొనర్చినను అది ఆత్మావలోకన కుపకరింపనిచో అట్టిదెల్ల వ్యర్థమను అంశమును బృహదారణ్యక శ్రుతి ఇట్లు తెలుపుచున్నది.

"....ఏకధైవానుద్రష్టవ్య మేత దప్రమయం ధ్రువం
విరజః పర ఆకాశా దజ ఆత్మా మహాన్ ధ్రువః."

"త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః
నానుధ్యాయా ద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్."

— బృహదారణ్యకోపనిషత్తు. 4.4.20, 21

అప్రమేయమును, ధ్రువమును, ధర్మాధర్మాది మల రహితమును, సూక్ష్మమగు ఆకాశమువలెనె వర్తమును, జన్మ లేనిదియు, మహత్తును, అవినాశియునగు ఈ ఆత్మను భేద దృష్టి వీడి విజ్ఞాన ఘనైకరస దృష్టితో అనుభవింపవలయును.

బుద్ధిని వశీకరించుకొన్న ధీరుడు ఈ ఆత్మనే గురూప దేశ ప్రకారము పరోక్షముగా ఎఱింగి, దాని అపరోక్షము ఖాతికై సన్న్యాస శ్రవణ మనన నిధిధ్యాసరూపమైన ప్రజ్ఞను చూపవలయును. ఆత్మేతరములగు పలుశాస్త్రములందు కృషి యొనర్చుట వ్యర్థము. అది యంతయు వాక్కునకు శ్రమ నిచ్చునే.

# ఆత్మదర్శన ప్రయోజనము

"తరతి శోక మాత్మ విత్."

"ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే
విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి."

— బృహదారణ్యకోపనిషత్తు. 4.5.6.

ఆత్మవేత్త దుఃఖము నతిక్రమించును. ఆత్మను గూర్చి విని, తెలిసికొని, తద్దర్శనమును పొందినచో తక్కిన దంతయు తెలియగలదు.

ఇంతవఱకు ఆత్మదర్శన మొనర్చుకొనుట పురుషుని కర్తవ్య మనియు, అద్దానిచేత నిరతిశయతృప్తి కలిగి, ఇంక కోరవలసిన కోర్కులు కడముట్టగా, పరమజ్ఞాన సంసిద్ధియు, తత్కారణమయిన శాంతియు చేకూరునని సూత్రప్రాయముగా తెలిసికొని యుంటిమి. ఈ అధ్యాయమున ఆత్మదర్శనముచే కలుగు ప్రయోజనమును, తదభావముచే కల్గు అనర్థమును కూడ ఇంచుక విపులముగ విచారింతము. ఏల యన ? ఒక కార్యము యొక్క ప్రయోజనము తెలిసినగాని దానియందు మానవునికి ప్రవృత్తి కలుగదు కావున, ప్రరోచనార్థముగ నైనను ఫలజిజ్ఞాస ముఖ్యమగు చున్నది. అట్లే ఆత్మ సాక్షాత్కారము చేసికొనమిచే కలిగెడు అనర్థము కూడ తెలిసిన, తదనర్థ నివృత్తికై నను మానవుడు తన కర్తవ్యమున అప్రమత్తుడు కాక తప్పదు. మఱియు ఉపక్రమములో చెప్పినట్లు ప్రపంచపారావారమున పడి ఒడ్డు కానక ఊగులాడు మానవుని దురవస్థ

లన్నియు నివృత్తి యగుటయు ఇష్టము కావున, ప్రకృతమున తత్ప్రయోజన విచారము అత్యావశ్యకమగుచున్నది.

"ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః
కి మిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్ ॥"

— బృహదారణ్యకోపనిషత్తు. 4. 4. 12.

మానవుడు ప్రపంచములో భార్యా పుత్త్ర మిత్ర భృత్యాదుల యందును, గృహారామ క్షేత్రములయందును 'ఇది నాది, నేను వీనివాడను' అను మమకారమును అహంకారమును చూపుచున్నాడు. తనది అనుకొన్న దెల్ల సర్వాధికముగా ఉండవలయునను కోరిక బలవత్తర మగుటచేత, దానియొక్క అతిశయమునకై నిరంతరము కృషి సల్పుట, ఆ ప్రయత్నములో ఎనలేని భంగపాట్లు, అవమానములు పొందుట, ఇష్టములు ప్రాప్తింపకుండుటచే దుఃఖము, అనిష్టప్రాప్తిచే ద్వేషము కలుగుచుండ, వాటికి వశుడై పోయి పలువిధములగు బన్నములు కుడుచుట నరునికి స్వభావసిద్ధ మైనది. కర్మక్షేత్రమున నాతడనుభవించు ఈ కష్టము లన్నియు శరీరాభిమానమును పురస్కరించుకొనియే కాని, వేఱొకవిధమున కలుగుట లేదు. ఈ విధముగ ఆతని వాంఛలను కట్టు వలలై నిరంతరము అల్లిబిల్లిగ నల్లుకొన్నవై అందు ఆతనిని బంధించుచున్నవి. మానవుడు తాను కాని శరీరమును తన్నుగా భావించి, దాని పుష్టి తుష్టులకై ప్రయత్నించుటచేత బద్ధుడై, జనన మరణప్రవాహమున కొట్టుకొని పోవుగతికి వశుడై పోయినాడు. కాలుసేతులుకట్టి యేటిపెంటలో పారవేయ బడినవాడు ఆ బంధములు తెగనంత వఱకు ఈదజాలక అట్లే ఉక్కిరి బిక్కిరగు నట్లు మూసియు శరీరకారణమున కలిగిన బంధములను వదలించుకొన జాలనివఱకును సంసార ప్రవాహము నుండి బయట పడజాలడు. ఈ అవస్థలు అన్నియు దేహాభిమాన కార్యములే కాని యథార్థములు కావు.

అంతఃకరణ పరిచ్ఛిన్నుడై కర్తృత్వ భోక్తృత్వములను నెఱపుచు, సుఖదుఃఖములయందు అభిమానమును వూని వర్తించు జీవునకు, సచ్చిదానంద లక్షణమును; కర్తృత్వభోక్తృత్వములు లేనిదియు, శుద్ధ బుద్ధ ముక్తస్వభావమును అగు సాక్షిరూప స్వయంప్రకాశ కూటస్థాత్మయే నే నను జ్ఞానము కలిగినచో, అనగా అంతఃకరణోపాధి గతములగు వికారములకు తాను అంటనివాడనియు, ఆ ఉపాధియందు ప్రతిబింబించి తద్గత వికారములను తనవిగా భావించుటచేతనే తనకు బంధము కల్గినదనియు, వస్తుతః తాను అద్వితీయ శుద్ధచైతన్య మాత్రుడనియు జ్ఞానము కల్గినచో, వాని కార్యప్రణాళిక ఆత్మస్వరూప స్వభావముల ననుసరించియే ఏర్పడు ననియు మనవి చేయబడినది. అప్పు డతడు దేహమును అప్రధానమగు సాధనముగ మాత్రమే యెంచి తత్సంబంధముచే పొటమ్ల సుఖదుఃఖములకు దూరుడగుటకు యత్నించును. యత్నమన నేల? యథార్థమున దూరుడే అయి ప్రకాశించును. ఆత్మ బంధరహితమును, అనశ్వరమును అగుటచే అతని కృత్యములును బంధరహితములై శాశ్వతరూపమున వెల యుచు నిరతిశయము లయియే ప్రవర్తించును. అట్టి అతడు శరీరసంబంధములగు వేటిని కోరజాలడు. ఏ ఆత్మవస్తువు నుద్దేశించి తన జీవిత యాత్ర సాగుచున్నదో, దానియందే తన పరమప్రీతిని జూపుచు ఇతర కామములను దూరీకరించుకొనుచుండును. లోకదృష్టిలో అట్టి యాతని విషయమున ప్రవర్తించు సుఖదుఃఖములుగాని, మంచి చెడుగులుగాని ప్రారబ్ధము ననుసరించి ప్రవర్తించునవే కాని అతని కర్తృత్వముచేత కలుగునవి కావు.

''ఇది నా కుటుంబము, దీనిని సుసంపన్నము చేయవలయును; లోకములో నా భార్యను, పుత్రి మిత్రాదులను మించిన ఆతిశయము ఎవ్వనికి ఉండకూడదు. అందులకై నా జీవిత సర్వస్వమును వెచ్చిం

చుటే నా ధర్మము. ఈ శరీరము నాది; నన్ను మించి, నా విద్యావైభవములను, ధైర్యస్థైర్య శౌర్యములను మించినవాడు ఎవ్వడు ఉండరాదు. నేనే సర్వోన్నతుడనై నెగ్గడ వలయును; అందుకు ఎన్ని కష్టములనైనను ఓర్చి పాటుపడుటే యుక్తము." ఈ విధములైన ఇచ్ఛాప్రయత్నములు, తత్సాధన విధానములో కలుగు కలహ విద్వేషములు ఆత్మవేత్త పక్షమున ప్రవర్తింప నేరవు. అతడు జగద్రూపమైన సర్వమునకంటె భిన్నుడు, ఆత్మరూపమగు సర్వమునకంటె అభిన్నుడు అగుటచేత ప్రకృతి గుణవశమున జరుగు వాటిపట్ల ద్వేషమునుగాని, జరుగనివానిపట్ల కాంక్షను గాని చూపక నిత్యతృప్తుడై ఔదాసీన్యము (ఉపేక్ష) నే ప్రకటించు చుండును. ఎవడు ఆత్మయందే ఎల్లప్పుడు ఆసక్తుడో, ఆత్మయందే సంతృప్తి వహించినవాడో, ఆత్మయందే నిత్య సంతుష్టుడో, అట్టివాడు ఆత్మాతిరిక్తమగు దేనిని కోరడు, ద్వేషింపడు; శరీరేంద్రియ కరణ సంఘాతముతో చేయదగినది అతని కుండదు. ప్రారబ్ధవశమున సంతప్తమగుచున్న శరీర త్రితయమునుగూర్చి తపించు అవస్థ వానికిలేదు. ఆగామి కర్మమన్న, వానికి కోరవలసినదే లేమిచేత ఏర్పడుటకే అవకాశము లేదు. ఇక అతడు నడపెడు జగద్భోగము ప్రారబ్ధాధీన మగుట లీలామాత్రమే. అందుకే ఆత్మజ్ఞాని చర్యలను గూర్చి ఉపనిషత్తు "ధ్యాయతీవ లేలాయతీవ" అతడు ఆ యా పనులను చేయువానివలె కొనబడుట నమచున్నది. అనగా యథార్థదృష్టిలో చేయక యే చేయుచున్నట్లగపడుచున్నాడని భావము కదా! ఆత్మజ్ఞాని దేహాభిమానమును వీడి నిస్సంగుడై ప్రారబ్ధ భోగముకొఱకో, లోకసంగ్రహముకొఱకో వ్యావహారిక కార్యముల నొనర్చుచున్నాడు గావున, అవ్వాని ఫలాఫలములుగాని, బంధములుగాని వానికి అంటజాలవు. అతడు ఆ యా కర్మల నొనర్చుచుండియు యథార్థమున కేమియు ఒనర్పని నిష్క్రియుడు; నిస్సంగుడు. దీనినే కర్మమునందు అకర్మను కాంచుట యని గీత చెప్పెను. కావుననే పై శ్రుతి వాక్యము

''పరిశుద్ధాత్మస్వరూపుడనే నేనని యెఱింగిన పూరుషుడు (జీవుడు) దేనిని కోరి, ఎవనియొక్క కామ సంతర్పణమునకై నిరంతరము తప్తమగు శరీరముతో కూడ తానును తపించును?'' అనుచున్నది. సారాంశమేమన: అహంకార మమకారములు సంసారహేతువులై దుఃఖప్రదము లగుచున్నవి. అహంకార మమకారములను వీడుట మోక్షహేతువై ఒప్పుచున్నది. అందుకే ఈ దిగువ వాక్యము బంధమోక్షములను సూత్రప్రాయముగా వక్కాణించుచున్నది. ''మమేతి బధ్యతే జన్తు, ర్న మ మే తి విముచ్యతే'' అని.

''అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం
తథాఽరసం నిత్య మగంధవచ్చ తత్
అనా ద్యనన్తం మహతః పరం ధ్రువం
నిచాయ్య తం మృత్యుముఖా ప్రముచ్యతే.''

కఠవల్లి. 1. 3. 15.

నరునకు ప్రపంచములో భయంకరమైనది మృత్యువు. ప్రాణాంతి క్రూరములగు ఏ జంతుజాలమునకును, అగ్ని వాయు జలములకును కూడ వెఱవక, పైపెచ్చు వానిని వశము చేసికొని, వానిచేత దాస్యము చేయించుకొను బుద్ధిబలము ధైర్య స్థైర్యములు గల మానవుడుకూడ చావన్నంత దిగులొందును. దానినుండి తప్పించుకొను నుపాయమేదా యని విచారణకు పూనుకొనును. కాని మృత్యువు వచ్చి తలవాకిట కూర్చుండినప్పుడు పరిహారోపాయము నాలోచించిన ఏమి లాభము? తనకు కలుగనున్న అనర్థమునకు ముందే తన్నివారణోపాయమును ఆలోచించుకొనుట బుద్ధిమంతుని లక్షణముగాని, అనర్థము ఆసన్నమయి కంఠగతమయినప్పుడు చేయునదేమి? మానవునిలోని ఈ దూరదృష్టి లేమియే వాక్యము

మంతియు తత్త్వజ్ఞానము నార్జింపవలయునను ప్రయత్నమునకు అతవిని దూరము చేసినది. మీదుమిక్కిలి యెవ్వడేని బుద్ధిశాలి చిన్నప్పటి నుండియు తత్త్వచింతన మొనర్చుచున్నచో ఇంటిలోని తలనెరసిన పిల్లలు (వయోవృద్ధులు) "వేదాంత మిప్పుడే యెందుకు? ఇంకను చాల కాల మున్నదిలే" అని తెలివితక్కువ పలుకులు పలికి అతవిని విరుత్సాహ పఱచుటయు మనకు ఆచారమై పోయినది. దీనినిబట్టి ఏ ముసలితనము నందో, ఇంద్రియపాటవము నశించిన పిమ్మట, ప్రాపంచిక భోగముల నన్నింటిని కుడిచిన యావల, ఓపికలేనప్పుడు వేదాంతము ఆశ్రయింప దగినదని వారి భావము కాబోలు. ఇట్టి అభిప్రాయముతోడనే నేటి యువక జీవితము ఘోర భయానక భావములకును, ఆచారములకును పుట్టి నిల్లై స్వదేశ-పరదేశ ద్రోహకారకములగు చేతలకును పాల్పడుచున్నది. కావుననే కాళిదాసుడు తత్త్వవిద్య నయితము బ్రహ్మచర్యాశ్రమము నందే – అనగా బాల్యమునందే అభ్యసింపవలయునని రఘువంశములో రాఘవరాజుల శీలవర్ణన నెపమున చెప్పియున్నాడు. "శైశవేఽభ్యస్త విద్యానాం" అనిన అతని వాక్యములోని విద్యలలో పరాపర విద్యలు రెండును కలవు. విద్యాశబ్దమును అక్కడ సామాన్యవాచకముగ వాడినను, వ్యాఖ్యాతలు కొందఱు దానికి చతుర్దశ విద్యలనియో అష్టాదశ విద్య లనియో వ్యాఖ్యానము చేసినను, సత్యజీవితము యొక్క శాంతికి అవశ్యక మగు పరవిద్యను అది చెప్పుటలేదని యేతాత్వికుడును దలపడు. కాళిదాసుని హృదయముకూడ ఇదియే. తేకున్న వార్ధకమున జరుపబోవు మునివృత్తియు, అంత్యకాలమున తను త్యాగముసేయ నుపయోగించు యోగ విద్యయు పునాదిలేనివై నిరాలంబనములే యగును. కావున ఈపర విద్య బ్రహ్మచర్యమువనే అభ్యసనీయము. అందుచేత మృత్యుస్థితిని, మృత్యుస్వభావమును, తవతు రామన్న మరణ దుఃఖమును, తప్పినాద

ణోపాయమును మున్ముందుగనే-తొలి వయస్సునందే విచారించుకొనుట మంచిదనుటయే యీ విస్తరమునకు కారణము.

"దేనియందు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనెడి ఇంద్రియగుణములు ఉండవో, దేనికి ఆదియు అంతమును లేదో, ఏది మహత్తునకును పరమై నిత్యమై ధ్రువమై మనునో, అట్టిదానిని ఎఱుంగుటచే మానవుడు మృత్యుముఖము నుండి బయట బడగలడు" ని పై మంత్రము నుడువుచున్నది. ఈ మంత్రము బ్రహ్మపర మైనదైనను, బ్రహాత్మలకు ఐక్యము తరువాత చెప్పబడనుండుటచే ఇచ్చట ఉదాహరించుట విరోధము కాదని యెఱుంగునది.

యథార్థమునకు చచ్చున దేది? నిత్యమైనదానికి చావు లేదు. అనిత్యమునకు చావు తప్పదు. అసత్తునకెప్పుడును ఉనికి ఉండదు. సత్తునకు అభావ ముండదు. కావున చచ్చునది నశ్వరమగు దేహమేకాని, తద్విరిక్తమైన ఆత్మ కాదు. ఆత్మ చచ్చునదికాని, లేక చంపునదికాని, చంపబడునది గాని తలంచువాడు ఏమియు ఎఱుంగని వాడే. కావుననే ఇట్టి ఆత్మ యాథార్థ్యము నెఱింగినవాడు మృత్యుముఖమునుండి విడివడునని పై శ్రుతి చెప్పుచున్నది. తా ననువాడు దేహాదులు కాక ఆత్మ యగుట చేతను, ఆత్మ నిత్యమగుట చేతను, దేహమునకు కలుగు మరణము ఈ ఆత్మకు - ఆత్మజ్ఞునకు లేనట్లే కదా! మఱియు మరణము లేని ఈతడు మర్త్యస్వభావము గల దేహముయొక్క మరణ లీలను పరికించు సాక్షియై ప్రకాశింప గలడు. కావున జరామరణ రోగములు శరీరమునకే కాని శరీరికి లేవు. ఆత్ముడు దేహధర్మములను తనయందు ఆరోపించుకొని దుఃఖమగ్నుడగుచున్నాడు. ఆత్మదర్శనముచే దేహధ్యాస తొలగిపోవ జరా మరణ రోగములు లేని నిత్య నిర్వికారామృతమూర్తి అగుచున్నాడీ దేహి.

'అశరీరం శరీరేషు, అనవస్థే ష్వవస్థితం,
మహాన్తం విభు మాత్మానం మత్వా ధీరో న శోచతి.''
— కఠవల్లి. 1.2.22.

''అనిత్యములైన నానా శరీరములందుండియు శరీరములు లేనిదై నిత్యమై సర్వవ్యాపకమై సరగెడు ఆత్మనే తన్నుగా భావించి అపరోక్షానుభూతిని బడసిన ధీరుడు దుఃఖము లేనివాడై యొప్పును.''

''యథైవ బింబం మృదయోపలిప్తం
తేజోమయం భ్రాజతే తత్సుధాతం
తదాత్మ తత్త్వం ప్రసమీక్ష్య దేహీ
ఏకః కృతార్థో భవతే వీతశోకః.''
— శ్వేతాశ్వతరోపనిషత్తు. 2.14

బంగారు, వెండి మొదలగువాని ముద్ద ఎట్లు తనపై మాలిన్యము ఆవరించి యుండుటచేత సహజముగా ప్రకాశింపదో, లేదా సూర్య చంద్రుల బింబములు మేఘావరణాది మాలిన్యములచేత తమ సహజ ప్రకాశమును వెలుగొంద జాలవో. ఆ మాలిన్యములు తొలగింపబడిన పిమ్మట సహజ తేజముతో ప్రకాశించునో. అట్లే పంచకోశము లనెడి మాలిన్యములచే అచ్ఛాదింపబడిన పవిత్రాత్మ తత్త్వము కూడ అని దేహి యెఱింగి, కోశాతీతుడై ఒక్కడై, బ్రహ్మమై మోక్ష పురుషార్థము నంది కృతార్థుడగును. ఇక అతనికి ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతికము లనెడి మూడు విధముల శోకములు ఉండవు.

ఈ విధముగా ఆత్మజ్ఞుడు శోకమోహములను, మృత్యువును దాటి ఏకరూపుడై ఆనందరూపమగు అమృతస్థితిని పడయగలడు.

"ఏతద్ జ్ఞేయం నిత్యమే వాత్మసంస్థం,
నాతః పరం వేదితవ్యం హి కించిత్."

— శ్వేతాశ్వతరోపనిషత్తు. 1.12

సర్వభూత హృదయాంతస్స్థితమును నిత్యమును అగు ఆత్మతత్త్వమును మించి తెలియదగిన దేదియు లేదు. ఎద్దాని నెఱింగిన సర్వమును ఎఱింగినట్లగునో, అట్టిదానిని వీడి యెఱుంగదగినది ఏది యుండును? కావుననే ఈ విజ్ఞానముచేత -

"తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా
ఆనందరూప మమృతం య ద్విభాతి."

— ముండకోపనిషత్తు. 2. 2. 7

ధీరులగువారు ఆనందరూపము, అమృతమునై తనరారు తత్త్వమును కాంచుచున్నారని ముండకశ్రుతి చెప్పుచున్నది. అనగా తత్తత్త్వరూపులయియే ప్రకాశింతురని భావము.

"ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా నేష బ్రహ్మవిదాం వరిష్ఠః"
— ముండకం. 3. 1. 4.

ఆత్మక్రీడ, ఆత్మరమణము అనెడి కర్మలు మాత్రమే గల ఈతడు బ్రహ్మవేత్తలలో నెల్ల శ్రేష్ఠతముడు. ఇంకను ఆత్మజ్ఞుని విభూతిని ఛాందోగ్యము ఈ రీతిని నొడువుచున్నది.

"అథాత ఆత్మాదేశ ఏవాత్మైవాధస్తా దాత్మోపరిష్టా దాత్మా పశ్చా దాత్మా పురస్తా దాత్మా దక్షిణత ఆత్మోత్తరత ఆత్మైవేదం సర్వ మితి. స వా ఏష ఏవం పశ్య న్నేవం మన్వాన ఏవం విజాన న్నాత్మరతి

రాత్మక్రీడ ఆత్మమిథున ఆత్మానన్దః. స స్వరాడ్భవతి. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి. అథ యేఽన్యథాఽతో విదు రన్యరాజాన స్తే క్షయ్యలోకా భవన్తి. తేషాం సర్వేషు లోకే ష్వ కామచారో భవతి.'' (7 - 25)

"అహంకార వశవర్తులగు అజ్ఞానులచే దేహాదిసంఘాతము ఆత్మ యని తలంప బడుచుండుటచే ఇచ్చట పరిశుద్ధ మగు సదాత్మ ఇట్లాదేశింప బడుచున్నది. ''ఈ ఆత్మ అన్ని దిక్కుల యందును అంతటను కలదు. ఈ కనబడు జగమంతయు ఆత్మయే. జగమును ఈ ఆత్మదృష్టిచే చూచుచు, తలచుచు, అనుభవించుచు ఉండు యోగి ఆత్మరమణము, ఆ త్మ క్రీ డ, ఆత్మానందము కలవాడై ఒప్పును. అతడు స్వయంప్రకాశుడగు స్వరాట్ట గును. అతనికి ప్రాణము మొదలగు సర్వ లోకములందును అధికారము సిద్ధించును. అనగా లోకాలోకములం దన్నింటను అతడు కోరినరీతి విహ రింప గలడని ఆత్మజ్ఞాని విభూతి ఇక్కడ చెప్పబడినది. ఎవరీ విధముగ ఈ యాత్మను ఎ ఱు ం గ జా ల రో వారు అస్వతంత్రులై, అన్యుల అధికారమునకు లోబడి ప్రవర్తింపవలసినవా రగుదురు. వారు పొందు అ యా లోకములు నశించునవి కాగలవు. వా రి కి సర్వలోకములందు సంచరించు ఆధిపత్యము ఉండదు.''

''తస్మా దాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతికామః."

— ముండకం. 3. 1. 10.

ఆత్మజ్ఞాని మహత్త్వము ఇట్టిదగుటచే తనే ఐశ్వర్య (ఈశ్వర భావము) కాముడగువారు ఆతని నర్చింపవలయునని వానికి సర్వారాధ్య భావమును వేదాంతము చూపుచున్నది.

మానవుడు ఆత్మదర్శనముచే ఎట్లు అఖండప్రయోజనమును పొంది జీవితసాఫల్యము నందునో, అట్లే ఆత్మసాక్షాత్కారమును పడయకున్న యెడల మహానర్థము పాలయి దుఃఖరూప సంసార చక్రమున తిరుగు చుండును. ఈ అంశమును ఉపనిషత్తులు బహుధా వక్కాణించు చున్నవి.

"అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః
తాం స్తే ప్రేత్యాభి గచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః."
— ఈశోపనిషత్తు, 3.

ఈ విధమైన ఆత్మతత్త్వమును గుర్తెఱుంగక దేహాదులే తానను కొనుచు ప్రపంచ వ్యవహారములయందు అహంకారముతో సంచరించు మూఢాత్ములు కొందఱుందురు. అట్టివారు దేహాత్మబుద్ధిగలవారై ఆత్మ విషయిక యాథార్థ్యమును ఎఱుంగకపోవుటచేత "నేను చచ్చుచున్నాను, పుట్టుచున్నాను, పెరుగుచున్నాను, భోగించుచున్నాను" అనుచు నానాకర్మములకు బద్ధులైపోయి ప్రాపంచిక విషయభోగములే పరమార్థము లనుకొని, వానిని పెంపొందించుకొనుటలోనే నిమగ్నులయి సంచరించుటచేత ఆత్మఘాతకు లగుచున్నారు. యథార్థమునకు ఆత్మ చచ్చునట్టిది కాదు కావున, వీరు అట్టి ఆత్మను చంపునట్టివారు కాకపోయినను, తమ స్వరూపమే అగు ఆత్మను మఱచిపోయి దేహాధ్యాసలో పడిపోయినారు కావున అవిద్యావంతులగుటచే ఆత్మఘాతుకు లనుట తప్పు కాదు.

మదిరాపాన మత్తుడై తన శరీరమును పరశరీరమును ఎఱుంగక దానికి హాని చేసికొను మూర్ఖుని క్రియ ఈతని స్థితియు ఉండుటచేత వీనిని ఆత్మద్రోహి యనియు, ఆత్మఘ్నుడనియు అంటిమి. తన్ను తానే మఱచి పోయిన అధమునికి ఎట్టిదుర్గతులు పట్టునో ! ఇట్టి యాతడు చీకటితో సమానమగు అజ్ఞానముచే ఆవరింపబడిన అసురలోకము లందు పుట్టుచు చచ్చుచు తిరుగాడుచుండును. ఆత్మవేత్త దృష్టి ననుసరించి చూచిన

స్వర్గాది దేవలోకములను పునర్జన్మను కలిగించునట్టివి కావున, అసుర లోకములలోనే లెక్కయగును. ఆత్మ దర్శనము లభింపకపోవుటచేతనే, ఆత్మజ్ఞానము కలుగక పోవుటచేతనే శరీరమునుగూర్చి ఏర్పడిన బ్రాహ్మణత్వాదులను సాధనములుగా చేసికొని పురుషుడు యజ్ఞాదుల నొనర్చుటయు, తత్ఫలితముగా స్వర్గాది భోగములను అనుభవించుటయు సంభవించుచున్నది. ఆత్మయే తా ననుకొన్న, బ్రాహ్మణత్వాది యజ్ఞక్రియాయోగ్యములైన లక్షణములకే తాను అతీతుడగుటచేత, చేయవలసినదియు, పొందవలసినదియు ఉండనే ఉండదు. కావుననే ఆత్మజ్ఞానాభావముచేత లభించు లోకములు ఎంతటి దివ్యభోగములచే విలసితములైనను తమోమయములవియు, ఆసురములవియు ఈ ఉపనిషత్తు వక్కాణించుచున్నది.

ఆత్మ దర్శనాభావముచేత సంసారనివృత్తి కాకుండుటయు, జీవుడు నిరంతరము జనన మరణముల పాలయి జ్ఞాన కర్మముల తారతమ్యములచే వాటికి తగినవగు పలువిధముల యోనులందు సంచరించుటయు తప్పనిదగుచున్నది. జ్ఞానసాధనకు ఉపయుక్తమగు ఈ మనుష్య జన్మము మాఱి ఇంకొక పుట్టువు సంభవించినచో ప్రాణికి జ్ఞాన సంపాదన యోగ్యతయు దూరమగును. మన కన్నులకు కనబడు పలువిధములైన జీవజంతు సంతానములందు ఒక్క మానవ ప్రాణి మాత్రమే జ్ఞానవిశిష్టదయి ఉండుట తథ్యము. సర్వప్రాణి ధర్మములగు ఆహార నిద్రా భయ మైథునములే కాక, మానవ ప్రాణిలో జ్ఞానమను విశేషమొక్కటి ఉండి ఇతర ప్రాణులకన్న ఈతనిని వేఱు చేయుచున్న దనుటయు నిక్కము. బహుజన్మ దుర్లభమయిన ఈ మానవశరీరమును పొందియు ఆ శరీర [illegible] నాశ [illegible]పోకమునుపే సంసార సముద్రమును దాటకుండుట

మూర్ఖత్వము కాదా? ఈ నావ పగిలిపోయినచో, ఈతూరి అతనికి చిక్కినది ఏ తక్కువ రకము పడవయో ఎవ్వడు ఎఱుంగును? కావుననే శ్రుతి-

"ఇహ చే దవేదీ దథ సత్య మ స్తి
న చే దిహ వేదీ న్మహతీ వినష్టిః."

— కేనోపనిషత్తు. 2.5.

''ఈ శరీరము వశింపక పూర్వమే నిత్యమగు ఆత్మతత్త్వమును ఎఱింగిన బ్రతికిపోదువు; లేకున్న గొప్ప నష్టము నందగలవోయి సాధకుడా'' అని సంసారసముద్రమున పయనించు నావికుని (జీవుని) హెచ్చరించుచున్నది. ఆత్మ నెఱుంగని దోసముచే కల్గెడి అనర్థములు మొట్టమొదటిదగు ఉపక్రమాధ్యాయము లోనే యభివర్ణింప బడినవి. ఇంకను అచ్చటచ్చట ప్రస్తావవశమున పలుసారులు చెప్పబడినది. దానినే ఇట అనుసరించిన ఆత్మదర్శనావశ్యకత సుబోధము కాగలదు. మఱియు ఆత్మపదార్థము సర్వవ్యాపక మయినను దాని ఉపలబ్ధి మాత్రము శరీరము నందే కలుగుచున్నది. ఆత్మ సచ్చిదానంద సుందరమనెడి అంశమును మనము తొలుత శరీరమునందు దాని ఉపలబ్ధిని పొందియే నిర్ణయించుకొని యున్నాము. నిజహృదయాపచ్ఛిన్న చైతన్యప్రకాశమును బట్టి దానికి కారణమైన నిర్వికారకూటస్థాత్మను తెలిసికొంటిమి. ఇంకను తరువాతి అధ్యాయములందును నిర్ణయింపబోవు బ్రహ్మాత్మైక్యావగతిని సూటియగు ఈ బాటయందే పయనించి కాంచ గల్గుదుము. స్థూల శరీరము విచ్ఛిన్న మయినచో, జీవునికి వెలుపలి సాధనమ్మగు రథము లేమిచే పరమాత్మోపలబ్ధి దుర్లభమగును. అందుకే పై శ్రుతి ఈ శరీరమునందే ఆత్మసాక్షాత్కారమును పొందవలయునని మేల్కొలుపు చున్నది.

—:o:—

# సర్వాత్మభావము

"యత్ర త్వస్య సర్వ మాత్మై వా భూత్.
తత్కేన కం పశ్యేత్ ; కేన కం విజానీయాత్ ?"

— బృహ - 4.5.15.

ఏ స్థితియందు సాధకునికి తనతోకూడ సర్వము ఆత్మస్వరూపమే అగునో, అప్పుడు ఆతడు దేనిచేత దేనిని చూచును ? దేనిని ఎఱుంగును ? అనగా ద్వైతభావములేని స్థితిలో-ద్రష్ట, దృశ్యము నశించునని తాత్పర్యము.

ఇంతవఱకు ఆత్మదర్శన ప్రయోజనమును తెలిసికొంటిమి. తద భావమున కలుగు అవస్థలను కూడ ఎఱింగితిమి. కాని ఆత్మస్వభావ పరిమాణాదుల విషయమున ఎఱుంగవలసిన సందియములు కొన్ని కలవు. వాటిని ఈ అధ్యాయమున తీర్చికొందము.

ఆత్మపదార్థము అణుపరిమాణమా, మధ్యమ పరిమాణమా, లేక మహత్పరిమాణమా ? అణువే అగుచో ఇంతటి శరీరమును, జగత్తును ప్రకాశింప చేయగలదా ? లేక మహత్తను కొన్నచో, అంతటి మహావస్తువు శరీరములో ఎట్లు పట్టగలదు ? లేక శరీరమాత్ర పరిమాణమే ఆత్మ అను కొన్నను బాల్యాద్యవస్థల ననుసరించి ఆత్మ పెరుగవలసియు, తఱుగ వలసియు ఉండును. అంతియేకాక సూక్ష్మాతి సూక్ష్మ జీవులయందును చైతన్య ప్రకాశము కానవచ్చుచుండుటచేత వాటియందును ఆత్మ ఉండ

వలయును. కావున ఆ యా జీవుల యందలి ఆత్మ గొప్ప కొద్ది లనెడి తారతమ్యముచే ఒప్పవలసి యుండును. దీపమువలె ఆత్మ నిత్యమే అయ్యు ఉపాధులనుబట్టి పెరుగుచు తఱుగుచు ఉన్నట్లు తోచుచున్నది కాన ఇది యుక్తము కాదు. పెరుగుట తఱుగుటలనెడి అవస్థలు భౌతిక వస్తుధర్మ ములు. ఎప్పుడు ఒక పదార్థము పెరుగునో, మఱి తఱుగుచుండునో అట్టి దానికి చావు పుట్టుకలనెడి వికారములును వెన్నంటియే యుండును. ఇంతను ఆత్మ ఒక్కటే అనుటయు ఒప్పిదముగ లేదు. ఒక్క ఆత్మ ఇన్ని దేహములలో ఉండుట సంభవించునా? ఇంద్రజాల విద్యను ఎఱింగిన వాడయ్యును, ఒక్కడే మనుష్యుడు పెక్కు తావుల ఒక్కసారిగ ఉండుట సంభవింపదు కదా? అట్లు ఉన్నను వాని స్వరూప స్వభావాదుల యందు భేదము కల్గుటెట్లు? ప్రపంచములో ఒక జాతికి చెందిన మానవులలోనే జ్ఞానము మున్నగు వాటియందు పలుభేదము లుండుట చూచుచున్నాము కదా! ఈ విధమునైన సందేహములు కొన్ని తీరినగాని, ఆత్మతత్త్వము గాఢముగ తెలిసినట్లుకాదు.

ఇంతవఱకును నిరూపించిన ఆత్మస్వరూపలక్షణము చక్కగా అర్థమయినచో, ఈ సందేహములకు అవకాశమే లేదు. అయినను ఇంకొకసారి సవిస్తరముగ సందియములను తీర్చుకొనుట మంచిదే. ఆత్మ అణుపరిమాణముకాని, మధ్యమ పరిమాణముకాని, మహత్పరిమాణము కాని కాదు. అది అణువునకంటె అణువు, మహత్తునకంటె మహత్తు. ప్రపంచములో దేనిని అణువనియు, కంటితో చూడనలవిగాని పరమాణువనియు మనము వాకొనుచున్నామో, అట్టి సూక్ష్మాణువు కూడ యంత్ర సహాయమున నేత్రగోచరమగును. కాని విభజించుటకు వీలుగానంత సూక్ష్మమగు అణువనునది ఆత్మ అన్నప్పుడు ఆ సూక్ష్మ వస్తువు కంటితో చూచుటకును, చిట్టచివరకు మనస్సుతో భావించుటకు కూడ అలవికాని దనియే

తాత్పర్యము కాని, పరిమాణములో అది చిన్నదని కాదు. అణు సూక్ష్మ శబ్దములు ఆత్మవిషయకముగా ఎక్కడ ప్రయోగింపబడినను వానికి ఇంద్రియాగోచరత్వము, దుర్విజ్ఞేయత్వము నే అర్థములుకాని, చిన్నదని ఎంతమాత్రమును కాదు. 'ఏషోఽణు రాత్మా చేతసా వేదితవ్యః' ఇత్యాది స్థలములందును బాహ్యేంద్రియములకు ఎట్లును అది అగోచరమే కావున, అంతరింద్రియమైన సూక్ష్మమగు మనస్సుచేతనైనను ఆ సూక్ష్మతమ వస్తువును భావింపుమనియే తాత్పర్యము. ఇట్టి సుసూక్ష్మమగు ఆత్మ సచ్చిదానంద స్వరూపమనియు ఎఱింగి యుంటిమి. సత్తుగాని, చిత్తుగాని, ఆనందముకాని ఇంద్రియగోచరములు కావనుట సత్యమే కదా! సత్తును స్థూలరూపములో తప్ప సూక్ష్మదశలో ఇంద్రియముల చేతను కనుగొనలేము. మఱియు ఆత్మ అణు పరిమాణమే అగుచో, అది లేని తావున ఇంకొక పదార్థమేదో ఉండవలయును. కాని ఆత్మతక్క ఇతరము లేదనుటయు, ఆత్మ సర్వపరిపూర్ణమైన వస్తువనుటయు సిద్ధవాదము. సర్వత్ర నిండి వెలుగొంద వలసిన వస్తువు మితము లేనంత గొప్పదై తనరార వలయును కదా!

శరీరమాత్ర పరిమాణమే ఆత్మ అనుకొన్నను కొన్ని దోషములు తప్పవు. శరీరముయొక్క వృద్ధి క్షీణతలను బట్టి ఆత్మయు పెరుగుచు తఱుగుచు ఉండవలయుననుట ఒకటి. యోగులగువారు పరకాయప్రవేశాదు లొనర్చునప్పుడైన వారి ఆత్మ ఏనుగు మొదలగు బృహజ్జంతువులలో ప్రవేశించునప్పుడు మానవశరీర పరిమితమగు ఈ ఆత్మ ఏనుగు శరీరమును ఎట్లాక్రమించి దానిని వెలిగింప గలుగును? అట్లే చీమ మున్నగు చిన్నజంతువుల క్షుద్ర కళేబరములలో దూరుటకును ఈ ఆత్మ పెద్దదైపోవును కదా! ఇది రెండవ దోషము. అణుపరిమాణవాదులలో కొందఱు ఆత్మ అణుస్వరూపమైనను ఇంటిలోని దీపము ఒక్కచోటనుండి సూక్ష్మ

మయ్యు గృహములోని వస్తువుల నెల్ల ప్రకాశింప జేయునట్లు, దేహేంద్రియవర్గమును ఈ ఆత్మయు ప్రకాశింపజేయు నని వాదించుచున్నారు. అట్లైనను దేహము లేనితావున ఆత్మ శూన్యమే కదా? కావున ఈ వాదము లన్నియు అజ్ఞానవిలసితములు. ఆత్మకు సంబంధించిన బృహద్వాదమే, అనంతవాదమే సత్యమును ప్రకటింప గల్గును.

ప్రపంచములో భూమి, దానికన్న జలము, దానికన్న అగ్ని, దానికన్న వాయువు, దానికన్న ఆకాశము - మహత్పదార్థములని అనవచ్చును. ఆకాశమును మించిన పదార్థము మన దృష్టిలో లేదు. సర్వమహద్వస్తువగు ఏ ఆకాశమును మనము గొప్పదని చెప్పుచున్నామో, అట్టి ఆకాశమునకును అవకాశమును ఇచ్చుచు దానికి కూడ కారణమై ఒప్పునంత మహాపదార్థమే ఆత్మ. ఇంతయేల? ఆకాశాది భూతజాలములతో కూడుకొన్న ఏ ప్రపంచము మనకు తోచుచున్నదో, అట్టి ప్రపంచమంతయు కల్పింపబడుటకు, నిలబడుటకు ఆధారభూతమైనంత గొప్పదే ఈ ఆత్మ. ఇప్పుడు ఆత్మ మహత్తునకంటె మహత్తనుట దోషము కాదుకదా? కావుననే -

"బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం
సూక్ష్మాచ్చ త త్సూక్ష్మతరం విభాతి
దూరా త్సుదూరే తదిహా న్తికే చ
పశ్య త్స్విహైవ నిహితం గుహాయామ్."

— ముండకం. 3. 1. 7.

"అది కొలతల కలవికానంత బృహత్పదార్థము; దివ్యము. మనస్సుచేత చింతింప నలవికాని రూపము కలది. అతి సూక్ష్మముకన్న సూక్ష్మతరము. దుర్విజ్ఞేయము. అది (అజ్ఞానులకు) దూరమునకన్న దూరమునను, (జ్ఞానులకు) సమీపములోను ఉన్నట్టిదై హృదయగుహాలోని తన

ఉపనిచే మానవునకు సాక్షాత్కరించుచున్న" దని ఆత్మమహిమను, దాని అణు మహత్త్వల తత్త్వమును ముండకశ్రుతి వక్కాణించుచున్నది.

"అణో రణీయా న్మహతో మహీయాన్
ఆత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయామ్."
— కఠవల్లి. 1. 2. 20.

అన్న శ్రుతియు ఈ ఆత్మయే సర్వభూతముల హృదయ గుహ లందు నిహితమై ఉన్నదని చెప్పుచున్నది. ఈ గుహను గూర్చియు, దాని యందలి ఆత్మను ఉపలబ్ధినందుటను గూర్చియు తరువాత తెలిసికొందుము. ఇంకను ఆత్మయొక్క అణుత్వ మహత్త్వములను గూర్చి ఛాందోగ్యము ఈ క్రింది రీతిని వక్కాణించుచున్నది.

'ఏష మ ఆత్మాఽ న్తర్హృదయేఽ ణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపాద్వా శ్యామాకాద్వాశ్యామాకతండు లాద్వా ఏష మ ఆత్మాఽ న్తర్హృదయే జ్యాయాన్ పృథివ్యా జ్యాయా న న్తరిక్షాత్ జ్యాయా న్దివో జ్యాయా నేతేభ్యో లోకేభ్యః.' — 3. 14. 3.

ఈ నా ఆత్మ హృదయమధ్యమున వడ్లగింజకంటెను, యవధాన్యముకంటెను, ఆవగింజకంటెను, చామబియ్యమున కంటెను అణుతరమైనది. ఇట్లనుటచే ఆత్మకు అణుపరిమాణము ప్రసక్తమైనదని దాని మహత్త్వరూపమును శ్రుతి వెనువెంటనే నిరూపించుచున్నది. హృదయమునందలి యీ ఆత్మ భూమికంటెను, ఆకాశమునకంటెను, దివము కంటెను, ఈ సమస్తలోకములకంటెను మహత్తరమైనది.

ప్రపంచములో రెండుపదార్థములు మాత్రమే తోచుచున్నవి. అందొకటి చైతన్యము, రెండవది జడము. జడపదార్థమునకు వ్యయం

ప్రకాశకత్వము లేకుండుటయు, చైతన్యప్రకాశముచేతనే అది తేజరిల్లు టయు నానా ప్రాణులను కాంచి మనము అనుభవములోనికి తెచ్చుకొను చున్నాము. శరీరము జడమనియు దానిని ప్రకాశింపజేయుచు కర్మసమర్థ మొనర్చు ఆత్మ చైతన్యస్వరూప మనియు తెలిసికొనియున్నాము. జగత్తునందలి పదార్థములలోని నానాభేదములు, పృథక్త్వములును జడము లకు సంబంధించినవేకాని చైతన్యసంబంధులు కావు. చైతన్యము ఏక స్వరూపమను విషయమును, జాగ్రత్స్వప్నసుషుప్తులయందలి చైతన్య స్వరూపమును నిరూపించి పూర్వమే తెలిసికొంటిమి. ఇక అట్టితటి ఆత్మ పరిమితమనుకొన్నచో, అది లేని తావున ఉండవలసినది జడము కావలసి వచ్చును. కాని మొద్దు వంటిదగు ఆకాశపర్యంతమును గల జడపదార్థ మును ప్రకాశింపజేయుటకు ఒక వస్తువు తద్విలక్షణమైనది కావలయును. ప్రకాశింపజేసెడు దీపిక లేకున్న, చీకటిలో మనము ఏ వస్తువును చూడ లేము కదా? కావున అది ఆకాశమను జ్ఞానము దాని వెనుక కూడ చైతన్యముండి దానిని ప్రకాశింప జేసిననేగాని మనకు కలుగుటకు వీలు లేదు. అట్లు కానిచో జడమునకు స్వయంప్రకాశకత్వము లేమిచే అది తెలియబడకయే ఉండవలసి వచ్చుచున్నది. దీనినిబట్టి ఆకాశమును మించి కూడ చైతన్య స్వరూపమగు ఆత్మయే ప్రకాశించుచున్నదని యెఱుంగ వలయును. జడములయందును, చేతనముల యందును, లోపలను, వెలుప లను సర్వపరిపూర్ణమై నిండియుండినది ఆత్మయే కాని, దానిని మించి వేఱొక్కటియు లేదు. ఆకాశాది భూతజాతము పుట్టకపూర్వము - నక్షత్ర తారాగ్రహరాశులతో కూడిన బ్రహ్మాండసృష్టి జరుగకమున్ను - భూమి, అందలి ఓషధులు, రసాదులు, జీవులు ఉదయింపక పూర్వము వీటి నన్నిం టిని తన అనంత గర్భములో బీజము తనయందు మహావృక్షమును ఇముడ్చుకొన్నట్లు ఇముడ్చుకొని ప్రకాశించినది కేవలమగు అఖండాత్మయే. ఆత్మేతరమగు పదార్థము అప్పు డేదియు లేదు.

"ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్,
నాన్య త్కించన మిషత్.
స ఈక్షత, లోకాన్ను సృజా ఇతి."

— ఐతరేయోపనిషత్తు.1.1.

పై శ్రుతిప్రకారము సత్తు, చిత్తు, ఆనందము అనెడి అంశత్రయముతో తేజరిల్లెడు ఆ ఆత్మనుండియే నామము, రూపము అను అంశములచే వెలుగొందు జగము పుట్టినది.

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః.
ఆకాశా ద్వాయుః. వాయో రగ్నిః. అగ్నే రాపః.
అద్భ్యః పృథివీ. పృథివ్యా ఓషధయః.
ఓషధీభ్యోఽన్నం. అన్నా త్పురుషః."

— తైత్తిరీయ బ్రహ్మానందవల్లి. 1.

ఆకాశమువలె సర్వవ్యాపక స్వభావముగల ఆ యాత్మ నుండి సన్నిహితమగు వ్యాప్తి స్వభావము కలిగి శబ్దగుణముతో ఒప్పెడి ఆకాశము ఉదయించినది. దానినుండి స్పర్శగుణ విశిష్టమగు వాయువు, దానినుండి రూపగుణము గల అగ్ని, దానినుండి రసగుణముగల జలము, దానినుండి గంధగుణముగల భూమి, దానినుండి వృక్షదోషధులు, వాటి నుండి అన్నము, దానినుండి పురుషుడు. ఈ ప్రకారముగా నామరూపాత్మకమై దృశ్యమానమగు జగత్తుయొక్క లీల కెల్ల ఆ ఆత్మవస్తువే పరమకారణ మగుట గమనింప వలయును. పై శ్రుతి వాక్యములో స్థూల సూక్ష్మ సృష్టులు రెండును అంతర్భూతములై యున్నవి. విపులముగా వాటి తత్త్వార్థమును ఇచ్చట వివరింప వీలుకాదు.

ఈ విధమగు అత్మ నామరూపాత్మకమగు జగమును సృజించి మరల ఆ జగమందే అంతఃప్రవిష్టమై విశ్వలీలను నడపుచున్నది. అనగా చైతన్యము యొక్క స్థూలధాతువు జడము (జగము). ఆ జడము లోపల చైతన్యము. 'తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్'. ఒక్క లోపలనే కాదు. వెలుపలను, ముందు వెనుకలను, సర్వదిక్కులను, అంతటను ఇదియే. 'అంత, ర్బహిశ్చ త త్సర్వం వ్యాప్య, ఉన్నది ఈ అత్మతత్త్వమే. 'బహి రంతశ్చ భూతానా మచరం చర మేవ చ, సూక్ష్మత్వా త్తదవి జ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్' అన్న గీతావాక్యముకూడ ఈ అర్థమునే ప్రతిపాదించుచున్నది.

సృష్టికి పూర్వము ఏకమాత్రమై కేవలజ్ఞానశక్తియై వరగు దీనియందు బహువిధ ప్రకాశేచ్ఛ జనించి క్రియోన్ముఖమగుడు ప్రపంచ స్వరూపము తేజరిల్లినది. జ్ఞానేచ్ఛా క్రియాశక్తులయొక్క మహానటనమే ప్రపంచ తాండవము. ఈ క్రియాశక్తిని చూచి తత్కారణేచ్ఛ కలుగుటయు, అది జ్ఞానశక్తి ప్రకాశ కారణమగుటయు జగత్స్వభావము. ఈ జ్ఞానశక్తియే తొల్లింటి అత్మ స్వరూపము. ఇది అఖండాద్వితీయానిర్వచనీయ దివ్య మహాశక్తి. దీనిని 'ఇద మిత్థ' మని వేదములు చెప్పలేక వెనుకంజ వేసినవి.

''ఇట్లన నేల ? అత్మలు పెక్కు లున్నవనియు, అవి అణువులే అనియు, అట్లయ్యును సూర్యుడు మున్నగు గ్రహములు తమ తమ తావులనుండి తేజోవిశేషముచేత విశాల జగమును ప్రకాశింప జేయునట్లు, అత్మలును దేహాదులను వెలుగజేయు నను మాట ఒప్పిదముకాదా" అని పూర్వపక్షి శంకింప వచ్చును. కాని ఇది యుక్తియుక్తమును, అనుభవ సిద్ధమును, శ్రుతి పాఠమును కాదు. పెక్కు శ్రుతులు అత్మైక్యమునే

బోధించుచున్నవి. గట్టిగా చెప్పవలయు నన్న సత్తామాత్రమగు ఆత్మ తక్క, ఇతర మేమియు పారమార్థికముగ లేదనియే అద్వైతుల సిద్ధాంతము.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవా ద్వితీయమ్."

— ఛాన్దోగ్యోపనిషత్తు. 6.2.1

ఇది అను పదముచే చెప్పబడు ఈ ప్రపంచమంతయు మొట్టమొదట సన్మాత్రమై ఏకమై పరగుచున్నది. అప్పుడు ద్వితీయ వస్తువు లేనే లేదు. ఈ ద్వైతమంతయు మాయాపరికల్పితము. ఎట్లన ? ఆత్మ సత్తని చెప్పి కొంటిమి. ఈ సత్తులో అంతర్భేదము లేవియు లేవనియు, అట్లుండుటకే వీలు లేదనియు కూడ ఆత్మ స్వరూప విచారణములో తేల్చి యుంటిమి, కావున ఆత్మకు శరీరాదులకువలె అవయవములు లేమిచేత స్వగతభేదములు లేవు. ఇక సజాతీయ భేదమన్నచో, సత్తును పోలినది ఇంకొక సత్తు ఉండుట కదా ? అట్లుండుటకు వీలు లేదు. మీరన్నట్లు ఆత్మలు పెక్కులు కావున సత్తును బోలిన ఇంకొక సత్తు ఉండకూడదా యన్న అట్లు తలంచుట పొరపాటు. సత్తును పోలిన ఇంకొక సత్తు ఉన్నచో, అది దీనికంటె అధికమో, హీనమో, సమమో అయి ఉండవలయును. హీనమైన అట్టిదానితో ప్రయోజనము లేదు. సమమైనను సమకాంతిగల రెండు దీపములలో వ్యత్యాసము లేనట్లు అదియు నిరర్థకమే యగును. అధికమన్నచో ఆ యధికమైన దానిని మించిన అధిక్యముగలది ఇంకొకటి, దానిని మించినది ఇంకొకటి ఈ విధముగా పెరిగిపోవు అనవస్థా దోషము పట్టును. కావున సజాతీయ భేదముండుటయు సద్విషయమున యుక్తమై యుండలేదు. ఇక విజాతీయ భేదము: సత్తునకు విపరీతలక్షణము గలది అసత్తు కావలయును. అసత్తనగా లేమియే అది యెల్ల రెఱింగినదే కదా ;

అట్టి లేమి ఉండుననుట ఎట్లు పొసగును? కావున ఆత్మ ఎప్పుడు స త్తం టమో తద్భిన్నమగు అసత్తునకు ఉనికియే లేదుకావున, ఆత్మ వ్యతిరిక్త మయి, జడము ప్రపంచము అని పేర్కొనబడెడి జగత్తునకు ఉనికియే లేదు. లేకపోగా ఈ ఆత్మయే శేషించుచున్నది. జగమనునది మాయాపరి కల్పితము. మాయ లేనిది కావున, ఈ జగమును వంధ్యాపుత్రునివలె తోబుట్టువు.

ఈ విధముగ యుక్తులనుబట్టి చూచినను 'సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్' 'ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్ నాన్య త్కించన మిషత్' - ఇత్యాది శ్రుతివాక్యములను బట్టి చూచినను, జాగ్ర త్స్వప్న సుషుప్తి సమాధు లనెడి నాల్గవస్థల యందలి అనుభవమునుబట్టి చూచినను, ఆత్మ ఒక్కటి మాత్రమే మిగిలి ప్రకాశించుచున్నదనియు, ఆ నిత్యవస్తువు నందు జ గ ము భ్రాంతివశమున తోచుచున్నదేకాని సత్యము కాదనియు రుజువగుచున్నది. త్రికాలాబాధ్యము సత్యమనియు, ఒకప్పు డుండి ఒకప్పుడు లేక కాలముచే బాధింపబడునది అసత్యము, అనిత్య మనియు పూర్వము చెప్పబడినది. ఆకాశాది భూతకార్యములగు స్థూల సూక్ష్మ శరీరములును, ఆ ఆకాశాది భూతములకు కారణమగు కారణశరీరమును, క్రమముగా స్వప్నమునందును, సుషుప్తియందును, సమాధియందును నశించుచున్నవి. కావున అవి లేనివే; అనిత్యములే. ఈ అవస్థలు అన్నింటియందును ఆత్మచైతన్యము ఏకరూపముగ ప్రకాశించు చున్నది. కావున అది సత్యము; ఎల్లప్పుడు ఉండునదియే. అది తప్ప ఇంకొకటి ఉండుటకు అవకాశమే లేదని ఇతఃపూర్వమే సిద్ధాంతమైనది.

అట్లయిన ఈ ప్రపంచము ఎట్లు తోచుచున్నది? ఇందు నానాజీవు లలో ఒక్కటే ఆత్మ ఎట్లు నివసించెను? ఆ యా జీవుల బుద్ధివిశేషము లందును, క్రియావిశేషములందును తారతమ్యము ఎట్లు కలుగుచున్నది?

అని సందేహము. యథార్థమునకు ప్రపంచము లేనిదే. అయినను ఏ అజ్ఞానము కారణముగ జగత్తు తోచుచున్నదో, అదియే మాయ యనియు, ప్రకృతి యనియు చెప్పబడుచున్నది. అది సత్వ రజ స్తమములనెడి త్రిగుణములతో కూడుకొన్నదై ఆత్మచైతన్యమును తనలో ప్రతిబింబింప జేసికొని ఆత్మశక్తియై జగన్నాటకమును ప్రవర్తింప జేయుచున్నది. ప్రకృతిలోని రజస్తమో గుణములు విక్షేపావరణ స్వరూపము లగుటచేత వాటియందు ఆత్మ చైతన్యముందియు ప్రతిబింబించుట లేదు. ఇక సత్వము శుద్ధమనియు, అశుద్ధమనియు ఇరుతెఱంగుల అలరారుచు పర మాత్మ చైతన్యమును ప్రతిఫలింప జేసికొను నైర్మల్యము కలదై యొప్పు చున్నది. శుద్ధసత్వప్రధానమైన ప్రకృతి మాయ యనియు, మలినసత్వ ప్రధానమైన ప్రకృతి అవిద్యయనియు చెప్పబడును. అందు మాయాప్రతి బింబము ఈశ్వరుడు. అవిద్యా ప్రతిబింబము జీవుడు. ఈశ్వరుడు మాయకు వశుడుకాక, ఆ మాయనే వశమొనర్చుకొని సర్వజ్ఞత్వ సర్వే, శ్వరత్వాది గుణములు కలిగి, జగత్సృష్టి స్థితి ప్రళయముల జరుపు చుండును. ఇక జీవుడు అవిద్యకు వశుడై పోయి మలినసత్వప్రధాన ప్రకృతి యొక్క కార్యములయిన వివిధోపాధులయందు ప్రతిబింబించి, ఒక్కడే అయ్యును దేవ తిర్య ఙ్మనరాది శరీర భేదములచే అనేకముగా భాసిల్లుచు, కించిజ్ఞత్వాది గుణములు కలిగి దేహాధ్యాసతో సంసారచక్ర మున పరిభ్రమించు చుండును. ఏకమగు ఆత్మకు జీవేశ్వరభేదము మాయ చేతనే కలిగినది కాని, వేఱు కాదని ఇచ్చట నెఱుంగ దగిన రహస్యము. ఇక ఈ జీవుని భోగముకొఱకై మాయాప్రతిబింబితు డగు ఈశ్వరుని సత్య సంకల్పముచేత తమః ప్రధానమగు ప్రకృతినుండి ఆకాశాది భూత పంచకమును తత్కార్యములైన స్థూల సూక్ష్మదేహములతో కూడిన బ్రహ్మాండ భాండమును ఏర్పడుచున్నది. కావుననే స్థూల సూక్ష్మభేదము లతో ఒప్పు ఈ ప్రపంచమంతయు భూతభౌతికరూపముగా చెప్ప

కొంటిమి. ఇప్పుడు వలసినంత నానాత్వము, భేదము సిద్ధమైనది. ఇది అంతయు త్రిగుణాత్మకమగుటచే కారణగుణములు కార్యమునందు సంక్రమించుననెడి న్యాయముచేత భూత భౌతికపదార్థములన్నియు త్రిగుణములచే విడివడక తద్గుణ విశిష్టములై నానాభేదములను ప్రకటించు చున్నవి.

జీవభోగ్యమైన జగత్తునుబట్టి జీవులలో తారతమ్యము ఉన్నట్లు పొడగట్టు చున్నదే కాని, యథార్థమునకు జీవుడు ఒక్కడే; భేదరహితుడే, ఈ అంశమునే శ్రీ వీరబ్రహ్మగురుడు "జీవుడొక్కడె దేవుడొక్కడె భావ మెఱిగితె శిష్యుడా!" అని చాటినాడు. ఒక్క సూర్యుడే పెక్కు నీటి కుండలయందు ప్రతిఫలించునట్లు, ఒక్క చంద్రుడే పెక్కులగు అద్దము లందు ప్రకాశించునట్లు ఆత్మబింబమును ప్రతిఫలింపజేసికొనెడి ఉపాధులు (అంతఃకరణములు, లేక బుద్ధులు అని వీటిని వ్యవహరింతురు) అనేక ములు, విభిన్నములు అయినను ఒక్క ఆత్మబింబమే వీటి అన్నింటియం దును ప్రతిఫలించు చున్నది. బుద్ధి స్వభావ కర్మలయందలి భేదము లన్నచో ఉపాధులనుబట్టి కలిగినవే కాని, ఆత్మవస్తువునకు సంబంధించి నవి కావు. ఉపాధులు త్రిగుణముల విలాసముచే పలు తరగతులు కావ చ్చును. కాని ఆ వికారములు ఆత్మునకు కలుగవు. కలిగినట్లు భావించుటే అజ్ఞానము. దానిచేతనే సంసారము.

ఒక్క సూర్యుడే పెక్కు నీటికుండలయందు ప్రకాశించినను కుండలలోని నీటియందలి తేటనుబట్టి ప్రకాశమునందు మార్పులు కలు గుట సర్వజన విదితము. అట్లే అంతఃకరణ శరీరోపాధులనుబట్టి ఆత్మ తత్త్వము సంకోచముగను, అసంపూర్ణముగను, సందిగ్ధముగను ప్రకా శించును. ఉపాధియనెడి అడ్డంకిచేతనే ఆత్మలో నున్న సర్వశక్తులు ప్రకాశితములు కాక, జీవుడు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది లక్షణ

ములు లేని అధముడై యుండుటయు సంభవించుచున్నది. వస్తుతః అఖండ సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మయే జీవుడు. బింబమునకంటె ప్రతిబింబము వేఱుకాదు కదా! అయినను ఉపాధియందలి అధ్యాసచేత - తాదాత్మ్యభావముచేత అతనికి సంసార మేర్పడినది.

స్థూలశరీరము భంగమయినను అంతఃకరణోపాధికుడై జీవుడు సూక్ష్మ శరీరముతో తన కర్మములకు తగిన నానాశరీరములను గ్రహించుచు విడుచుచు కర్మములను చేయుచు ఈ విధముగ ఆత్మజ్ఞానము కల్గువఱకును సంసారమున ప్రవర్తించుచుండును. నానావిధ కర్మములను చేయించునది ఆత్మచైతన్య ప్రతిబింబమును గ్రహించి అహంకార మమకార విశిష్ట మగు అంతఃకరణమే కావున, దానియందలి అనుభవ తారతమ్యముచేతను, గుణవ్యత్యాసముచేతను కలిగిన వికాసవిధానమునుబట్టి ఆత్మ శాంత ఘోర మూఢములనెడి భేదములచే ముత్తెఱంగుల అలరారు బుద్ధివృత్తుల ద్వారమున తరతమ భావములతో భాసిల్లుచున్నట్లుండును. ఒక్కటే దీపము పలు రంగుల అద్దములలో ఉండినచో దీపమునకు లేని అద్దముల రంగులు దీపమునకును ఉన్నట్లు పొడకట్టుట మనకు అనుభవసిద్ధము. మఱియు అద్దములందలి నైర్మల్య మాలిన్యములనుబట్టి దీప ప్రకాశమును అధమ మధ్యమోత్తమ రీతుల తోచుటయు సుప్రసిద్ధము. కాని వస్తుతః దీపమునందు ఈ రంగులుగాని, మందమధ్యమోత్తమ ప్రకాశములుగాని లేనట్లే, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మయందును భేదముగాని తారతమ్యముగాని రవ్వంతయు లేదు. కన్పట్టెడు భేద మంతయు, నానాత్వ మంతయు ఉపాధులలోనిదే. ఈ ఉపాధులు అవిద్యా కల్పితములని పూర్వము చెప్పబడియే యున్నది. కావున ఆత్మ ఒక్కటైనను పలుశరీరములయందు ప్రతిఫలించుటలోను, జ్ఞానవికాస విషయమున తారతమ్యము ఉండుటలోను దోష మావంతయు లేదు. సారాంశ మేమన? అద్వయానంద

స్వరూపుడగు ఆత్మునకు రెండవపదార్థముతో కలసికొనినట్లు తోచుటయే దుఃఖము; బంధము. ఆ రెండవపదార్థ సంపర్కము పోయి తాను కేవలాత్ముడయి స్వస్వరూపమునందు ఉండుటయే నిరంతర నిరతిశయ స్థితి, మోక్షము.

సత్యమిట్లుండ, అజ్ఞానవిలసితములైన వాదములును, మతభేదభిన్నములగు వాదములును, పెక్కులు ఆత్మవిషయికముగ చెలరేగినవి. దేహమాత్రవిశిష్టమగు చైతన్యమే ఆత్మయని కొందఱి తలంపు. ఇది చావు పుట్టుకలు గలదై ఉండుననియు వీరి సిద్ధాంతము. మూఢులగు పామరులును, లౌకాయతికులును ఇట్లు తలంతురు. ఇంద్రియములే విషయ జ్ఞానమును తెలిసికొనుచున్నవి కావున, అవియే ఆత్మయని కొందఱు, ప్రాణమే ఆత్మయని కొందఱు, మనస్సే ఆత్మయని కొందఱు, క్షణిక విజ్ఞానమే ఆత్మయని కొందఱు. దేహవ్యతిరిక్తుడయి, సంసారియు, కర్తయు, భోక్తయు అగువాడు ఒక్కరుడు ఆత్మయని కొందఱు. కేవలము భోక్తయే కాని, కర్తకాదని కొందఱు. ఆత్మవ్యతిరిక్తుడయిన ఈశ్వరు డొక్కడు సర్వజ్ఞుడును సర్వశక్తియు కలడని కొందఱు. ఈ విధముగా పలురీతుల తలంచుచున్నారు. ఇది అంతయు మయాశక్తివలన కలిగిన మహామోహమే - అజ్ఞానమే.

ఈ అంశమును శంకరులు దక్షిణామూర్తి స్తోత్రమున ఇట్లు వర్ణించినారు.

"దేహం ప్రాణ మపీంద్రియాణ్యపి, చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధజడోపమా స్త్వహ మితి భ్రాన్తా భృశం వాదినః
మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే."

ఈ వ్యామోహమును సంహరించు ఉపాయము తత్త్వవిచారముచే కలుగు ఆత్మదర్శనమే ।

ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాపి, సర్వశక్తి, సర్వజ్ఞము. యథార్థమున - ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వ గంతృత్వాదులు లేవు. అవి అన్నియు అవిద్యారోపితములై వ్యవహార వశమున ఉన్నట్లు కనబడుచుండును. ఈ వ్యవహార మంతయు త్రిగుణాత్మకమగు మాయయొక్క విలాసమే కాని వేఱు కాదు. కావుననే -

'నిష్క్రియం నిర్మలం శాంతం నిరవద్యం నిరంజనమ్.'

అని ఉపనిషత్తు ఆత్మను నిష్క్రియమనియుః నిర్మలమనియు, నిరంజనమనియు పొగడుచున్నది. సర్వవ్యాపి అయ్యును ఆత్మ సులభగ్రాహ్యము కాదని శ్వేతాశ్వతర మంత్రము లనుచున్నవి.

'సర్వ వ్యాపిన మాత్మానం క్షీరే సర్పి రివావృతమ్.' శ్వే. 1.16.

పాలయందలి నేతివలె అంతటను ఆవరించియున్న ఆత్మను -

'తిలేషు తైలం దధినీవ సర్పి రాపః స్రోత స్స్వరణీషు చాగ్నిః
ఏవ మాత్మని గృహ్యతేఽసౌ సత్యేనైనం తపసా యోఽనుపశ్యతి.'
1 - 15.

నువ్వులయందు నూనె వలెను, పెరుగులో నేయి వలెను, ప్రవాహముల యందు ఉదకము వలెను, అరణుల యందు అగ్ని వలెను వ్యాపించియున్న ఆత్మను ఎఱుంగుట సులభమెట్లగును ? తపస్సత్యములచేత ముమ్ముందుగా దానిని హృదయ గుహయందు ఉపలబ్ధి పొందకున్న బాహ్యమున ఆ యాత్మ సాక్షాత్కారము కలుగుట దుర్లభమే. నువ్వులలో వాటి స్వరూపమునకంటె విలక్షణస్వరూపము కల నూనె ఉన్నదనియు, పాలలో వాటి ఆకారగుణములకంటె విశిష్ట గుణస్వరూపములు గల ఘృతము ఉన్న

దనియు, కార్యములయందు వాటి స్వరూపగుణములకు భిన్నమగు అగ్ని ఉన్నదనియు అనుభవమును, జ్ఞానమును లేనివాడు చెప్పజాలడు. అట్లే స్థూలమును, జడమును అగు జగమున-సూక్ష్మమును, చైతన్యప్రభా భాసురమును అగు ఆత్మ ఉన్నదన్నచో, ఎవ్వరికి విశ్వాసము? కారణమేమన: ఆత్మ సూక్ష్మమగుటయు దృగ్రూపమై కంటికి అగపడు దృశ్యజాతమునకే కాక, అంతఃకరణాది దృశ్యవర్గమునకును విలక్షణమై ఉండుకే. ఇంద్రియగోచరమగు జ్ఞానమును మాత్రమే సంచిలో నింపుకొని "ధన్యోఽహం" అనుకొను మానవుడు - సర్వజ్ఞుడనైతినని తలచు పూరుషుడు ఇంద్రియములకు అందరాక వెలింగెడు ఆత్మతత్త్వ విషయమున సందేహపడుటయు, ముగ్ధుడగుటయు వింతయేమి? తన్ను ఆవరించిన అవిద్యావరణములు తొలగనిదే అతనికి ఆత్మదర్శనము ఎట్లు కలుగును? దానిని ఎఱుంగుటకై ఎట్లు యత్నించును?

"అవిద్యాయా మంతరే వర్తమానాః
స్వయం ధీరాః పండితం మన్యమానాః
జంఘన్యమానాః పరియన్తి మూఢా
అంధేనైవ నీయమానా యథాఽన్ధాః."

— ముండకోపనిషత్తు. 1. 2. 8.

అవిద్యావశమున మూఢులయ్యు, తమ్ముతాము ధీరులమనియు, పండితులమనియు తలంచుచు, గ్రుడ్డివానిచే కొంటోబడు గ్రుడ్డివారివలె తిరుగుచున్నారని అనాత్మజ్ఞులగు కర్మఠులను గూర్చి శ్రుతి తూలనాడినది. గీతాచార్యుడును "ఈ ఆత్మతత్త్వమును ఒక్కరుడు ఆశ్చర్యముగా చూచుచున్నాడు, ఒక్కడు పలుకుచున్నాడు, ఇంకొక్కడు ఆశ్చర్యముగా వినుచున్నాడు, మఱొక్కడు వినియు దీని నెఱుంగ జాలకున్నాడ"ని వక్కాణింపలేదా? కావుననే నేటి ప్రపంచమున అహంకార విమూఢాత్ములు

అగువారు కొందఱు దానినిగూర్చి చెప్పువారే లేరనియు, వస్తుతః ఆత్మ విషయమే అసత్యమనియు మోసపోవుచున్నారు.

పూర్వ మొక రాజు తన పట్టణమున మౌనవ్రతుడై తిరుగుచున్న ఒక సన్న్యాసిని తన వద్దకు పిలువ నంపించెను. భూనాథులతో ఏ యవస రమునులేక, భువననాథైక శరణ్యుడై యున్న ఆ బైరాగి రాజును ఉద్ధ రించుటకో యన అతని ఆస్థానమునకు విచ్చేసెను. ఆ సన్న్యాసి యొక్క ఆత్మనిష్ఠను పరీక్షింపనెంచిన రాజన్యుడు "ఓ మునివర్యా ! మీరు భగవ త్సాక్షాత్కారము నంది నిరంతరమును భగవానుని లీలామాహాత్మ్యమున ఓలలాడెడు పరమపురుషులు. మీ రెఱుంగని ఈశ్వర రహస్యములు లేవు. నాకు కల్గిన సందియములను తీర్ప మీరే సమర్థులు. మనవి చేసి కొనుమన్నచో నా సందియములను తమకు నివేదించుకొందును" అని కపటభక్తిని ప్రదర్శించుచు అడిగెను. అందుకు ఆ సన్న్యాసి అంగీకరించి "రాజేంద్రా ! ఆ సందేహము లెట్టివో తెలుపుమ"ని అనతిచ్చెను. అంతట నరపతి "మునివర్యా, భగవంతుడు ఏ విధముగానుండును ? అతడు ఏ దిశకు తిరిగి కూర్చుండును ? ఏమిచేయుచుండును ? అను సందియములు తీరక చాల కాలమునుండి బాధించు చున్నవి. నేటికి మీ వంటి మహాపురు షుల సందర్శనముచేత వాటిని తీర్చుకొను భాగ్యము కలిగినందులకు సంత సించుచున్నాను." అనియెను.

అంతట ఆ విరాగి "రాజన్యా, నీ సందియములును, సంకల్పమును మాననీయములు. నీ కోరినయట్లే రేపు సాయంకాలము ఈ మహాస్థానము నందే నీ వడిగిన ప్రశ్నములకు తోచిన సమాధానములను జెప్ప యత్నిం తుము. కాని ఆ సమయమున నీ రాచఱికపు దుస్తులన్నియు నా కొసగి, నీవు రాజవేషమున ధరించిన కిరీటాదులను కూడ క్షణకాలము నా స్వాధీ నము చేసి, నీవు నా బొంతను ధరించి చెంకాయ బుఱ్ఱను చే బూ ని నా

యెదుట నిలబడవలయును. అంతియే కాదు చెప్పువా డెప్పుడును ఉన్నతాస నమున ఉండుటయు,వినువాడు తక్కువ స్థానమున కూర్చుండుటయు సహజము కావున నీ సింహాసనమును నాకివ్వవలయును. ఈ ధర్మము నా సమాధానము ముగియునంతవఱకు పాటింపబడవలయును.'' అనెను. అందులకు తేడు అంగీకరింప మఱునాడు సభతీరెను. కొలువులోని మంత్రి సామంత సేనాపతులును, కవి పండిత గాయక శిల్పాచార్య ప్రభృతులును, ఇంక తక్కుంగల సభ్యనికరమును "క్లిష్టములగు ఈ సమస్యలకు సన్న్యాసి ఏమి సమాధానము చెప్పునో, చెప్పలేకున్న రాజు అతనిని ఎట్లుఅవమాన పఱచునో'' అని విచారించుచు ఆశ్చర్య చకితులై చూచుచుండిరి. అంతట రాజు తన దుస్తులను మౌనికిచ్చి అతని బొంతను తాను పైని వేసికొని కౌపీనమును ధరించి కమండలువు చేబూని, తన బ్రహ్మవర్చస్సునకు రాజవేషముచే కలిగిన క్షాత్రదీప్తి తోడుకాగ వెలుగుచు సింహాసనమును అధిష్ఠించి యున్న యతీశ్వరుని యెదుట నిలబడెను.

అంతట సన్న్యాసి ఒక గిన్నెతో పాలను తెప్పించి ''ఈ పాలలో నేయి కలదా?'' అని రాజు నడిగెను. కలదని ప్రభువు సమాధానము చెప్పెను. అయిన అది పాలలో ఎక్కడ ఉండెనని బైరాగి అడుగగా పాలయందంతటను వ్యాపించియున్నది స్వామీ, అని రాజు సమాధాన మిచ్చెను. అంతట ముని ''పాలలో నేయి ఏ విధముగా అంతటను వ్యాపించియున్నదో, అట్లే భగవానుడును సర్వమునందు వ్యాపించి యున్నాడని'' నుడివెను. తరువాత సన్న్యాసి ఒక దీపమును తెప్పించి ఒక బల్లపై పెట్టి 'రాజా! ఈ దీపము ఏ దిక్కునకు వెలుగుచున్న'దనెను. ''మునీంద్రా! అన్నివైపులను సమానముగనే ప్రకాశించుచున్న దానిని గూర్చి ఒకే దిక్కునకు వెలుగుచున్నదని యెట్లు చెప్పగలను'' అనెను. అంతట మౌనియు 'రాజా! దీపమెట్లు ఒకే దిక్కును ప్రకాశింప జేయుట

లేదో, అట్లే విశ్వతోముఖుడగు భగవానుడును ఏ దిక్కునకును తిరుగక, అన్నిదిక్కులను వెలిగించుచు, దిక్కులకెల్ల దిక్కై ప్రకాశించు చున్నాడు సుమీ। ఇక నీ మూడవ ప్రశ్నయగు భగవానుని నిత్యవ్యవహార మేమి? ఆతడు ఏమి చేయుచుండును? అను ప్రశ్న మిగిలి యున్నది. కావున వినుము. నేను ఈ ఆస్థానమునకు రాకపూర్వము నీవొక రాజువై ఈ రాజ్యపాలనమును ఒనర్చుచుంటివి. నేనొక భిక్షుకుడనై వీథివీథుల క్రుమ్మరుచుంటిని. ఇక ఇప్పుడు చూడుము. నీవొక భిక్షుకుడవైనా యెదుట నిలిచియున్నావు. నేనో రాజాధికారమును చేబూని సమ్రాట్టునై యున్నాను. ఇప్పుడు నేనెట్లు శాసించిన అట్లు జరుగ గలదు. నీకి సింహాసనము నందును, రాజ్యమునందును ఏమాత్ర మును స్థానములేకుండ చేసెడి అధికారము నా చేతిలో ఉన్నది. కావున దేవుడు రాజును భిక్షుకునిగను, భిక్షుకుని రాజుగను చేయుచుండునని ఎఱుంగుము; ఇదే ఈశ్వరుని దినకృత్యము.' అనెను.

అనవుడు రాజు సిగ్గుచే తలవంచుకొని ఆ యతిలోక సార్వభౌము నికి సాష్టాంగ దండప్రణామము లొనర్చి "దేవా, నా అజ్ఞానమును పాపుటకు ఈశ్వరుడు పనిచిన దేవదూతయే మీరు. కాకున్న ఇంత సులభముగ అజ్ఞానినగు నాకు భగవన్మాహాత్మ్యమును బోధింప సాధ్యమగునా? కావున నేటినుండియు నన్ను మీ శిష్యునిగా గైకొని నాకు ఉపదేశకులై ఈ రాజ్యమును ధర్మముగా నడిపింపుడు" అని వేడుకొనెను. అంతట ఋషియు "ఓ రాజేంద్రా। భగవత్తత్వము దుర్విజ్ఞేయము. పాల లోని నేయి, పాలను కాచి తోడుపెట్టి పెరుగైన పిమ్మట ఉపాయముతో దానిని చిలికి అందుండి వెన్నను పడసి దానిని కరగబెట్టిననే కాని లభింప నట్లు, ప్రపంచమునందంతటను అవ్యక్తరూపుడై వ్యాపించియున్న పరమేశ్వరుడును చిరతపస్సాధనములచే కాని లభ్యుడు కాడు. అహంకార

విమూఢాత్మలకు పరబ్రహ్మతత్త్వము అందుకొనరానిది. ఎంతవఱకు మానవునిలో అహంకారము ఉండునో అంతవఱకును ఈశ్వరుడు గోచరింపడు. అహంకారము నశించినచో ఇక మిగులునది ఒక్క భగవత్తత్త్వమే. అంతయు భగవదంశమే అయియుండ నరుడేల దానిని కాదని ఆ స్థానమున తాను ప్రవేశింప వలయును? ఈ అహంకారమునకు ఫలము భగవంతుడు మాటుపడుటయే. సర్వము భగవానుడే అని ఎంచు ఆత్మజ్ఞాని ఎండలో దీపమువలె ఆత్మతత్త్వమునందు కలసిపోవును. అనగా భగవంతుడే అయిపోవును. తానే భగవంతుడయినపుడు జీవునకు శోకమోహము లెక్కడ? జనన మరణము లెక్కడ? మహానంద సముద్రములోని ఒక అలయే అతడు. సచ్చిదానంద సాగరములోని ఒక జలకణమే తాను. నీటిచుక్కకును నీటికిని భేదము లేనట్లు జీవాత్మ పరమాత్మలకు భేదము లేకపోగా ఐక్యమే సిద్ధించుచున్నది. కావున తత్త్వము ఇది. ఇట్టి సర్వతోముఖుని కార్య ప్రణాళికను ఏ విధముగా ఉండుననియు, అతడు ఏ దిశకు తిరిగి యుండుననియు ప్రశ్నించుటలు మానవుని దురహంకార పూరితమగు అజ్ఞానమునే వెల్లివిరియ జేయును. దీపకాంతి అన్ని దిక్కులకు అలముకొన్నట్లు, దీపములకెల్ల దీపమును, సూర్యచంద్రనక్షత్రాది జ్యోతులకెల్ల జ్యోతియును అగు ఆ పరంజ్యోతి స్వరూపుడు అన్ని దిక్కుల యందును ముఖములు గలవాడై అంతటిని చూచు సర్వద్రష్టయై నియామకుడై వెలుగుచున్నాడు. "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్" అను వేద గానమును వినలేదా? సర్వజీవులయొక్క హృదయదేశములందును ఆత్మస్వరూపుడై వెలుగొందు చైతన్యప్రభాభాస్వరుడు ఈతడే. ఈ ఆత్మయే "సర్వతః పాణి పాదం తత్సర్వతోఽక్షి శిరో ముఖ" మయి ప్రకాశించుచున్నది. ఆత్మయే శరీరోపాధి యందు తగుల్కొని దేహాభిమానముచే జీవశబ్దవాచ్యమగుచున్నది. మాన

పుడు తనయందలి జీవత్వమును ఈశ్వరత్వముగా పరిణత మొనర్చు కొనుటకే అవతరించియున్నాడు. మానవ జన్మకు ఇదియే సమగ్రత.'' అని పరమజ్ఞానోపదేశము నొనర్చి ఆ స్థానినుండి వెడలిపోయెను.

కావున ఆత్మతత్త్వ విషయమున అజ్ఞానవశమున ఎన్ని విప్రతి పత్తులైనను సంభవింప వచ్చును. ఇది తరువాత ఇంక విస్పష్టముగ తెలియ గలదు. కావున ప్రకృతము ఆత్మవిద్య యొక్క సర్వాధిక్య మును, స్వరూపమును ప్రకటించు నచికేతుని ఉదంతమును ఇట స్మరిం తము. ఆత్మదర్శనమున ఆత్మతత్త్వ ప్రకాశమగు ఆ యితిహాసమును విస్మరించుట కొఱంతయు అగును.

నచికేతుడు వాజశ్రవసుని తనయుడు. తండ్రి ఒక యజ్ఞమును చేయుచు అందు ముదిసి జీర్ణించి చావ సిద్ధముగా నున్న ఆవులను ఋత్వి జులకు దక్షిణగా ఈయ సిద్ధపడి యుండెను. పదునాలేండ్ల ప్రాయము గలవాడయ్యు బాగోగుల నెఱింగిన ఆ కుఱ్ఱ ఇట్టి ఆవులను దక్షిణగా ఇచ్చిన యజమానుడు ఆనందములేని లోకముల కేగునని ఎఱింగినవాడై తండ్రి వద్ద కేగి, ''జనకా, నన్నెవరికి దక్షిణగా ఇచ్చెద''వని అడిగెను. ఒకటి రెండు మాఱు లడుగుటచే విసుగుచెందిన వాజశ్రవసుడు ''నిన్ను మృత్యువున కిత్తు''నని పలికెను. సత్యవ్రతుడగు ఆ కుమారుడును "తండ్రీ ! నన్ను యమునికే ఇత్తునని పలికితివి. మానవుడు అబద్ధమాడి నచో దోషము ప్రాప్తించును. అందును మన వంశము వారెవ్వరును అనృతవాదులు కారు. కావున నేను యమునికి అతిథినై పోయెద''వని చెప్పి వెడలి పోయెను.

నచికేతుడు సంయమనీపురము చేరునప్పటికి యముడు ఇంటివద్ద లేడు. జమునికోసమై నచికేతుడు మూడు రాత్రులు నిరాహారుడై వేచి

యుండెను. తరువాత యముడు వచ్చి తన కోపమై బ్రాహ్మణ కుమారుడగు అతిథి ఉపవాసములతో తనయింటివద్ద ఉన్నందుకు చింతించి మూడు రాత్రులు అన్నము లేకుండ ఉన్నందుచే కలిగిన అతిథిసత్కారాభావ దోషము క్షమించుటకై మూడు వరములను కోరుకొమ్మని నచికేతుని ప్రేరేపించెను. అంతట పితృభక్తి పరాయణుడగు నచికేతుడు తన ఎడబాటుచే తండ్రికి కలిగిన వైమనస్యము పోవునట్లు ఒక వరమును, స్వర్గవిద్యను గూర్చిన ఇంకొక వరమును కోరుకొని మూడవ వరమున ఆత్మతత్త్వమును గూర్చి యిట్లు ప్రార్థించెను-

"యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే
అస్తీత్యేకే నాయ మస్తీతి చైకే
ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాఽహం
వరాణా మేష వర స్తృతీయః."

— కఠవల్లి. 1.1.20

"ఓ వైవస్వతా, మానవుడు మృతుడైన పిమ్మట దేహేంద్రియ మనోబుద్ధులకంటె వేఱగు ఆత్మ కలదని కొందఱును, లేదని కొందఱును వాదించుచున్నారు. ఈ ఆత్మ ప్రత్యక్ష ప్రమాణగోచరము కాకపోవుట చేత, కలదా లేదా అను ఈ సందేహము కూడ యుక్తియుక్తముగనే ఉన్నది. నా మూడవ వరమున ఈ సందియమును పాపి నన్ను ధన్యుని చేయ వేడికొందును."

అనవుడు ఆ అంతకుడు "కుమారా! ఈ విషయమై దేవతలును సంశయగ్రస్తులయియే యున్నారు. అణురూపమైన ఈ ధర్మము అంత సులభముగా ఎఱుంగ దగినది కాదు. కావున ఇంకొక వరమును కోరుకొమ్మని, పలువిధముల అశ్వ పెట్టెను. వలసినచో దీర్ఘాయుష్కులగు పుత్త్రపౌత్త్రులను, భూ పశు హిరణ్యాది మహైశ్వర్యములను, కావలసి

నంత ఆయుష్యును, త్రిలోక సౌందర్యవతులగు స్త్రీలను కోరుకొనుము. ఇంతయేల ? మర్త్యలోకములో అందరాని ఏయే కోరికలనైనను కోరు కొనుము. విస్పందేహముగా ఇచ్చెదను. కాని మృతవిషయికమగు ఈ ప్రశ్నమును మాత్రము అడుగకు'' మని వైవస్వతుడు నచికేతున కాశలు కల్పించెను కాని ఆతడు ఆ వలలో పడలేదు.

''భోగములు ఇంద్రియ తేజములను హరించి శరీరమును మృత్యు సదనముగా ఒనర్చునట్టివి. ఎన్ని వత్సరముల ఆయుస్సును పెంచుకొని భోగములను కుడుచు చున్నను కట్టకడపటికి నాశనము తప్పదు. కావున నేను భోగముల నొల్లను. ధనముచేత మానవు డెప్పుడును సంతృప్తుడు కాజాలడు. సంతృప్తి మనోవిషయికము; దానికి అతీతమైనదైనను కావచ్చును. ధనము వెలుపలిది; భోగములును వెలుపలివే. ఈ రెంటితో సంబంధము కల్పించుకొనుట మోహముతక్క వేఱుగాదు. ఎన్నాళ్ళు బ్రతికినను చావు తప్పదు. బ్రహ్మ మున్నగు దేవతలును ఆయుస్సు ముగిసిన పిమ్మట కడతేఱుట సిద్ధము. తుచ్ఛ నశ్వర భోగములను కుడుచుచు మీ రిత్తుమన్న దీర్ఘజీవితములో రమించుటకు వివేకి ఎవ్వ డొప్పుకొనును ? అందును నాకు ఎంతమాత్రము ఇష్టముకాదు. మీవంటి విద్వాంసులను (ఆత్మజ్ఞులు) అనుభవజ్ఞులను,అధికారవిశిష్టులను ఆశ్రయించి మానవుడు అస్థిరములగు వాటిని కోరి చెడుట మేలుకాదు.కావున ఆత్మతత్త్వ మును వివరింపక తప్పదు.'' అని నచికేతుడు యముని నిర్బంధముగ వేడుకొనెను. దృష్టములును, అదృష్టములును అగు భోగములకు వశుడు కాక, నిత్య నిరతిశయ భోగమును అపేక్షించి ఆత్మ కాముడైన నచికేతుని ఇచ్ఛతీర్పక శమనునికి తప్పినది కాదు.

అప్పుడు సర్వభూతనిగూఢమగు ఆత్మను గూర్చియు, దాని అతి రహస్యమును గూర్చియు, తత్సాధనమగు ప్రణవమును గూర్చియు సవిస్తర

మును బోధించి, అటుపిమ్మట "నచికేతా! మరణానంతరము ఆత్మ ఏమగునో నీకు చెప్పెద నాలకింపు" మని కృతాంతుడు ఈ విధముగ ఉపదేశించెను :

"యోని మన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః
స్థాణు మన్యేఽను సంయాన్తి యథా కర్మ యథా శ్రుతమ్."
— కఠవల్లి. 2.5.7.

"శరీరము మరణించిన పిమ్మట కొందఱు జీవులు వారు వారు చేసిన కర్మలకు, సంపాదించిన జ్ఞానమునకు అనుగుణముగా ఆ యా యోనులందు పుట్టుదురు. మఱికొందఱు మూఢాత్ములు వారి కర్మజ్ఞానము లనుబట్టి జీవభావమునుకూడ పొందక వృక్షాది స్థావరములను పొందుదురు. ఇదియే ఆత్మ రహస్యము.

ఒక్కటేయగు అగ్ని ఎట్లు పలురూపములతో ఉన్న కొయ్యలం దుండి నానారూపములతో ఒప్పుచున్నదో, వెలుపల ఎన్ని రకముల ఆకారములను కలిగియున్నను,అంతర్భూతమైన దాహశక్తిలో రూపభేదము గాని మఱి ఏ ఇతర భేదముగానిలేక ఒక్కటిరై యుండెనో, ఒక్కటియు, ఒక్క స్వరూపము కలదియునగు ఆత్మయు సర్వభూతముల యందు వ్యాపించినదై అవ్వాని నానావిధరూపములను అనుసరించి లోపలను వెలుపలను ప్రకాశించు చున్నది. ఎన్ని విధములుగా ఉన్నవాటియందు ప్రకాశించినను అగ్నికి వికారము లేనట్లే ఆత్మకును వికారము లేదని యెఱుంగుము.

ఒక్కడే యగు సూర్యుడు మన కంటికిగల దోషముచే మంద ప్రకాశుడుగను, దీప్తిమంతుడుగను తోపవచ్చును. మఱియు మేఘములు ఆవరించినప్పుడు ప్రకాశ రహితుడుగ ఉన్నట్లున్నను త్రికాలములయందును అతడు ఏ కళంకములేక ప్రకాశించుచునే యున్నాడు. మనము అరోపించు

బాహ్యదోషములు అతనికి అంటవు. అట్లే ఆత్మయు లోకముయొక్క బాహ్య దుఃఖములచే అంటుపడదు. లోకము అవిద్యచేత తనయందు ఆరోపించుకొనిన కామకర్మల యొక్క దుఃఖములను అనుభవించుచున్నది కాని, యథార్థముగ ఆత్మకు అట్టివి సంబంధము రవ్వంతేనియు లేదు. త్రాటి యందు సర్పమును, ముత్తెపు చిప్పయందు వెండియు, ఊషరక్షేత్రము (ఎండమావులు) నందు జలమును, ఆకాశమున మాలిన్యమును ఉన్నట్లు భ్రాంతివశమున తోచినను, వాటియందు అవి యథార్థమున లేవు. లేని వాటిని ఉన్నట్లుగ భావించినను ఆ దోషము వానికి పట్టదు. అట్లే ఆత్మ యందును లోకులు (అజ్ఞానులు) కర్మము, సాధనము, ఫలము (సర్పాది స్థానీయము) మున్నగు వాటిని విపరీతముగ ఆరోపించి, అది కారణముగ జనన మరణాది రూపమగు దుఃఖమును అనుభవించుచున్నారు. కాని పర మార్థమునకు విపరీతముగ ఆరోపింప బడిన ఈ దుఃఖముచే ఆత్మకు అంటు తగులునా? ఆత్మ పుట్టునా? చచ్చునా? దుఃఖించునా? కర్మములు చేయునా? ఫలముల నందునా? అట్లే అయిన త్రాడు పామయినట్లే! శుక్తి రజతమయినట్లే! ఎండమావులు నీటి ఊట లయినట్లే! కావున వెలుపలి ఆరోపణలు ఆత్మకు అంటునట్టివి కావు.

''ఏకో వశీ సర్వ భూతాంత రాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి
తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం.''

— కఠవల్లి. 2.5.12.

"సర్వమును వశీకరించుకొను శక్తి గలిగి - సర్వజ్ఞము, సర్వ శక్తియై, అఖండాద్వితీయ మగుచు ''అస్తి, భాతి, ప్రియ'' ము అనెడి

(సచ్చిదానందములు) లక్షణములచే ఏ ఆత్మ వెలుంగు చున్నదో, అట్టి కూటస్థ నిత్యచైతన్యమే నామరూపములనెడి అంశద్వయముచేత నానావిధోపాధి సంయుతము కాగా, అనేక రూపములను సృజించుచున్నది. సదైకరసమగు స్వాత్మసత్తా మాత్రముచేత అచింత్యాద్భుత శక్తి యుక్తమగు ఈ జగల్లీలను ప్రపవించునది ఏకమగు పరమాత్మయే. ప్రతి ప్రాణి శరీర హృదయాకాశముల యందును, చైతన్యరూపమున అభివ్యక్తమగు ఈ ఆత్మను ఎవ్వడు భార్యాపుత్ర ధనాదులయందాశలేనివాడై ఐహికాముష్మిక ఫలములయందు వైరాగ్యము కలిగి, బాహ్యాంతర్వృత్తులను అరికట్టి తన హృదయ పుండరీకమున దర్శించు చున్నాడో, అట్టి పరమాత్మ భూతునికే శాశ్వతాత్మానంద రూపమగు పరమ సుఖము, పరమశాంతి, నిరతిశయతృప్తి. ఇతరులకు దుఃఖమే."

"తదేత దితి మన్యన్తేఽ నిర్దేశ్యం పరమం సుఖం
కథం ను త ద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥"
— కఠవల్లి. 2.5.14.

"ఆత్మవిజ్ఞాన రూపమైన ఈ సుఖమే ఇట్టి దట్టి దని నిర్దేశింప శక్యము కానిది; పరమైనది. ఇషణత్రయము నుండి విడివడినవారై బాహ్యవృత్తులు నివృత్తము లగుడు, అంతర్వృత్తి పరాయణులైన మునులు ఇద్దానిని పమీపస్థముగనే భావించుచున్నారు.అట్టిదానిని ఎట్లెఱుంగుదుము ? అది యెట్లు ప్రకాశించును ? బుద్ధిగోచర మగును ? అనగా అది అతీంద్రియమని భావము."ఆత్మ ప్రకాశమునుగూర్చి ఈ సందేహములేల ?

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః
త మేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి." — కఠవల్లి. 2.5.15

"ఈ ఆత్మవద్ద సర్వమును ప్రకాశింపజేయు సూర్యుడును వెలుంగజాలడు. అనగా ఆత్మ వస్తువును సూర్యుడును ప్రకాశింపజేయ లేడనుట. ఈ చంద్రుడుగాని, తారకలుగాని, విద్యుత్తులుగాని దాని చెంగట వెలుంగ నేరవు. ఇక ప్రత్యక్షముగా సన్నిహితమైయున్న అగ్నిమాట చెప్పేదేమి? ఈ సూర్యచంద్రాది జ్యోతులన్నియును ఆ మహాజ్యోతి ననుసరించియే వెలుంగుచున్నవి. అనగా మహాజ్వాలగా మండెడు అగ్ని యొక్క సంయోగముచే అందలి తేజమును గ్రహించి లోహాది పదార్థ ములు వెలుగునట్లు, సూర్యాదులును ఆ ఆత్మజ్యోతి యందలి తేజమును గ్రహించియే ప్రకాశించు చున్నారని భావము. అంతేకాదు, ఇంతటి బ్రహ్మాండమంతయు ఆత్మదీప్తి చేతనే ప్రకాశించుచున్నది. నిజముగ ఈ ఆత్మ ప్రభావమునకు వెఱచియే గాలి వీచుట, సూర్యుడు వెలుగుట, ఆ యా దేవతలు, భూతములు, సర్వమును తమ తమ పనులయందు ధర్మము తప్పక చరించుట. ఇట్లనుటచే ఆత్మ సర్వశక్తి యుక్తమును, సర్వవస్తు నియామకమును అని తేలుచున్నది."

ఈ విధముగ యముడు నచికేతునకు ఆత్మతత్త్వమును ఉపదేశిం చెను. నచికేతునియొక్క ఐహిక భోగములమీది అనాసక్తియు, స్వర్గ సుఖముల యందలి అరుచియు, ఆత్మవిద్య యందలి మిక్కుటమగు మక్కువయు, అందుకై అతడొనర్చిన కామోపభోగముల త్యాగమును ఆత్మవిద్యాధిక్యమునే సూచించుచున్నవి.

కావున విజ్ఞానయుక్తుడగు మానవునకు ఆత్మయే చూడదగినదియు, వినదగినదియు, భావింప దగినదియు, అనుభవింప దగినదియు అనెడి ఉపనిషద్వాక్యము మహత్తరమును, అమృతభావ విలసితమును అగును.

ఇంతవఱకు చేసిన ఆత్మవిచారముచేత "అహమే వేదం సర్వం" నేనే సర్వమును అనెడి ఉపనిషదర్థము వ్యక్తమయినది. తనకంటె ఇతరమగు భగవత్సత్త ఉన్నట్లింతవఱకు తెలియలేదు. మఱియు జగత్కారణభూతమగు పదార్థము ఆత్మయే యని రూఢి అయినది. కాని ఆత్మకన్న భిన్నమో, మఱి అభిన్నమో అయి బ్రహ్మపదార్థమొకటి కలదనియు, బ్రహ్మజ్ఞానమే మానవునకు కలుగవలసిన దనియు, అట్టి బ్రహ్మమును ఎఱింగినవాడు బ్రహ్మమే అగుననియు. బ్రహ్మానందమును మించిన ఆనందము లేదనియు శ్రుతులు వక్కాణించుచున్నవి. ఆ యంశములను రాబోవు ప్రకరణమునందు విచారింతము:



# బ్రహ్మాత్మైకావగతి

"యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్
సూక్ష్మాత్ సూక్ష్మతరం నిత్యం స త్వమేవ త్వమేవ తత్."
కైవల్యోపనిషత్. 16.

"యదాత్మ తత్త్వేన తు బ్రహ్మతత్త్వం
దీపోపమేనేహ యుక్తః ప్రపశ్యేత్
అజం ధ్రువం సర్వ తత్త్వై ర్విశుద్ధం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః."
— శ్వేతాశ్వతరోపనిషత్. 2. 15.

"మానవుడు ఏ స్థితియందు యోగయుక్తుడై స్వయంప్రకాశరూపమగు ఆత్మతత్త్వముచేత బ్రహ్మతత్త్వమును "అదియే నేను" అని ఎఱుంగునో; అనగా బ్రహ్మాత్మైక్య జ్ఞానమును పడయునో; అప్పుడు జన్మాదులు లేనిదియు, సమస్త భూత భౌతిక తత్త్వములకు దూరమయినదియు అగు పరతత్త్వమును తన్నుగా ఎఱింగి, "నేను, నాది" యనెడి ఎల్ల బంధములనుండి విముక్తు డగును."

ఈ జగ మెటనుండి పుట్టుచున్నది ? దేనియందు ఇద్దాని స్థితి ? మఱల ఇది ఎక్కడ ఆడంగుచున్నది? అను ప్రశ్నలు వేదమున పలుతావుల తలయెత్తి సముచితమైన సమాధానమును పడసి యున్నవి. జగత్కారణమును గూర్చిన వాదములు వేదములందు కంటె వేదములను అర్థము చేసికొనుటలో భిన్నమతావలంబులైన దార్శనికులయు,మత ప్రవర్తకులయు

వేదాను యాయులు కావి హేతువాదులయు నిర్వచనములలో వ లు విధము లైనవి. వివిధరీతుల తనరారుచున్న ఈ జగత్కారణ మతభేద ములను అటుంచి, ఆత్మవాదులచే అంగీకృతములయి ఉపనిషద్గోచరము లగు ఆత్మదర్శన సిద్ధాంతములను మాత్రము ఇచ్చట ప్రస్తావించు కొందము.

దృశ్యమానమగు ఈ జగత్తున కంతటికిని ఒకమహాశక్తి కారణమై యుండవలయునని అంగీకరింపక తప్పదు. కారణము లేని కార్యము కలుగుట విరుద్ధము కావున, ప్రపంచమునకు ఉపాదానమును, నిమిత్త మునై ఒక కారణము ఉండవలయును. కుండలు చేయుటలో కుమ్మరి ఒక డును, మట్టియను ద్రవ్య మొకటియు, కఱ్ఱ, చక్రము, నూలు త్రాడు మున్నగు సాధనములును కావలసినట్లే, ఈ జగత్తునకు ఉపాదాన కారణ భూతమగు ద్రవ్య మేది? శిల్పి ఎవడు? సాధనము లేవి? అను చర్చ మనస్సునకు తట్టును. ఏ అఖండశక్తి జగమునకు కారణమని వచించు చున్నామో, అది తనకంటె ఇతరమగు ఉపాదానభూత పదార్థమును కాని, సాధనములనుకాని అపేక్షించినట్లు లేదు. సర్వశక్తమగు వస్తువునకు తనకంటె వేఱగు ద్రవ్యమేల? సాధనము లేల? కావున ఏది జగత్కా రణమో, అది ఉపాదాన - నిమిత్తములనెడి రెండు కారణములును తానే అయి యున్నది.

జగచ్ఛిల్పి తనకంటె భిన్నమగు పదార్థముతో ఈ లోకములను సృజించెనేని, వస్తుతః జగము ఆ శక్తి పదార్థమునకంటె వేఱై విపరీత లక్షణములతో ఒప్పవలయును. అప్పుడు తనకంటె వేఱగు పదార్థము తాను కాదు కావున, ద్వైతభేదము సిద్ధ మయినట్లే; సర్వాత్మభావము దూరాపాస్తముకాక తప్పదు. కావున ఉపాదాన నిమిత్తములనెడి రెండు కారణములను అదియే యగుట ఇష్టము; సిద్ధమును. ఏ ఉపాదాన కారణము

నుండి పుట్టిన వస్తువు దానియందే స్థితిని, లయమును-కాంచుట అనుభవ ములో ఉన్నది. మట్టి ఉపాదానకారణమై పుట్టినకుండ మట్టియందే ఉండి చివరకు మట్టిలోనే అడంగు చున్నది. వికార రూపమును తాల్చిన స్థితి కాలమున తప్ప, ఆద్యంతములగు రెండు కాలములందును మట్టి అనియే దానిని వ్యవహరించుచున్నాము. కుండయనెడి వ్యవహారము మధ్యకాల మున మాత్రము ఉపయోగపడుచున్నది. అప్పుడైనను కుండయను నామ మును, దాని రూపమును వీడిన మిగులునది మట్టియే. యథార్థము ఆలో చించిన కుండయందు మట్టి లేకపోలేదు. కావున ఏ కార్యమునకు (కుండ మొదలగు దానికి) మూడు కాలములందును ఏ కారణము (మట్టి మొదలగు నది) నందు ఉనికి సంభవించునో, అనగా వస్తుతః కారణమునకంటె భిన్నము కాక కార్యము పరగునో, అట్టి ఉపాదాన కారణము జగమునకు ఏదై యుండునన :

''యతో వా ఇమాని భూతాని జాయన్తే.
యేన జాతాని జీవన్తి. యత్ప్రయన్త్యభి
సంవిశన్తి. తద్విజిజ్ఞాసస్వ. తద్బ్రహ్మేతి.''

— తైత్తిరీయ భృగువల్లి. 1

దేనినుండి భూతజాలము పుట్టుచు, దేనిచే పుట్టి జీవించుచు, దేని యందు అణంగుచున్నదో అదియే మానవుడు ఎఱుంగదగిన జగత్కారణ మగుబ్రహ్మము.కావున జగము పుట్టక పూర్వమును,గిట్టిన అనంతరమును బ్రహ్మమే. ఇక మధ్య కాలముననే నామరూపాత్మక జగద్వ్యవహారము. ఇప్పుడైనను నామరూపములను తొలగించి వస్తుస్థితిని అరయువారికి, కుండ మట్టికంటె అభిన్నముగ తోచినట్లు, జగము బ్రహ్మమే యగును. బ్రహ్మపదార్థముయొక్క లీలావిలాసమే జగము. కావుననే యథార్థముగ

కాని నామరూపములచే ప్రవర్తించు జగత్తు మిథ్య యని అద్వైత వేదాంతుల సిద్ధాంతము.

"వాచారంభణం నామధేయం వికారో మృత్తికేత్యేవ సత్యం."

— ఛాందోగ్యోపనిషత్తు. 6.1.4.

ఈ మంత్రము సైతము కారణభూతమైన మృత్తికయే సత్యమనియు, వికారమైన రూపమును, దానిని సూచించెడి నామమును మిథ్యలనియును తత్త్వార్థమును నిరూపించుచున్నది.

"మట్టి కుండగా పరిణమించి వికారము నందునట్లు, బ్రహ్మమును జగముగా పరిణమించి వికారమును పొందునదైన, బ్రహ్మమునకును పరిణామవికారాదులు ఉన్నట్లేకదా? అప్పుడు జగత్తులోని పదార్థములకన్న బ్రహ్మపదార్థమునందుగల విశేష మేమి?" అని ఒక శంక రావచ్చును. కాని పాలు పెరుగుగా పరిణామము చెందునట్లు బ్రహ్మమును ఆకాశాది భూతజాలముగా పరిణమించినచో బ్రహ్మము నిర్వికారమును, నిత్యమును కాని మాట వాస్తవమే. బ్రహ్మము అట్లగుటలేదు. జగద్విషయమున ఆరంభ, పరిణామ వాదములను అద్వైతులు ఒప్పరు. వివర్త వాదమే వీరికి ఇష్టమైనది. ఇతర వాదము లన్నియు దోషయుక్తములును, ప్రమాణ విరుద్ధములును అగుటచే బ్రహ్మము జగద్రూపమున వివర్తించుచున్న దనుట సిద్ధాంతము. రజ్జువు సర్పముగ వివర్తించి కన్పడునట్లు, అద్వితీయ బ్రహ్మముకూడ వివర్తించి పొడకట్టుచున్నది. రజ్జువునందు సర్పము తోచుటకు భ్రాంతి తక్క ఒండొక కారణము లేదు. అట్లే బ్రహ్మము జగత్తుగ తోచుటకును అనాద్యవిద్యా మూలక మయిన భ్రాంతియే కారణము. భ్రాంతివశమున ఒక వస్తువును వేఱొక విధముగా

తలంచినను, ఆ తలంపుచే కల్గు దోషములు దానికి అంటవని పూర్వప్రక రణమున నిరూపింపబడినది.

"అస్తి భాతి ప్రియం రూపం నామ చే త్యంశపంచకం
అద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయమ్."

సచ్చిదానందములు మూడును బ్రహ్మస్వరూపము. నామరూపములు రెండును జగద్రూపము. సత్తుమాత్రమే స్థిరమయిన దనియు, దానికి వ్యతి రిక్తమయిన అసత్తు లేనిదే యనియు, అట్టి లేనిదగు మాయచే కల్పితము లైనవే నామ రూపము లనియు పూర్వము నిరూపింపబడినది. దీనినిబట్టి సచ్చిదానందమునందు అవిద్యచే ఆరోపింపబడిన నామరూపములు మిథ్యలే యనితెల్లమగుటలేదా? నామరూపాత్మకమగు ప్రపంచముయొక్క అస్థిరత్వ మును, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మ (లేక బ్రహ్మము) యొక్క నిత్యత్వమును మొదటినుండియు నిరూపిత మగుచునే యుండెను. ఉదాహ రింప బోయెడి శ్రుతియు సాధకులకు ఈ త్రోవనే ఉపదేశించుచున్నది.

''యథా నద్యః స్యందమానా స్సముద్రే
అస్తం గచ్ఛన్తి నామరూపే విహాయ,
తథా విద్వా న్నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్.''

—ముండకోపనిషత్తు. 3.2.8.

గంగా యమునా గోదావర్యాది నదులు ప్రవహించి ప్రవహించి, చిట్టచివరకు తమ నామరూపములను వదలి సముద్రములో కలియునట్లు తత్త్వజ్ఞుడును నామరూప భేదయుక్తమగు జగమునుండి విడివడి పరాత్పరు డగు పురుషుని (బ్రహ్మను) పొందునని ముండక శ్రుతి చెప్పుచున్నది.

సత్యజ్ఞానానన్తమగు ఈ బ్రహ్మము పూర్వగ్రంథమున నిరూపింప బడిన ఆత్మకంటె భిన్నము కాదు. ఆత్మయందు ఏ సచ్చిదానంద లక్షణ ములు కలవో, అవి బ్రహ్మమునందును ఉన్నవి. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అని తైత్తిరీయోపనిషత్తు వాకొనుచున్నది. ఇంక ఏ యే లక్షణములు ఆత్మవిషయకముగ ప్రసిద్ధములో,అవియెల్ల బ్రహ్మము నందును రూఢములే. ఆత్మ జ్ఞానముచేత ఏ జనన మరణరూప సంసార విముక్తి కలుగుచున్నదో, నిరతిశయానందము లభించుచున్నదో, స్వస్వ రూపోపలబ్ధి చేకూరుచున్నదో అట్టివెల్ల బ్రహ్మజ్ఞానము చేతను కలుగు చున్నవి.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ. యో వేద నిహితం గుహాయాం.
పరమేవ్యోమన్ సోఽశ్నుతే సర్వా న్కామా న్సహ బ్రహ్మణా విపశ్చితేతి."
— తైత్తిరీయానంద వల్లి. 1.

సత్యజ్ఞానానంతమై హృదయగుహయందు పొందబడుబ్రహ్మమును ఎవ్వ డెఱుగునో, అట్టివాడు సర్వకామములను అందును. అనగా సర్వ కామావాప్తి చేకూరుటచే ఏ కోరికలును వాని కుండవు. ఏ కోరిక చేకూరిన అవల కోరదగినది వేఱొకటి ఉండదో అట్టి పరమవాంఛ ఈదేఱును. నరునకు కావలసినది వాంఛాపరిసమాప్తియే కదా! ఎట్లన?

"కామాన్ యః కామయతే మన్యమానః
స కామభి ర్జాయతే తత్ర తత్ర,
పర్యాప్తకామస్య కృతాత్మనస్తు,
ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః."

— ముండకోపనిషత్తు. 3.2.2.

ఎవడు అనవరతము పలువిధములగు కోర్కులను కోరుచుండునో వాడు ఆ కోరికల ఫలములను అనుభవించుటకొఱకై యట నట పుట్టుచుండ వలయును. కామపరిసమాప్తి నందిన కృతార్థునకు తన ఆత్మయందే అన్ని కోరికలును లీనమగు చున్నవి. "యం లబ్ధ్వా చా పరం లాభం మన్యతే నాధికం తతః" అనునట్లు ఇక దీనిని బొందిన పిమ్మట బొంద వలసిన లాభాంతరము జీవునకు ఉండదు. సర్వకామముల పరిసమాప్తి మాత్రమే దీనికి ఫలము కాదు.

"స యో హ వై త త్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి."
— ముండకము. 3.2.9.

"బ్రహ్మ విదాప్నోతి పరం." — ఆనందవల్లి. 1.

"ఆనందం బ్రహ్మణో విద్వా న్న బిభేతి కదాచ నేతి."
— తైత్తిరీయానందవల్లి.

"త మేవం విద్వా నమృత ఇహ భవతి. నాన్యః పన్థా
విద్యతేఽయనాయ" "తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి."
— పురుషసూక్తము.

"ఎవడు బ్రహ్మమును ఎఱుంగునో వాడు బ్రహ్మమే అగును. బ్రహ్మవేత్త ఉత్కృష్టమగు పదవిని అందుచున్నాడు. బ్రహ్మానందము నొందిన విద్వాంసుడు ఎప్పుడును జరా జన్మ మృత్యువుల వలన భయము చెందడు. ఆ పరమపురుషు నెఱింగిననే జీవుడు అమృతు డగును. ఇంత కన్న పరమపదమునకు వేఱొక గతి లేదు; మృత్యువును దాటుటకును ఆ పురుషోత్తముని ఎఱుంగుటయే త్రోవ; వేఱొక తెరువు శూన్యము." ఈ విధముగ పెక్కు శ్రుతులు బ్రహవేత్తకు కలుగు నిరతిశయ నిత్యా మర విభూతిని సహస్రముఖముల నొడువు చున్నవి.

శుద్ధ బుద్ధ ముక్తస్వభావమగు ఈ బ్రహ్మమును ఎఱుంగుటచేతనే (పరిశీలించుటచేతనే) హృదయగ్రంథి భేదము జరిగి, సర్వసంశయములు నివృత్తములు కాగా, అవిద్యా విలాసములగు అఖిల కర్మములును, తద్వాసనలును పరిక్షయము నందగల వని దిగువ ఉదాహరింపబోవు ముండకశ్రుతి చెప్పుచున్నది.

"భిద్యతే హృదయగ్రంథి, శ్ఛిద్యన్తే సర్వ సంశయాః.
క్షీయన్తే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే."
— 2.2.8.

ఈ గ్రంథముచేత బ్రహ్మ భిన్నుడగు ఆత్మడు (జీవుడు) తన కంటె విశిష్టమగు బ్రహ్మము నెఱింగి కృతకృత్యుడగును కాబోలునని సందేహింపవలదు. స్వరూపలక్షణములచేత బ్రహ్మాత్మలకు అభేదమే సిద్ధమగుచున్నది. జగత్కారణత్వముచేతను, బ్రహ్మాత్మల జ్ఞానముచే కల్గు ఫలము నైత మొక్కటే యగుట చేతను అభేదమేకాని భేద మావంతయు కన్పట్టుట లేదు. సాధకుడు ఒకవేళ సందేహగ్రస్తు డగునేమోయని శ్రుతి మాత ఆత్మయే బ్రహ్మమను అంశమును కంఠతః వక్కాణించుచున్నది.

"స వా ఏష మహా నజ ఆత్మా
అజరోఽమృతోఽభయో బ్రహ్మ."

"బ్రహ్మైవేదం సర్వం."
"ఆత్మైవేదం సర్వం."
"అయ మాత్మా బ్రహ్మ."

మనో బుద్ధి చిత్తాహంకారముల కంటెను, దేహేంద్రియ ప్రాణములకంటెను, విలక్షణమును విభిన్నము అయి స్వయముగనే ప్రకా

శించుచు, స్వయం ప్రకాశకత్వము లేని దేహాదులను ప్రకాశింపజేసెడు ఈ ఆత్మయే బ్రహ్మము. అహంకారము కూడకాని కూటస్థచైతన్యము ఆత్మయనుటచేత, అంతఃకరణోపాధియందలి అభిమానముచేత ప్రాప్తించిన జీవత్వము సాధకునకు నివృత్త మగుచున్నది.

"ప్రజ్ఞానం బ్రహ్మ." — ఐతరేయోపనిషత్తు. 2. 7. 3.

అంతఃకరణవృత్తితో కూడుకొని యేచైతన్యము జ్ఞానేంద్రియముల ద్వారా వెలుపల వ్యాపించి, శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడి విషయములను తెలియుచున్నదో, అదియే ప్రజ్ఞానము. జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడవస్థలయందును, మూడు కాలములయందును ఏకరూపముగ ప్రకాశించు ఈ చైతన్యమే సర్వజీవుల అంతఃకరణోపాధుల యందును ప్రతిబింబించి జీవశబ్ద వాచ్యమైనదని చెప్పబడియుండెను. సృష్టిస్థితి లయములకు కారణభూతమైన ఈ ప్రజ్ఞానమే అఖండాద్వితీయ బ్రహ్మమని ఛాన్దోగ్య మనుచున్నది.

"స య ఏ షోఽణిమా. ఏత దాత్మ్య మిదం సర్వం,
తత్సత్యం స ఆత్మా — తత్త్వమసి." 6. 1.-7.

పూర్వము 'నే'నను శబ్దముచేత దేహేంద్రియప్రాణ మనోఽహంకారములకంటె వ్యతిరిక్తమైన ఏ ఆత్మ గ్రహింపబడినదో, ఆ ఆత్మయే ఇచ్చట "నీవు" అను పదముచేతను గ్రహింపబడినది. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్" అను శ్రుతిచేత చెప్పబడిన - సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమై నామరూపవివర్జితమై ఒప్పు సద్వస్తువు "అది" అనెడిమాటచే లక్షింపబడినది. ఈ రెంటికి ఐక్యము. అనగా "ఓ ఆత్మడా, అఖండాద్వితీయ సన్మాత్రుడవే నీవు"అని భావము. బ్రహ్మ మిద్దానికంటె వేఱుకాదు. కాన నీవు బ్రహ్మమవే యన్నమాట.

"బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీత్,
తదాత్మానమే వావేత్;
అహం బ్రహ్మాస్మి." — బృహదారణ్యకం.

సర్వ కాలములయందును, సర్వదేశములయందును, సర్వ వస్తువులయందును ఎడ, తెఱపి లేక వెలుంగుచున్న పరమాత్మయే మాయాకల్పితము లయిన శరీరములయందు సాక్షిభూతమై వెలుగుచు, 'నేను నే' నని వ్యవహరింపబడుచున్నది. ఇట్టి 'నేనే' సత్యజ్ఞానానంతమగు బ్రహ్మమను.

"ఏష మ ఆత్మా న్తర్హృదయే ఏత ద్బ్రహ్మ."
హృదయాంతఃస్థితమగు ఈ ఆత్మయే బ్రహ్మము.

"సర్వం ఖల్విదం బ్రహ్మ." — ఛాన్దోగ్యము 3.14.1

ఇంద్రియ గోచరమగు ఈ జగమంతయు బ్రహ్మమే.

"యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్
సూక్ష్మా త్సూక్ష్మతరం నిత్యం స త్వమేవ త్వమేవ తత్."
కైవల్యోపనిషత్తు. 16.

సర్వమునకు ఆత్మభూతమై విశ్వము తోచుటకు అధిష్ఠానమై (జగము పుట్టుటకు కారణమై) సూక్ష్మమునకన్నను సూక్ష్మతరమై, నిత్యమై ఏ పరబ్రహ్మతత్త్వము ప్రకాశించుచున్నదో ఆ బ్రహ్మము నీవే; నీవు ఆ బ్రహ్మమవే.

## అనుప్రవేశ రహస్యము.

ఈ ప్రకరణమున హృదయాంతస్స్థితమగు ఆత్మయే సాక్షాద్బ్రహ్మమనెడి విషయము స్వప్రమాణముగను, స్వానుభవముగను నిరూపింపబడినది. అనుప్రవేశతత్త్వమునుబట్టి చూచినను ఈ అంశ మింకను

సున్పష్టము కాగలదు. సృష్టికి కారణమగు మూలతత్త్వమేది కలదో అదియే ఈ శరీరమును సృష్టించి, అందు ప్రవేశించి జీవుడని పిలువబడు చున్నదని వేదములోని విశ్వోత్పత్తిసూక్తము లనుచున్నవి. ఋగ్వేద దశమ మండలములోని విశ్వకర్మసూక్తమునందు ఈ అనుప్రవేశతత్త్వము ప్రస్తావింపబడినది. దాని ననుసరించియే ఉపనిషత్తులు ఈ రహస్యమును విపులీకరించినవి -

''య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా న్యసీద త్పితా నః,
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛద వరా ఆవివేశ.''

— మండలం 10. సూక్తం 81. మంత్రం. 1

సంగ్రహముగా దీనితాత్పర్య మిది : ''ఏ విశ్వకర్మ ప్రళయకాలమున సమస్త భువనములను తనయందు ఆహుతిగా వేసికొని హరించి, సర్వజ్ఞుడై మనకు తండ్రియై ప్రకాశించెనో, ఆ విశ్వకర్మ పరమేశ్వరుడే జగద్రూప భోగముకోసమై సంకల్పమాత్రముచేత సమస్తమును సృష్టించి, తనచే సృష్టింపబడిన శరీరముల హృదయపద్మములయందు జీవరూపుడై ప్రవేశించెను.'' అని వేదహృదయము ఈ మంత్రముచే తేటతెల్లమగు చున్నది. ఈ అంశమును ఉపనిషత్తులు ఇట్లు వివరించుచున్నవి. ఋగ్వేదము విశ్వకర్మ యని పేర్కొన్న జగత్కారణ వస్తువునే ఉపనిషత్తులు-

''ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్. నాన్య త్కించన మిషత్.
స ఈక్షత. లోకా న్ను సృజా ఇతి.''— ఐతరేయోపనిషత్తు 1.1

''సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్.''

— ఛాందోగ్యోపనిషత్తు. 6.2.1.

''బ్రహ్మైవేదం సర్వమ్.'' ''ఆత్మైవేదం సర్వమ్.''

ఆత్మ అనియూ, సత్తనియు, బ్రహ్మ మనియు పేర్కొన్నవి.

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః, పరమ చ్ఛద వరా ఆవివేశ."
అనేది వేదవాక్యమును ఉపనిషత్తు -

''సో౽కామయత. బహూః స్యాం ప్రజాయేయేతి.
స తపో౽ తప్యత. స తప స్తప్త్వా. ఇదం సర్వ మసృజత.
య దిదం కించ. తత్ సృష్ట్వా. తదేవాను ప్రావిశత్."
— తైత్తిరీయానందవల్లి. అనువాకం. 6.

తైత్తిరీయోపనిషదారంభమున ప్రస్తావింపబడిన ఆత్మ అనేకము కావల యునని కోరినది. జగదుత్పత్తికి ఆ ఆత్మ తపించి, ఈజగము నంతటిని సృజించినది. అట్లు సృష్టించి ఆ సృష్టింపబడిన దానియందు తానే అను ప్రవేశ మొనర్చినది. ఛాన్దోగ్యోపనిషత్తు కూడ ఈ అనుప్రవేశాంశమును ఇట్లు ప్రస్తావించినది-

''సేయం దేవ తైక్షత-హన్తాహ మిమా స్తిస్రో దేవతాః,
అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి.''
— 6. 3. 2.

''సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్'' అను వాక్యముచే చెప్పబడిన ఆ సద్రూపదేవత సర్వజీవ హృదయాంతరములందును అనుప్రవేశించి నామరూపములను వ్యాకరించినది. ఇట్లే బృహదారణ్యకోపనిషత్తుకూడ ఆ పరబ్రహ్మమే హృదయస్థుడైన ఆత్మఅని వక్కాణించుచున్నది -

''త ద్ధే దం త ర్హ్యవ్యాకృత మాసీ త్త న్నామరూపాభ్యా మేవ
వ్యాక్రియతా సౌ నామాయ మిదం రూప ఇతి.
తదిద మ ప్యేతర్హి నామరూపాభ్యా మేవ వ్యాక్రియతే౽
సౌ నామాయ మిదం రూప ఇతి. స ఇహ ప్రవిష్టః.'' —1.4.7.

నామరూపాత్మకమగు జగ మేర్పడకపూర్వము ఏసర్వశక్తి సర్వకారణమై నామరూపములను సృజించెనో, సర్వవ్యాప్తమగు ఆ శక్తియే నామరూపాత్మక

చరాచరములయందు జీవరూపమున ప్రవేశించెనని ఈ మంత్రమునకు తాత్పర్యము. శంకరులు "స ఇహ ప్రవిష్టః" అన్నమాటకు భాష్యము వ్రాయుచు ఇట్లన్నారు -

"యః కారణం సర్వస్య జగతో, యదాత్మకే నామరూపే సలిలాదివ స్వచ్ఛాన్మల మివ ఫేన మవ్యాకృతే వ్యాక్రియేతే; యశ్చ తాభ్యాం నామరూపాభ్యాం విలక్షణః స్వతో నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావః - స ఏషోఽవ్యాకృతే ఆత్మభూతే నామరూపే వ్యాకుర్వన్ బ్రహ్మాది స్తంబపర్యం తేషు దేహేష్విహ కర్మఫలాశ్రయే ష్వశనాయాదిమత్సు ప్రవిష్టః."

సమస్తమగు జగమునకు ఎవడు కారణమో, స్వచ్ఛమైన నీటినుండి నురుగు, బుడగలవలె ఎవనినుండి నామరూపములు యత్స్వరూపములై కలుగుచున్నవో, అట్లు కలిగిన నామరూపములకంటె విలక్షణుడై యెవడు నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావముతో తేజరిల్లుచున్నాడో వాడే బ్రహ్మాది స్తంబపర్యంతము కల దేహములయందు ఆ యా దేహాల కర్మఫలానుసారము ప్రవేశించినాడు.

ఇట్లనుటచేత ఏ వస్తువు ఈ చరాచరాత్మక జగత్తును సృష్టించెనో, ఆ వస్తువే అందు (చైతన్యస్వరూపముగా) ప్రవేశించినదని తేలినది కదా! కావున లోకములను సృజించిన లోకకర్తకు, అందు ప్రవేశించిన వానికి (జీవునకు) అభేదము పొసగుచున్నది. ఈ సందర్భమున ఉపనిషత్తు "తదే వానుప్రావిశత్" "అనుప్రవిశ్య" అన్నమాటలను వాడినందువలన దీనికి 'అనుప్రవేశ రహస్యము' అని పేరు కలిగినది. జీవబ్రహ్మల అభేదమునకును, వారి పరమైక్యమునకును ఇంతకన్న వేఱు ప్రమాణ మేమి కావలయును! ఇదియ బ్రహ్మాత్మైక్యావగతి రహస్యము!

# బ్రహ్మము - గుహ

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.
యోవేద నిహితం గుహాయాం."

— తైత్తిరీయానందవల్లి - 1.

పూర్వోక్తమైన యీ బ్రహ్మము గుహానిహితము. గుహయన పంచకోశముల సముదాయము. కత్తి ఆవరణమువంటి దగు ఒఱయం దుంచబడి యున్నట్లే, బ్రహ్మమును పంచకోశాత్మకమగు గుహయందు వినిహితము. ఒఱను తొలగించిన కాని దానికంటె వ్యతిరిక్తమగు కత్తి కానుపింపనట్లు, పంచకోశములను వేఱుపఱచుకొనుచు "నేతి నేతి" (ఇదికాదు ఇది కాదు) అనుచు పోయినకాని బ్రహ్మజ్ఞానము - బ్రహ్మ సాక్షాత్కారము కలుగదు. శరీరము, దానిని నిలిపెడు ప్రాణము, అంత రింద్రియమగు మనస్సు, బుద్ధిసంవేద్యమగు విజ్ఞానము, బుద్ధిప్రతిబింబిత మగు ఆనందము - అనునవి పంచకోశములు. ఈ పంచకోశముల కంటె వ్యతిరిక్తమయ్యు వీటితో తాదాత్మ్యమున వ్యవహరింపబడెడు ఆత్మయే బ్రహ్మము.

తల్లిదండ్రులచే భుజింపబడిన యన్నము రస, రక్త, మాంస, మేదో, ఒస్థి, మజ్జా, శుక్రములనెడి ఏడు ధాతువులుగా పరిణమించుచున్నది. అందు ఏడవ ధాతువగు శుక్రముయొక్క, శోణితముయొక్క (అనగా స్త్రీ పురుషుల శుక్ల రజస్సులలోని జీవ్సుయొక్క) సంయోగముచే దేహ

మేర్పడుచున్నది. అన్న పరిణామమగు ఈ శరీరమే అన్నమయకోశము. అన్నముచే పుట్టి అన్నముచే పెరిగెడు ఈ దేహము పుట్టకపూర్వమును, మరణించిన తర్వాతను ఉనికి లేనిదయి అత్యంతములు కలదగుటచేత అనాదియు, అనంతము అగు-బ్రహ్మమగుట సంభవము కాదు.

హృదయమున నుండి ప్రాణమను పేర వరగుచు, ముక్కులో సంచరించుచు, ప్రాణి యొక్క ఉనికిని ఎఱింగించుచు, సర్వశరీరము నందును వ్యానవాయు రూపమున పూర్ణమై శరీరమునకు వలసిన బలమును చేకూర్చుచున్న గాలియే ప్రాణము. ఇది ఇంద్రియములనుకూడ స్వస్వ వ్యాపారములందు సమర్థములగు నట్లొనర్చు శక్తిగల దగుటచేత కర్మేంద్రియములతో సంబంధము కలిగి ప్రాణమయ కోశమని చెప్పబడుచున్నది. శరీరేంద్రియములకు పాటవమును చేకూర్చునట్టి దయినను, చైతన్య ధర్మము లేని దగుటచేత ఇదియు బ్రహ్మము కానేరదు. మఱియు సూక్ష్మ శరీరము భంగమయిన యెడల ఈ కోశముకూడ నశించుచుండుటనుబట్టియు ఇది నశ్వరమే.

ఏ మనస్సు శరీరమే తానని అహంకారమును, ఇండ్లు, పొలములు, భార్యా పుత్త్రమిత్త్రాదులు మున్నగు వానియందు నావి అనెడి మమకార మును చూపుచు, సంకల్ప వికల్పములు ఒనర్చుచు, కామక్రోధాది వికార ములు కలదై ఒప్పుచున్నదో, అదియే జ్ఞానేంద్రియములతో సంబంధము కల మనోమయ కోశము. చపలస్వభావమును, వికారములును కలదగు ఈ మనస్సు నిశ్చలమును, నిర్వికారమును అగు బ్రహ్మము కాజాలదు. మఱియు సుషుప్తి సమాధ్యవస్థలయందు దీని ఉనికి లేమిచేతను, సూక్ష్మ శరీరభంగముతో ఇదియు భంగమగుటచేతను శాశ్వతమును కాదు.

సుషుప్తిలో విలయమును పొంది, జాగ్రదవస్థలో జ్ఞానేంద్రియ ముల ద్వారమున వ్యాపించుచు, చైతన్య ప్రతిబింబముతో కూడిన బుద్ధియే

విజ్ఞానమయ కోశము. ఈ బుద్ధికి సంకోచ వికాసములు కలవు. ఇట్టి సవికారమగు విజ్ఞానమయ కోశముకూడ నిర్వికారమగు బ్రహ్మ మగుట పొసగనేరదు కదా! ఇదియు సూక్ష్మశరీరముతో పాటు నాశము నందునదే.

వస్తుతః అంతఃకరణము ఒక్కటే అయినను నిశ్చయా నిశ్చయము లను ఒనర్చు ఈ బుద్ధి కర్తృత్వమనెడి వికారమును పొందుటచేత విజ్ఞాన మయ కోశమనియు, అట్టి బుద్ధికి సాధనముగా ఉండి సంకల్ప వికల్పము లొనర్చుచు కామక్రోధాది గుణములకు నివాసమై వెలయుచున్నది కావున మనస్సు మనోమయ కోశమనియు రెండు భేదములు సిద్ధించుచున్నవి. కర్త కంటె కరణము (సాధనము) వెలుపలి దగుటచేత విజ్ఞానము లోపలిదియు, మనస్సు వెలుపలిదియు అయి పృథక్త్వము ఘటిల్లుచున్నది.

ఈ మనోవిజ్ఞానములు కాక, అంతర్ముఖమైన ఒక బుద్ధివృత్తి ఆనందస్వరూపమగు బ్రహ్మముయొక్క ప్రతిబింబమును గ్రహించు చుండును. అదియే ఆనందమయకోశము. (కారణ శరీరము) ఆనందమయ కోశము పుణ్యఫలమును భోగించునప్పుడు అభివ్యక్తమగుచు, ఆ ఫల భోగము క్షయింపగనే నిద్రా రూపమున లయించుచుండును. ఇట్లు ఉత్పత్తి లయములు కలదై ఒకప్పుడు ఉండి, ఒకప్పుడు లేనిదగుటచేత ఈ ఆనందమయ కోశముకూడ నిత్యమగు బ్రహ్మము కాదు. అంతర్ముఖ మగు బుద్ధివృత్తి యందలి ఆనంద ప్రతిబింబమునకు కారణమై బింబ రూపమగు ఏ బ్రహ్మము కలదో, అదియే యథార్థవస్తువుకాని, ప్రతిబింబమే అది యగుట సమంజసము కాదు కదా! అద్దములోని మన నీడయే మనము కానట్లు, ప్రతిబింబరూప బ్రహ్మమును కేవల బ్రహ్మము కాకుం డుట సత్యము. మఱియు ఈ బింబమున కన్న ఆ ప్రతిబింబము వేఱుకు కాదు. అనగా బింబ ప్రతిబింబములకు ఐక్యమే కలదు సిద్ధించుచున్నది.

అవిద్యాపరికల్పితమయిన ఉపాధిప్రతిబింబము విద్యాప్రబోధము కలుగగనే కేవలాద్వైత బ్రహ్మముగ శేషించుచున్నది.

ఈ పంచ కోశములలో అన్నమయ కోశము స్థూలశరీరము. ప్రాణ, మనో, విజ్ఞానమయ కోశములు సూక్ష్మశరీరము. ఆనందమయ కోశము కారణ శరీరము. ఈమూడు మేనులును - స్థూలదేహము మొదలు విద్రయందలి ఆనందము వఱకును గల కోశములును బ్రహ్మము కావు. అంతమాత్రమున శూన్యవాదమని భ్రాంతి పడవలదు. శరీరము మొదలగు పంచకోశముల యొక్క తెలివి - అనుభవము ఒకటి మనకు వొడకట్టుచున్నది కావున, వాటిని అనుభవించెడి అవ్యక్తరూపుడే బ్రహ్మము; కాని ఇక్కడనే బుద్ధికి కొంత తికమక. వీటిని అన్నింటిని అనుభవించుచున్న ఒక వస్తువు వేఱుగా తెలియబడుట లేదే అని ప్రతివాదును ప్రశ్నింపవచ్చును. అట్టి పృచ్ఛకుడు వయితము అనుభవము గోచరమగుటచేత, వీటిని అనుభవించు పదార్థము ఒక్కటి ఉండవలయుననుటలో సందేహింపడు కాని, అట్టి పదార్థము ఏదో తెలియబడుట లేదనుటలోనే ఆతని శంక.

కాని అట్టి అనుభోక్త తెలియబడకుండుటయే మనకు కావలసినది. ఒక పదార్థము తెలియబడవలెనన్న, దానికన్న వేతై తెలిసికొను వస్తువు ఇంకొకటుండవలయును. జ్ఞానము చైతన్య లక్షణము కావున, ఆ తెలిసికొనువాడును చైతన్యాత్మకుడై తీరవలయును. అట్టి చైతన్యాత్మకుడగు ఎవ్వడు సర్వమును తెలిసికొనుచున్నాడో, అట్టివానిని తెలిసికొనవలయునన్నచో, వానికంటె వేఱుగ చైతన్య విశిష్టుడు ఇంకొకడు ఉండవలయును కదా. ఈ చైతన్యములో భేదముకాని, పృథక్త్వముకాని లేదని పూర్వము విస్తరముగ నిరూపింపబడినది. సర్వమును ఎఱింగెడి బ్రహ్మమునకన్న వ్యతిరిక్తమయి జ్ఞానశీలమును ప్రకటించు పదార్థము ఏదియు (బ్రహ్మము

యొక్క సజాతీయ భేదము) లేదే. ఇక అట్టి సర్వసాక్షియగు బ్రహ్మము తెలియబడుట ఎట్లు? కావున సర్వమును ఎఱింగెడివాడు తెలియబడుట లేదే యన్నచో, తెలిసికొనువాడు లేకపోవుటయే దా ని కి కారణమని గ్రహింపవలయును. బియ్యపు పిండి మొదలగు వాటియందు తియ్యదన మును చేర్చెడు బెల్లములో మాధుర్యమును వేఱొక వస్తువు సంక్రమింప చేయలేనట్లు, అన్నింటిని ఎఱింగెడు జ్ఞానస్వరూపమగు బ్రహ్మము నెఱుం గుటకును (బ్రహ్మజ్ఞానము తక్క) వేఱొండు సమర్థము కాదు. కావున స్వానుభవ రూపమగు బ్రహ్మమునకు ఇతరానుభవములతో పని లేదు; మఱి ఇది అనుభవ విషయమును కాదు. అనుభవ విషయ మగునది అనుభూతి కంటెను నియతముగా వేఱై ఉండ వలయును. అనుభవ విషయము కాక నిత్యానుభవ స్వరూపమై అలరు దానిని అనుభవించున దెవ్వరు?

కావున బ్రహ్మము దృగ్రూపము. బ్రహ్మభిన్నముగా తోచునదెల్ల దృశ్యము. దృక్కునకు గోచరమగునదే దృశ్యము. దృక్కు నయి తము దర్శనమను క్రియకు విషయమగుచో దృశ్యకోటిలో చేరవలసినట్లే. అన్నింటిని చూచెడు కంటిని చూచునట్టిది వేఱొకటి లేదు కదా? కంటితో చూడబడు వాటిని దృశ్యములనియు, వాటికి భిన్నమయి చూచునట్టి స్వభా వము గల కంటిని దృక్కనియు మనము వ్యవహరించు చున్నాము. జగ ద్బ్రహ్మముల విషయమునను ఇదియే పోలిక. బ్రహ్మము దృగ్రూప మైనది. ఆ దృక్కునకు గోచరించు జగమంతయు దృశ్యరూపమైనదే; ఇక్కడి దృశ్యశబ్దమునకు కంటితో చూడబడు పదార్థమే అని అర్థము కాదు. అట్లైన కంటికి కనబడక ఇతరేంద్రియములకు గోచరములగు విష యములును, మనోబుద్ధ్యాదులును, వాటి వృత్తులును దృశ్యములు కాక పోవలసివచ్చును. సర్వద్రష్టయగు బ్రహ్మమునకు మనోబుద్ధ్యహంకార ములు కూడ విషయము లగుచున్నవి కావున, దృశ్యా దృశ్యమగు జగ

త్తంతయు బ్రహ్మమునకు గోచరించునదే; విషయమగునదే. మనోబుద్ధ్యాదులు సంకల్ప విశ్చయాదులను చేయునప్పుడును, ఏమియు చేయకయున్న వేళను బ్రహ్మము వాటిని ఎఱుంగుచునే ఉన్నది. జాగ్రదాది సర్వావస్థల యందును కల అంత ర్బహి ర్వికారముల కన్నింటికిని సాక్షిరూపమై బ్రహ్మ మొక్కఁడే తేజరిల్లుచున్నదనియు, తద్వ్యతిరిక్తమగు దృశ్యము సంభవ వినాశాది దశలను బొందుచు నశ్వర మగుచున్నదనియు పూర్వ గ్రంథమున నిరూపిత మైనది. కావున అన్నింటిని చూచు కంటిని చూచుటకు ఇంకొక వస్తువులేనట్లు, సర్వమును ఎఱింగెడు బ్రహ్మము నెఱుంగుటకును వేఱొకటి లేదు. అందుకే—

"యే నేదం సర్వం విజానాతి,
తం కేన వి జా నీ యాత్ ?
విజ్ఞాతార మరే కేన విజానీయాత్ ?"

— బృహదారణ్యకోపనిషత్తు. 2.4.14.

దేనిచేత సర్వమును ఎఱుంగుచున్నాడో, అట్టిదానిని ఇంక దేనిచే ఎఱుంగ గలడు ? సర్వద్రష్టయగు జ్ఞాతను దేనిచే తెలిసికొన గలడు ? అని శ్రుతి నుడువుచున్నది. అనగా ఆ సర్వద్రష్టకంటె, సర్వజ్ఞాతకంటె వేఱైనది ఏదియు తెలిసికొనునది లేదని స్పష్టమగుచున్నది.

"స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా."
"అన్యదేవ తద్విదితా దథో అవిదితా దధి."

ఆ బ్రహ్మమే అన్నింటిని ఎఱుంగుచున్నది; దానిని ఎఱుంగునది ఏదియు లేదు. ఈ బ్రహ్మము జ్ఞానవిషయ మయి తెలియబడుదానికంటెను, అజ్ఞానముచే ఆవరింపబడి తెలియబడని దానికంటెను విభిన్నము; విలక్ష

ణము. అనగా జ్ఞానస్వరూపమగు ఇది, జ్ఞానముచే తెలియబడుదానికంటెను అజ్ఞానావృతమయి తెలియబడని దానికంటెను విభిన్నమే కదా :

"నాన్యోఽతోఽస్తి ద్రష్టా.
నాన్యోఽతోఽస్తి మంతా.
నాన్యోతోఽస్తి విజ్ఞాతా."

ఈ బ్రహ్మమునకంటెను వేఱుగా చూచువాడును, భావించువాడును, తెలిసికొనువాడును లేడనియే పై శ్రుతి సిద్ధాంతరూపముగ వక్కాణించుచున్నది.

ప్రపంచమున మానవునకు సులభముగ బ్రహ్మాస్తిత్వ విజ్ఞానము, బ్రహ్మోపలబ్ధి కలుగుటకు చిన్న సూత్ర మొక్కటి కలదు. ప్రాణికి ఏ యే వస్తువులయందు జ్ఞానస్ఫురణము కలుగుచున్నదో, ఆ యా పదార్థములను వదలి వాటిని గ్రహించు తెలివి (జ్ఞానము) ని మాత్రము స్వీకరించినచో, సర్వవిషయము లందును వ్యాపించు ఆ జ్ఞానస్ఫురణమే బ్రహ్మమని ఎఱుంగ వచ్చును. ఈ విధముగ పంచకోశములను నిరాకరించి, ఆ గుహలో నిహితమగు సాక్షిమాత్ర బ్రహ్మమును ఎఱింగి అనుభవించి బ్రహ్మ స్వరూపుడై బ్రహ్మానందము నందుటే జీవిత ప్రయోజనము.

ఈ విధమైన బ్రహ్మమును ఎవ్వడు లేదనునో అట్టివాడు తనను తాను 'లే' దను నట్టి మూర్ఖుడే కాని, ఆత్మాస్తిత్వమును ఎఱింగిన విద్వాంసుడు కాడు. ఈ అర్థమును తైత్తిరీయము చక్కగా వాకొనుచున్నది.

"అసన్నేవ స భవతి, అస ద్బ్రహ్మేతి వేద చేత్.
అస్తి బ్రహ్మేతి చే ద్వేద, స న్తమేనం తతో విదు రితి."

— ఆనందవల్లి. 6.

ఈ నిరూపణముచేత "దేవుడు లేడనువాడు తన్ను కూడ లేనివాని గనే భావించువాడే" అను నర్థము సిద్ధమగు చున్నది.

ఉన్నదగు ఈ బ్రహ్మమును ఎట్లున్నదని ప్రశ్నించుటకును వీలు లేదు. కారణ మేమన? కన్నుల కగపడుదానిని ఇట్టిదని చెప్పవచ్చును. బ్రహ్మము కంటి కగపడమిచే ఇట్టిదనుటకు వీలులేదు. దూరముగా ఉన్నదానిని (పరోక్షమును) అట్టి దని నిర్దేశింప వచ్చును. బ్రహ్మము తానే అగుటచే, దూరమున లేకపోవుటచే అట్టిదని చెప్పుటకును అవకాశము లేదు. కాబట్టి ఇట్టి దట్టి దని చెప్పుటకు అలవికానట్టిదే బ్రహ్మము. పోగా ఇక దీనిని సత్యజ్ఞానానంత లక్షణముచే మాత్రమే ఎఱుంగవలెను.

త్రికాలాబాధ్యమగు ఈ బ్రహ్మము జగమువలె ఆద్యంతములు లేనిదై ఎల్లప్పుడు ఒప్పుచున్నది కావున సత్యము. స్థూల సూక్ష్మ కారణ శరీర రూపమగు ఈ జగము సమాధియందు లయించుచున్నదనియు, అప్పుడును జాగ్రత్స్వప్న సుషుప్తులయందును బ్రహ్మము ఉండియే యున్నదనియు చెప్పబడియుండెను, దృశ్యమగు సర్వమును నిషేధించుచు పోగా, చివరకు అజ్ఞానమును - శూన్యమును గ్రహించు బ్రహ్మము కలదుగాని లేకపోలేదు కదా? దీనిచే సత్తామాత్ర లక్షణము సిద్ధము.

సర్వమును ఎఱుంగుపట్ల జ్ఞానరూపము కలదని చెప్పుటచేత, దృశ్యమును ప్రకాశింప చేయుట యనెడి చిత్స్వభావమే బ్రహ్మమునకు జ్ఞానస్వరూపమనుట సుప్రసిద్ధము.

"నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మమ్." - ముండకం. 1.1.6

ఆకాశమువలె సర్వవ్యాపక మగుటచే బ్రహ్మము ఒక తావున ఉన్నది, వేఱొకచోట లేదు అనుటకు వీలులేదు. సూక్ష్మమగు ఆకాశము

వకును అవకాశము నొసంగుచు అంతటను నిండి వెలుంగుచున్నది. కావున ఒక ప్రదేశముచేత బ్రహ్మము పరిచ్ఛిన్నము కాదు.

"నిత్యోఽ నిత్యానామ్." — కఠవల్లి. 2.5.13.

అనుటచేత అనిత్యములగు దేహాదులయందును నిత్యమై మూడు కాలములయందు ఉండునదియై అలరారుటచేత ఒక కాలమున ఉన్నది, వేఱొక కాలమున లేదు అనుటకు వీలులేదు. ఇప్పట్టున జీవుడు దేహాంతర గతు డయినప్పుడు ఇక్కడ చచ్చిపడియున్న స్థూలదేహమున ఆత్మ లేదు కదా అందురేమో? అట్లు కాదు. ఆత్మ అన్నింటియందును కలదు. స్థూలము తమోమయ సృష్టి యగుటచేత, దానియందు ఆత్మప్రతిబింబము లేకపోయినది గాని, ఆత్మ లేకపోలేదు. స్థూలమునం దుండి, ఆత్మప్రతిబింబమును గ్రహింప సమర్థమైన సాత్త్వికోపాధి (సూక్ష్మశరీరము) యే ఇప్పుడీ మృతదేహమునుండి తిరోహిత మైనది. జీవాజీవ వ్యవహారము, చేతనాచేతన భేదమును ఆత్మప్రతిబింబమునుబట్టి కలిగినది కాని, కేవలాత్మను బట్టి కలుగలేదని ఇదివఱకే పలుతావుల ప్రతిపాదింపబడినది. కావున కూటస్థాత్మ అంతటను కలదు. దాని ఆభానము సాత్త్వికోపాధులయందు మాత్రమే అనుట పరమార్థము.

"బ్రహ్మైవేద మమృతం. పురస్తాద్బ్రహ్మ. పశ్చాద్బ్రహ్మ.
దక్షిణత శ్చోత్తరేణ. అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్ఠమ్." — ముండకం. 2. 11.

అనుటచే ఇది ఒక వస్తువునందున్నది, ఒండొక దానియందులేదు,ఒక దిక్కునందున్నది, ఇంకొకదిక్కునందు లేదు అనుటకు వీలులేక, సర్వ వస్తువులయందును, సర్వమునందును, బాహ్యాభ్యంతరములం దంతటను నిండి ఉన్నది. కావున, దిగ్దేశ కాల వస్తువులచే పరిచ్ఛిన్నము (విభజింప

బడినది - హద్దు పెట్టబడినది) కాక వెలుంగు బ్రహ్మమునకు అనంతత్వము కూడ సిద్ధమైనది.

శబ్దబ్రహ్మ విదుడగు భర్తృహరికవి దిక్కాలాద్యనవచ్ఛిన్నమగు ఈ బ్రహ్మతత్త్వమును ఈ క్రింది విధమున స్తుతించినాడు-

"దిక్కాలా ద్యనవచ్ఛిన్నా నన్త చిన్మాత్ర మూర్తయే
స్వానుభూ త్యేక మానాయ నమ శ్శాన్తాయ తేజసే."

దేశము, కాలము మున్నగువానిచే పరిచ్ఛిన్నముకాక అనన్తమును, చిదేక రస స్వరూపమును అయి, స్వానుభవమే ప్రమాణముగాకల ప్రశాన్తమగు వెలుగునకు నమస్కారము.

అఖండమగు ఈ అక్షర పరబ్రహ్మమును ఉపనిషత్తులు ఒక్కొకచో నిషేధముఖమున బోధించుచున్నవి -

"స హోవాచైత ద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివద న్త్యస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽ వా య్వ నాకాశ మసంగ మరస మగన్ధ మచక్షుష్క మశ్రోత్ర మవా గమనోఽ తేజస్క మప్రాణ మముఖ మమాత్ర మన న్తర మబాహ్యమ్. న త దశ్నాతి కించన; న త దశ్నాతి కశ్చన."

— బృహదారణ్యకోపనిషత్తు. 3-8-8

ఈ వాక్యముచే భూతభౌతిక గుణవికారములు, స్థూలత్వాణుత్వాది ధర్మములు, తమస్తేజః స్వభావములు, బాహ్యాంతర్భేదములు మొదలగునవి లేని అఖండాద్వితీయమగు వస్తువే బ్రహ్మ మనుట ఉపనిషత్తు యొక్క హృదయము.

"యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః
శ్రోత్రం తదపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం,
తదవ్యయం త ద్భూత యోనిం పరిపశ్యన్తి ధీరాః"

— ముండకోపనిషత్తు 1-1-6.

జ్ఞానేంద్రియములకు గోచరము కానిదియు, కర్మేంద్రియములచే పట్టు పడనిదియు, వంశము లేనిదియు, బ్రాహ్మణాది వర్ణ భేదములు కాని, ఎఱుపు మొదలగు రంగులు కాని లేనిదియు, నామరూపములను గ్రహించు సాధనములగు చెవి, నేత్రము లేనిదియు, పాణి పాదములు లేనిదియు, (అనగా సర్వేంద్రియ వర్జితమని భావము) నిత్యమును, సర్వ వ్యాపియు, అంతట ఉంతునదియు, మిక్కిలి సూక్ష్మమును, నాశరహిత మును అగు ఏ తత్త్వము కలదో: దానినే సర్వభూతముల పుట్టుకకు కారణమైన దానినిగా వివేకులు ఎఱుంగుచున్నారు.

ఇట్టి అఖండబ్రహ్మముతక్క వేఱొకటి కలదని భావించు మందుడు నానాకర్మవాసనలకు వశుడై చావు పుట్టుకల నందునని "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అను శ్రుతి పలుకు చున్నది. తోచెడి భేదమంతయు, జగమంతయు సంసారులను ఉద్ధరించు టకు వ్యావహారికముగ మాత్రమే అంగీకరింప బడినదికాని, పరమార్థమున ఒక్క బ్రహ్మమే ఉన్నవస్తువు. ఇట్టి బ్రహ్మమునకు జీవత్వ - ఈశ్వ రత్వములను మాయా కల్పితములే. అనగా ఉపాధులమబట్టి కల్పింప బడినవే. ఎట్లన :

మట్టియందు కుండగా పరిణమించు శక్తి అనాదిసిద్ధమయి యుండి కుండకు కారణమయినట్లే, బ్రహ్మము నందును జగత్కారణమగు ఆత్మ శక్తి అనాదిగానుండి ప్రపంచమును తోపింపచేయుచున్నది. మృత్తుకంటె

కుండ భిన్నము కానట్లు, బ్రహ్మమునకంటె ఈ శక్తియు వేఱు కాదు. బ్రహ్మమును విడిచిన దీనికి ప్రత్యేకమగు ఉనికి లేదుకదా ! బ్రహ్మమున గల లక్షణములగు సచ్చిదానందములకు విపరీత లక్షణములగు అసత్యము, జడము, దుఃఖము స్వరూపముగాగల జగమునకు ఉపాదానకారణమగుట చేత ఈ మాయాశక్తి బ్రహ్మమునకంటె వేఱు కాదనియు చెప్పుటకు వీలు లేదు. అట్లయ్యును ఆత్మజ్ఞానము కల్గగనే ఇది నాశమయి అఖండాద్వితీయ బ్రహ్మము మాత్రమే శేషించు చున్నది కావున, ఈ మాయ యుక్తిదృష్టిని బట్టి చూచిన అనిర్వచనీయ మనియు, అనుభవమునుబట్టి చూచిన తుచ్ఛ మనియు చెప్పబడుచున్నది. ఈ బ్రహ్మశక్తి త్రిగుణాత్మకము. ఇది జడ మయ్యును చిచ్ఛాయ దీనియందు ప్రతిఫలించుటచేత చేతనమై ప్రకాశించు చున్నది. ఈ శక్తిచేతనే ఆకాశాది భూత భౌతిక పదార్థములన్నియు తమ తమ ధర్మములను అతిక్రమింపక ప్రవర్తింప గలుగుచున్నవి. సర్వవస్తు నియామకమగు ఈ శక్తియే లేకున్న జగము విప్లవము పాలయ్యేదిదే. ఈశక్తియు అవ్యక్తమే అయినను వస్తు ధర్మముల నియమమును అతి క్రమింపకున్నవి కావున, అవంచమయకోశము మొదలు సర్వపదార్థ ముల యందును ఈ శక్తి నిగూఢమై ఉన్నదని ఎఱుంగవలెను.

ఈ శక్తియను ఉపాధి యొక్క సంయోగముచేతనే శుద్ధ బ్రహ్మము ఈశ్వరు డనియు చెప్పబడుచున్నాడు. ఆ బ్రహ్మమే పంచ కోశములనెడి ఉపాధియందు ప్రతిఫలించుటచేత జీవుడనెడి వ్యవహారము కలిగినది. అనగా, మాయాశక్త్యుపాధికుడు ఈశ్వరు డనియు, కోశోపాధి కుడు జీవు డనియు సారాంశము. ఒక్క బ్రహ్మమునకే భిన్నములగు ఉపాదుల సంయోగముచేత ఈశ్వరత్వము, జీవత్వము సిద్ధించినవి. ఇది విరుద్ధము కాదు. ఒక్క రాముడనెడి వ్యక్తియే కుమారునికి తండ్రియు, మనుమనికి తాతయు అగునట్లు ఈ బ్రహ్మమును ఒక్కడే అయినను

జీవుడును ఈశ్వరుడును అగుట విరుద్ధము కాదు. మాయాశక్తి - కోశో పాదులు రెండును లేనపుడు బ్రహ్మమునకు ఈశ్వరత్వమును లేదు, జీవత్వమును లేదు. పుత్త్రుడుగాని, పౌత్త్రుడుగాని లేనప్పుడు రామయ్య తండ్రిగాని, తాతగాని అగుటయే లేదు కదా! కావున తోచుచున్న జీవ త్వము ఉపాధి కల్పితమే కాని వేఱుకాదు. ఇక ఈ ఉపాధియో, మాయా కల్పితము. మాయ అస్వరూపమనియు, అనుభవజ్ఞానముచే నశించున దనియు పూర్వగ్రంథమున విస్పష్టమైనది.

కావున పరమార్థమున అద్వయానంద స్వరూపు డగు తనకు సద్వయత్వము, దానిచే కల్గిన దుఃఖమును లేనే లేవు. లేవు కావుననే నిత్య ముక్త స్వభావము చెల్లుచున్నది. యథార్థముగనే సద్వయత్వము, బంధము ఉన్నచో అది ఎన్నటికిని అద్వైత స్వరూపమున తేజరిల్లు టకును, ముక్తస్వభావమున వెలుంగుటకును అవకాశమే లేకపోయెడిది. ఎవ్వడీ విధమున అఖండాద్వైత బ్రహ్మజ్ఞానమును పడయునో, అట్టి బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే కదా! వానిని మాయకాని, మాయాకల్పితమగు నామరూపాత్మక ప్రపంచముగాని బాధింప జాలునా? యథార్థము ఆలోచిం చిన బాధింప నేరదుకాని, ఆ యథార్థదృష్టి చేకూరి అపరోక్షానుభూతి సిద్ధించుటలోనే - మాయను వదలించుకొనుటలోనే ముముక్షువుయొక్క ప్రజ్ఞ, ధీరత వికసింప వలసి యున్నవి. ఇదియే దుర్లభము. ఇందుకు కావలసినది సాధారణ జీవితమునుండి మార్పు. విద్యాఽవిద్యలు తేజ స్తిమిరములవలె సంబంధము లేనివి అగుటచే ఊహింపనలవిగాని ఈ మార్పు జీవితములో తప్పనిది.

---

# సచ్చిదానంద జీవనము

—

"అసతో మా సద్గమయ"
"తమసో మా జ్యోతి ర్గమయ"
"మృత్యో ర్మా అమృతం గమయ."

— బృహ.... 1.3.28.

సర్వసాధారణముగ మానవజీవితము భూతభౌతికములందు ఆధారపడియుండును. నరుడు దేహమునందు, ఇంద్రియములందు, ప్రాణమునందు, మనస్సునందు ఆధారపడి బ్రతుకుచుండును. దేహేంద్రియ ప్రాణ మనోవృత్తులు స్థూలములును, దృశ్యములును, ఆపాత మధురములు అగుటచే, అందు సులభముగా ప్రతిప్రాణియు తగుల్కొనుచుండుట వింత కాదు. అదియునుగాక, మనుజుని బాహ్య జీవితయాత్ర వీటిని వీడిన సాగదు కనుక, ఈ జీవనములో మాధుర్యమున్నను, లేకున్నను ఉన్న తియ్యదనమునే గొప్పదిగ భావించి అనుభవించు అవస్థయు పరిపాటియై పోయినది. శరీరేంద్రియ ప్రాణ మనస్సులపై కేంద్రీకృతమైన మానవ జీవితమును విజ్ఞానము మీదికిని, సచ్చిదానందముల మీదికిని సముద్ధరించుకొనుటకే దేహియొక్క నిరంతర యాత్ర. స్థూలమును, జడమును అగు ఈ బాహ్య జీవిత లీల కంతటికిని సూక్ష్మమును, సుందరమును అగు సచ్చిదానందము మూలకంద మగుటచే, అందలి జీవితము దీవితన్న ప్రజ్వలమును, దుఃఖదూరమును, ఏకత్వ సత్యత్వ శివత్వ విశిష్టమునై పరగుచున్నది.

శరీరేంద్రియ మనోజీవనములు ద్వైతశాంతి-ద్వైతానందములతో కూడుకొని యున్నవి. కర్తృ కరణ కార్యములున్న గాని, ఈ ద్వైత సౌందర్యము బుద్ధిగోచరము కాదు. ఒక భోక్త ఒక మనస్సను సాధనముతో ఇంద్రియముల ద్వారమున ఇంకొక దానిని తాకిన గాని ఇట ఆనందమును అందలేదు. కావున ఇచ్చట భోగ్యపదార్థముల బాహుళ్యము అనివార్యము. ఈ భోగ్యజాతమంతయు నియతి సుఖప్రదము గాని, నియత దుఃఖప్రదముగాని కాకుండుటచేత, దేశ కాలావస్థలను అనుసరించి ప్రాణికి ఒకప్పుడు సుఖమును, ఒకప్పుడు దుఃఖమును, ఒకప్పుడు రాగమును, ఒకప్పుడు ద్వేషమును, ఒకప్పుడు ఔదాసీన్యమును కలిగించుచున్నది. కావున భూత భౌతికములయందలి, దేహేంద్రియముల యందలి జీవితము క్లిష్టమై మానవుని శాంతికిని, ఆనందమునకును నియతత్వమును గాని, నిత్యత్వమునుగాని సంపాదింప లేకున్నది. ఇట్టితటి ఈ శరీరేంద్రియ ప్రాణ మనో బుద్ధి వృత్తులు కారణముగా భోగ్యవస్తువుల సంయోగ వియోగములందును, అనుకూల్యానుకూలతల యందును, సుఖ దుఃఖములు, శోక మోహములు తప్పవివి. కావున ఇచ్చట ద్వైతము, నానాత్వము, పృథక్త్వము, భేదము, అశాంతి మొదలగు భీభత్స భయానక విషయములును, వాటి కార్యములును సంసిద్ధములే.

మానవుని విజ్ఞాన జీవనమున ఈ అలజడి కొంతవఱకు తగ్గును. సుస్థిర శాంతికి, ఏకత్వానందమునకూ, నిర్మల తత్త్వ మార్గమునకూ పయనించు ప్రయత్నమును విజ్ఞాన భూమికలో పొడగాంచ గలము. పూర్వపు స్థూలజీవితము నందలి వాసనల ప్రకోపముగాని, శోకమోహముల సంతులతగాని ఇచ్చట ఉద్వేగమును కలిగింప జాలవు. ఇంచు

మించుగ వాటికి ఈ జీవనము ప్రశమకారణ మగుటచేత, వాటి ఆటోప ములు చల్లాఱి ఒక భద్రస్థితికి అవి చేరుకొనును.

ఇంతకన్నను సచ్చిదానందముల మీది జీవనము మహత్తరమైనది. కేవలుడగు తనయందే తాను జీవించు ఈ జీవితము సర్వ స్వతంత్రము. పారతంత్ర్య గంధము అచ్చట లవలేశ మేని ఉండదు. ఆత్మవశము సర్వము సుఖము కావున, ఇది నిరుపప్లవ నిత్యసుఖ సర్వస్వము॥ త్రికాలములయందు ఏకమాత్ర మగు సత్త (ఉనికి) అఖండ చిత్స్ఫురణ, నిర్వికల్పానందఘనత-ఇవియే ఈ జీవితమున తోచునవి. సాధనములు గావి, సాధకులుగావి, సాధ్యములుగాని అవియే. కర్తృ కరణ కార్యముల ద్వైతముగావి, భోక్తృ భోగ్య భోగముల నానాత్వము గాని ఇట లేదు. ఇట సర్వమును అఖండాద్వైతమే; అద్వితీయ నిత్య పరిపూర్ణమే. ఇది ఎల్లప్పుడు తనయందే తనతో రతి, తనయందే తనతో క్రీడ, తనయందే తనతో నిరంతర నిరతిశయ సంతృప్తి. ఇచ్చట చూచువాడును, చూడ బడువదియు లేదు; సర్వమును దృగ్రూపమైన సచ్చిదానందమే; సత్య జ్ఞానానన్తమైన బ్రహ్మమే। ఇటనే ప్రత్యక్పరతత్త్వములకు ఐక్యము॥ బింబ ప్రతిబింబములకు సమ్మేళనము॥॥ అనాద్యవిద్యా విస్మృతికి ప్రబోధము, ప్రత్యభిజ్ఞ. దీనిని ఇంక విపరించి తెలిసికొందము.

రక్తమాంస మయమగు శరీరమునకన్న, ఆ దేహమును, ఇంద్రియములను బలిష్ఠములను చేయు ప్రాణశక్తి దొడ్డది. శరీర ప్రాణముల కన్న ఇంద్రియములు సూక్ష్మములు, నిర్మలములు. వాటికన్న అంతరింద్రియమగు మనస్సు సుసూక్ష్మమును, వినిర్మలమును అయి యున్నది. మనస్సునకన్నను, మనోవృత్తుల కన్నను బుద్ధియు, బుద్ధివృత్తులును దొడ్డవి. ఇంతవఱకు వర్ణింపబడిన ఈ సాధన సామగ్రి అంతయు జడభూతమే. స్వతః స్ఫురణము వాటికి లేదు. అతి సూక్ష్మములయు,

సువినిర్మలములును అగు అంతఃకరణ వృత్తులయందు చైతన్యము ప్రతిబింబింపగా ఆ మనోబుద్ధి వృత్తులకు బాహ్యములగు శబ్దాదులును, ఆంతరికములగు రాగలోభాదిగుణములును విషయము లగుచున్నవి. నానా విధములగు అంతఃకరణ వృత్తులను, వాటి ద్వారమున ఇంద్రియ విషయములను వెలిగింప జేసెడి అఖండ చైతన్యమునందు జీవించుట (ఉండుట) యే సచ్చిదానందముల మీదికి జీవితమును కేంద్రీకరించుట. ఇది మిగుల సూక్ష్మతమమగు జీవనస్థితి. ఏ యధిష్ఠాన చైతన్యమును ఆశ్రయించి, మనోబుద్ధ్యహంకారాది వృత్తులు స్థూలమగు శరీరేంద్రియ జీవనమును కొనసాగించుచున్నవో, అట్టి సర్వాశ్రయ భూతమైన నిర్వికల్ప నిత్య వస్తువునందు నిరంతరస్థితిని సంపాదించుట-ఈ భూత భౌతికములకు-ఆంతరికమగు సూక్ష్మాతిసూక్ష్మ వృత్తి ప్రణాళికకు కడుదూరము. వృత్తులే సూక్ష్మములైన, వాటియందు ప్రతిబింబితమై వాటిని, వాటి ద్వారమున బాహ్యాంతరములను ప్రకాశింపజేయు చిత్సత్త ఎంత సూక్ష్మమును అవ్యక్తమునో చూడుడు. ఈ అవ్యక్తత ఇంద్రియములకు గోచరము కాని స్థితియేకాని, స్వతః అభివ్యక్తి మాత్రము దానికి నిత్యసిద్ధమే, సార్వకాలిక స్వభావమే.

కావున ఈ జీవితమున మన స్థితి అంతయు అంతర్ముఖమై పోవుచున్నది; బాహ్యములగు భూతభౌతికములను, శరీరేంద్రియ ప్రాణ మనోబుద్ధ్యహంకారములను, చిత్తవృత్తులను కూడ దాటిపోయి కొందొక అతీతస్థితికి చేరుకొనుచున్నది. అంతరికమగు ఈ ప్రయాణము సాగిన కొలదిని బాహ్యజగము దూరదూరము. కాని, జనునియొక్క ఈ అంతర్జీవనమున సాధకములకన్న బాధకములే యెక్కువ. ఎంతెంతగా ఈ లోపలి ప్రయాణము సాగుచుండునో అంతంతగా వెలుపలినుండి ఆక్రమణలు, ఆకర్షణలు, ఆఘాతములు హెచ్చుచుండును. చిరకాలిక వాసనలు వెలుపలి

ఇక నాల్గవ దే విజ్ఞానమయ జీవనము. ఇందు బుద్ధికిని జ్ఞానేంద్రియ సముదాయమునకును సంబంధము. ఈ జీవనములో మనస్సు బుద్ధికి బంటు మాత్రము. రజ స్తమముల ఆటోపములు చల్లారి, సత్వమునకు మాత్రము ఇందు ప్రాధాన్యము కాంచనగు. ఇందు కృతకృత్యత కొంత మందికి మాత్రమే. పెక్కురు మనోమయ జీవన పరీక్షలోనే పతితు లగుదురు. అందు నెగ్గినను ఇచ్చట గెలుపొందుట మిక్కిలి కష్టము. తరువాతిది ఆనందమయ జీవనము. ఈ జీవనమున అలజడు లన్నియు తగ్గి, కేవల సత్వముమాత్రము ఉండి ప్రకాశించు చుండును. ఇందు పరిశుద్ధమగు కేవలాంతఃకరణము మాత్రము ఉపకరణ భా వ ము ను పడయును. సోపానక్రమమునసాగు ఈ జీవనస్థితిలో మనో విజ్ఞానానంద మయ జీవనములను గూర్చి చెప్పవలసినది, చేయవలసినది వి స్తరముగ కలదుకాని, అది సాధనవిషయమును, యోగసంబంధమును అగుటచే ఇచ్చట సూచితమయి వి స్తరము విరమింప బడినది. ఈ త్రివిధ జీవనములయందు సంశుద్ధి కలిగిన పిమ్మటనే సచ్చిదానంద జీవనమునకు అర్హతయు, అధికారమును కలిగి అది ఆరంభమగును. ఇందు పోనుపోను జీవనము అంతర్ముఖ మగుచుండుట గమనింప దగినట్టిది.

ఈ లోపలి ప్రయాణమును ఎడతెగక సాగించుటకు ఆత్మ విస్మృతి నుండి మేలుకొనుటయే సూటియగు ఉపాయము. ఈ ప్రబోధము కలుగనిది పయనము ఆరంభముకాదు; సాగదు. దేహాత్మభ్రాంతి, అది కారణముగా కలిగిన వాసనా జాలములు, ఆవరణములై ఆత్మను కప్పివేసి యున్నవి. ఈ పొరల నన్నింటిని ఒకటొక్కటిగా తీసివై చిన గాని, సత్యాత్మ ప్రబోధము కలుగదు. ఆ త త్త్వమును ఆవరించియున్న ఈ పొరలనే సాంఖ్యులు (వేదాంతులుకూడ) చతుర్వింశతి త త్త్వము లనియు, పంచకోశములనియు, మూడు శరీరము లనియు చెప్పియున్నారు. పైవి

తెలిపిన ఆవరణరూప ప్రతిబంధములచే ఆత్మతత్త్వము ఉండియు లేనట్లు భాసించుచున్నది. సాధకుడు పదునుగల విజ్ఞానఖడ్గముచేత ఆత్మ నావరించి యున్న పొరలను వరుసగా భేదించుచు వచ్చిన చిట్టచివఱకు భేదింప వీలుగాని సత్తా మాత్రమగు పదార్థము చిక్కగలదు. అప్పుడు ఆత్మ స్మృతియే కాదు, ఆత్మసాక్షాత్కారమును కలుగును.

ఆవరణములను భేదించి ఆత్మసాక్షాత్కారమును కలిగించుకొనుటకు అనుష్ఠింపదగినది ఉపనిషత్ప్రతిపాదితమగు ఆధ్యాత్మయోగమే. అధ్యాత్మయోగసిద్ధుని శోకమోహరహితమగు సర్వాత్మభావమును 'ఈశావాస్యము' ఈరీతిగ వర్ణించుచున్నది:

''యస్తు సర్వాణి భూతా న్యాత్మన్యే వానుపశ్యతి,
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే. 6.

యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మై వాభూ ద్విజానతః
తత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మనుపశ్యతః ।'' 7.

ఎవడు అవ్యక్తము మొదలుగా గల చరాచరాత్మకములగు సర్వభూతములను ఆత్మయందే ఉన్న వానినిగా కాంచుచున్నాడో, అనగా వానికి ఆత్మయే ఆధారమనియు, వస్తుతః ఆత్మకంటె అవి భిన్నముగ లేవనియు ఎఱుంగుచున్నాడో; మఱియు సర్వభూతములయందుగల ఆత్మనే తన్నుగా తెలియుచున్నాడో, అట్టి పండితుడు దేనినిగాని అసహ్యించుకొనలేదు. తన శరీరేంద్రియ సంఘాతమునకు ఆత్మభూతుడై తానెట్లు ప్రకాశించుచున్నాడో, అవ్యక్తాది స్థావరాంతములకును తానే ఆత్మభూతుడయి వెలుంగుచున్నాడని యెంచు ఆత్మద్రష్ట ఆత్మాతిరిక్తమునకు ఉనికిలేమిచే దేనినిగాని గర్హింప జాలడు. ఏ స్థితియందు, ఏ ఆత్మయందు సర్వభూతకోటులు

అవిద్యాకల్పిత నామరూపములను వీడి కేవలాత్మరూపములై తోచునో, అట్టి ఆత్మైక్యమును దర్శించుయోగికి శోకమోహములు లేవు. తనకంటె భిన్న మైనది లేనప్పుడు, తాను నాశరహితుడై నిత్య సచ్చిదానంద రూపుడై నప్పుడు, అతడు తనదిగా భావింపవలసిన ఆత్మభిన్న పదార్థమే లేదుకావున, అట్టి అనిత్యవస్తువు నొకదానిని కల్పించుకొని అద్దాని కలిమిలేములచేతను, జన్మస్థితిభంగముల చేతను దురపిల్లవలసిన దుర్గతి సర్వాత్మద్రష్ట కెక్క డిది? దృశ్యమానమగు జగమంతయు త్రాటియందు పామువలె ఏ సర్వా ధిష్ఠాన చైతన్యమునందు కల్పితమో, అట్టి నిత్య సత్య నిరవధికాత్మ తత్త్వమే అఖిలము నని యెఱుంగుతఱి ప్రాపంచిక మోహమునకు తా కెక్కడ? అట్టి వాని జగద్భ్రాంతి నష్టప్రాయము; నష్టమే. వానికి జగము జగముకాదు. అనిర్వచనీయాద్వితీయాఖండ బ్రహ్మమే. వానికి ప్రత్యణు పరమాణువును సచ్చిదానందసుందరమై తనరారగలదు. కాని ఈ ఆత్మ యోగము దుర్ఘటము. సచ్చిదానంద జీవనమునందలి పరిపూర్ణస్థితి ఇది.

సచ్చిదానందముల యందు జీవించుటయన్న తన్ను తాను రూపఱ జేసికొనుటగా కన్పట్టవచ్చును. యథార్థమునకు తన్ను లేకుండ చేసికొనుట యన్నను దోషము లేదు. కాని ఒకదృష్టితో తన్ను రూపఱ జేసికొనుట; వేఱొక దృష్టితో తనకన్న భిన్నమని భావించు దానిని రూపుమాపి, తానే మిగులుట. విచిత్రములగు ఈ రెండు సంఘటనములును ఈ జీవితమున వాస్తవములే. తాను అహంకారమును పమ్ము చేసికొన్న గాని తన వాస్తవరూపమును చెందలేదు. ఎంతవఱకు అంతర్ముఖమగు తా ననెడి అహంవృత్తి నశింపక నిలిచియుండునో, అంతవఱకును ఆ వృత్తికి దీపకుడై దానిని గ్రహించు ఒక సాక్షి శేషించియే యుండును. ఆ అహం వృత్తి విశ్లేష మయినచో, అది కారణముగా కలిగిన సర్వమును రూపఱగా బాసిల్లెడు అఖండాద్వైత శుద్ధచైతన్యమే తన మూలస్వరూ

పము; తాను. ఇప్పుడు మిగిలినది యథార్థమైన తాను. ఇందాక నశించినది కల్పితుడైన తాను. నటకుడు రామవేషధారియై ఉన్నంతవఱకు అతని యథార్థత గోచరింపక, వాడు ధరించిన పాత్రముయొక్క గుణ వేష స్వభావములే ప్రకాశింతు చుండును. ఇవి నటకుని గుణ రూప స్వభావ ములను అచ్ఛాదించి మఱుగు పఱచుచున్నవి. వా డా కల్పితమగు రామ వేషమును తీసివేసిననే కాని వాని స్వస్వరూపము గోచరింపదు. ఇక్కడ రెండింటిలో ఒక్కటి వేఱొకదానిని కప్పుటయు, ఒకటి నశించినగాని రెండవది ప్రకాశింపకుండుటయు గమనింపదగిన అంశములు. అట్లే కల్పితము, యథార్థము అను రెండు రూపములలో ఉన్న తన రహస్యమును కూడ ఊహించుకొనవలెను. ఈ అంశమునే రామతీర్థస్వామి "ప్రతి మనుజుడును మూర్ఖశిరోమణి పాత్రను ధరించిన భగవంతుడే" అని చెప్పియున్నాడు.

ఈ స్థితి ఖండములో నుండి అఖండములోనికి, ద్వైతములో నుండి అద్వైతములోనికి, నానాత్వములోనుండి యేకత్వము లోనికి, భూత భౌతిక ప్రాణ మనోమయములగు జడవర్గము నుండి శుద్ధ చైతన్యము లోనికి, దృశ్యమునుండి దృక్కులోనికి, మర్త్యత్వము నుండి అమృ తత్వము లోనికి, అసత్తులోనుండి సత్తులోనికి, తమస్సునుండి జ్యోతి లోనికి, ప్రతిబింబమునుండి బింబములోనికి మాఱుట. కావున ఖండ మును, ద్వైతమును, అనేకమును, శరీర ప్రాణ మనో౽హంకారమయ మును, దృశ్య మును, అసత్తును, మర్త్యమును, తమస్సును అగు తాను రూపఱక తీరదు. ఖండమగు తాను రూపఱి, అఖండమగు తానుగా పరిణ మించుట. నానారూపుడగు తాను ఏకరూపుడగుట. మర్త్యుడగు తాను అమృతు డగుట. తమోమయుడగు తాను అఖండ జ్యోతిరూపు డగుట. అసత్తగు తాను సత్తామాత్రు డగుట. ప్రతిబింబమగు తాను బింబభూతు డగుట. ఇదియే యీ జీవన యోగములో పురుషుడు పడయు ఉద్గతి.

ఇప్పు డీతని ప్రపంచ జీవితము, వ్యవహారకాండము దిందు పడిన దని సామాన్యముగా తలంపవచ్చును. కాని యథార్థమున ఆ త ని కి ప్రపంచము లేనిమాట వాస్తవమే. దేనిని మనము ప్రపంచ మనియు, జగమనియు వ్యవహరించుచున్నామో, జ్ఞాని దృష్టిలో అది అఖండా ద్వితీయ బ్రహ్మమే: కూటస్థ నిత్యాత్మయే. మన దృష్టిలో కన్పడు అతని వ్యాపారమంతయు లీలామాత్రము. ఈ వ్యవహారమున అహంకార మమకారములు వానికి లేవు. కావుననే అతడు చేయుచున్నవాడువలె మాత్రమే తోచుచున్నా డనియు, యథార్థమున కేమియు చేయుట లేనే లేదనియు శ్రుతి పలుకుచున్నది. అనగా జ్ఞాని కర్మకాండము నిత్యత్వ బుద్ధితో జరుగుట లేదనియు, ఆ జరుగు దానియం దైవము వానికి సంగము లేదనియు, అందుచేతనే అది అతనికి బంధహేతువు కాక ప్రారబ్ధ భోగ మాత్రమే అగుచున్నదనియు తెలియవలయును. లేకున్న "యస్య నాహం కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే, హత్వాఽపి స ఇమాన్ లోకా న్న హన్తి న నిబధ్యతే" (ఎవనికి అహంకారము ఉండదో, ఎవని బుద్ధికి సంగము ఉండదో అట్టివాడు ప్రాణులను చంపినను చంపినట్లు కాదు; అతనికి బంధముండదు.) అనుభాషము మృష కావలసి వచ్చును.

కలగన్న అతడు మేల్కొన్న పిమ్మట ఆ కలలోని వ్యవహార మంతయు అబద్ధమని యెఱుంగును. అందలి సుఖదుఃఖములతో సంబంధము ఆవంతయు ఇప్పు డీతనికి లేదు. లేకున్నను తాను కాంచిన కల మాత్ర మాతనికి కొంతకాలము వఱకును గుర్తుండును. కొంతకాలమువఱ కాతడు దానిని ఇతరులకుకూడ చెప్పగలుగుచున్నాడు. దాని నాత డెంతగా వర్ణించిచెప్పినను అది యంతయు కల్పితమే అనియు, భ్రాంతిసిద్ధమనియు అతడు విస్పష్టముగా ఎఱుంగును. అట్లే సచ్చిదానంద జీవన యాత్రికుని ప్రాపంచిక వ్యవహారము సయితము కట్టుపడకున్నను, అందాతనికి

నిత్యత్వబుద్ధి లేదు. నిత్యత్వబుద్ధి లేక చేసెడు కర్మలు ఆభాసమాత్రములే కావున, వానియందు సంగముగాని, అది కారణముగా బంధముగాని వానికి కలుగుటకు అవకాశములేదు.

పూర్వానుభూతమైన స్వప్నజగము జాగరమునందును స్మృతిలో ఉండినను, ఆ కలగన్నవానిని బాధింపనట్లు: పూర్వము - అనగా జ్ఞానోదయమునకు ముందు వ్యవహారములో నున్న జగముకూడ, పరమార్థ జ్ఞానము సిద్ధించి దివ్యప్రబోధము కలిగిన పిమ్మట కొంతకాలము ఉన్నను అది జ్ఞానికి బాధకము కాజాలదు. ఆ జగద్వ్యవహారము నంతయు అతడు బ్రహ్మమున కంటె అభిన్నముగనే భావించి చూచును కావున, నష్టము లేదు. ఈ భావన లేని దానిని ఉన్నట్లు భావించుట కాదు. కలదానిని లేనట్లుగ తోపజేయు ఆవరణములను దాటి, సత్యమగు ఉనికిని పట్టుకొనుట. బంగారమే యథార్థముగ ఉన్నను, దానిని వ్యవహారములోనికి రానీక భూషణము తన కల్పిత నామరూపములచే దానిని కప్పివేయుచున్నది. పరమార్థదర్శి యగువాడు ఆ బంగారముపై ఆవరించిన వికారమును పాటింపక తొలగించుకొని, సువర్ణమును పొందునట్టి స్థితియే ఈ భావన. భూషణ స్వభావమును పాటింపక బంగారునకు ప్రాధాన్యము నిచ్చి విలువకట్టినప్పుడు భూషాస్వరూపము నాశము కాలేదు. కాకున్నను అది ఒనంగెడి ప్రయోజనమును అంతగా లేదు. నగ యందలి భూషణత్వము ఉన్నను లేకున్నను ఆ నగకు కారణమగు బంగారుమ కోరువానికి నగచే లాభనష్టములు లేనట్లు, జగత్కారణుడగు భగవానుని దర్శించువానికిని జగము ఉన్నను, లేకున్నను లాభ నష్టములు లేవు.

బ్రహ్మమునందు ప్రపంచాభాసము పామరుల దృష్టిలోనే కాని ''యో మాం పశ్యతి సర్వత్ర'' అని అన్నట్లు సర్వమునందును ఆత్మాతిరిక్త పదార్థము లేదని దర్శించు తత్త్వజ్ఞాని దృష్టిలో బ్రహ్మభిన్నమైన

జగ మెక్కడ ! కాబట్టి ఈ భావన అలీకభావన కాదు: పూర్ణసత్యమును అపరోక్షానుభూతికి తెచ్చుకొన్న యథార్థ తత్త్వము. మేఘములయొక్క సంకులవ్యాప్తిచే కానరాక మాటుపడిన ప్రచండ సూర్యబింబము కల్పితములైన మేఘశకలములు గాలి తాకుటచేత చెల్లాచెదరైన పిమ్మట కనుపట్టినట్లు, కల్పితములైన ఆవరణములను తొలగించుకొని అటుపై గల సుస్థిర పదార్థము ఉనికిని దర్శించు ఈ భావన మిథ్య యెట్లగును ? మఱి ఆ మిథ్యను దూరీకరించిన తథ్యమే.

ఇచ్చట ఒక సంశయము రావచ్చును. కర్మములు బీజముల వంటివి. బీజమనునది ఒకటున్నచో అది యే కాలమునకైనను మొలచి మొక్కయయి, మానయి, కాయలుకాచి, ఫలించి భోక్తవ్యము కాకమానదు. అట్లే ఎంతవఱకు కర్మములుండునో, అంతవఱకు ఆ కర్మఫలములు తత్కర్తకు అనుభోగ్యములు కాక యెట్లుండును ? కర్మబీజము వృథగా నశింపదు కావున, అది తన పరిపాకమును కుడుపకుండదనియు, అట్టిచో ఆత్మదర్శన సిద్ధినిగన్న యోగియు సామాన్యకర్మతునివలె మఱల కర్మఫలముల ననుభవించుటకు జనన మరణరూప సంసారచక్రమున తిరుగక తప్పదనియు తలంపవచ్చును. ఇది నిజమే కావచ్చును.

కర్మబీజముయొక్క శక్తి అవ్యాహతమైనను, జ్ఞానియొక్క కర్మబీజములలో మొలకరించు శక్తి చచ్చినది. అతని కర్మ బీజములు జ్ఞానాగ్నిచే మాడ్చబడినవి. "జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం త మాహుః పండితం బుధాః" వేగించిన విత్తనములు నాటినను మొలవజాలనట్లు, జ్ఞానస్పర్శచే నిర్వీర్యములైన యీ కర్మములును ఫలింపజాలవు. దగ్ధబీజములకును, అదగ్ధబీజములకును స్వరూపములో వ్యత్యాసము లేదు. పోగా ఇక ఫలమునందే తారతమ్యము. దగ్ధబీజము మొలవదు. అదగ్ధబీజము మొలచును. అట్లే జ్ఞాని కర్మలు ఆభాసమాత్రకము లనియు, అజ్ఞాని కర్మలు యథార్థము

లనియు, జ్ఞాని చేయుచున్నట్లు కన్పట్టుననియు, అజ్ఞాని సత్యముగా చేయుననియు పూర్వమే నిరూపింపబడినది. తగులబడిపోయిన త్రాడు పైకి త్రాడుగా కన్పట్టినను దానితో ఎద్దానినైనను బంధించుటకు వీలులేదు. అట్లే జ్ఞాని కర్మమును అజ్ఞులకు కర్మరూపముగా తోచునేకాని, సత్యమునకు దానియందు ఫలజనక శక్తి నశించినది. తగులబడని త్రాడు బంధింపగలదని యెల్ల రెఱింగినదే. అజ్ఞాని కర్మము ఈ రూపమైనట్టిదే కావున వానిని ఫలదానముచే కట్టివేయ సమర్థ మగుచున్నది. ఇందులకు కారణములు అహంకార నిరహంకారములే. విజ్ఞానియందు అహంకారము చచ్చుటచేత ఆతని కర్మములు ఆభాసమాత్రములై చెన్నారుచున్నవి. అజ్ఞుడు సాహంకారుడై ఒనర్చుటచే బద్ధుడగుచున్నాడు. ఈ అర్థమునే భగవద్గీత ఈతీరున నిరూపించినది.

"యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం,
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే."

— గీత. 5-12

అట్లయినను కర్మఫలమునం దాశయే లేనిచో కర్మచేయవలసిన ఆవశ్యకతయే లేదుకదా అనవచ్చును. అరురుక్షు వగువాడు అఖండాత్మజ్ఞానము కల్గుటకు కర్మలొనర్ప వలసియుండుటచే, అతడుకూడ నిరీహుడై ఒనర్పవలసి యుండునని ఇచ్చట ఎఱుంగవలయును. ఇక యోగారూఢుడగు సిద్ధుడన్నచో, ఆతనికి కామ్యకర్మ లొనర్చు అవసరములేదు కాబట్టి ప్రారబ్ధము నశించువఱకు శరీరధారణావశ్యకములగు నిత్యకర్మలు, తత్తదాశ్రమోచితములగు నైమిత్తిక కర్మలు మాత్రము ప్రవర్తించుచుండును. వీనియందైనను ఆతనికి సంగముగాని, అహంకారముగాని లేక యుండుటచేత అవి బంధకములు కావు. ఇక లోక సంగ్రహమన్న, ఆతని దృష్టిలోనికి లోకమనునది ఒకటి వచ్చినచో తదుద్ధరణకై అతడు చేయునో,

చేయుదో చెప్పలేము. అతడు చేయుటకును, చేయకుండుటకును, అన్యథా, చేయుటకును సర్వసమర్థుడు.

కాబట్టి మూఢునకును, జ్ఞానికిని కర్మ లొనర్చుటలో భేద ముండక పోవచ్చును. కలిగెడు వ్యత్యాస మంతయు ఫల విషయమునందే. ఇంకను జ్ఞానియొక్క వ్యవహారము సచ్చిదానందములలోనికి ఉద్ధరింపబడి విశిష్ట మయి ఒప్పునని పూర్వము సవిస్తరముగా నిరూపించి ఉండుటచే ఇచ్చట విరమింపబడుచున్నది.

"ఈ నిరూపణముచేత, అనగా పామరులకును-జ్ఞానులకును, కర్మ వ్యవహారమున భేదము లేదనుటచేత లోకమున మిథ్యాచారమునకు తావు చిక్కుట లేదా? ప్రతివాడును తాను పరమజ్ఞాన సంసిద్ధి నందితి నని స్వేచ్ఛాచారియై ప్రవర్తించుచు ఇంద్రియ భోగములను కుడుచుచు తిరుగాడ వచ్చును కదా?" అను శంక ఒకటి రావచ్చును. శంకయే కాదు. సత్యముగనే యిట్టి మిథ్యాచారులు ప్రబలి పరులను, తమ్మునుకూడ వచించియు, వచింపకొనియు భ్రష్టులగుచున్నారు. హిందూదేశమున ఇట్టి వేదాంతమును నటించు సన్న్యాసులు పెక్కురు ప్రబలి చిరసత్యము లగు ఉపనిష త్సిద్ధాంతములకు అపయశస్సును ఆపాదించుచున్నారు. కాని ప్రతి సిద్ధాంతాచరణ విషయమునను తథ్య మిథ్యాభావములతో జనులు స్వార్థ పరార్థములను సంపాదించు కొనుచుండుట లోకసహజము కావున, ఈ మాత్రమున మనము వెఱగొంద పనిలేదు. పొల్లునకు పొల్లును, గింజ లకు గింజలను ఏఱుకొను ప్రజ్ఞామార్గము లేకున్నచో, మనము తహ తహ పడవలయునుకాని, అట్టి రాజమార్గము ఉన్నప్పుడు మిథ్యాచారముచే ప్రపంచము దూషిత మైనదని, సత్య సిద్ధాంతమువల్ల వై ముఖ్యమును ప్రకటింపనేల? ఈ సంశయమును మనస్సునందుంచుకొనియే గీతాచార్యుడు సముచితమైన సమాధానము నొసంగియున్నాడు. స్థిత ప్రజ్ఞునికి - గుణా

తీతుఛికి - జ్ఞానికి విశిష్టములగు స్వరూపలక్షణములను అతడు చెప్పి తథ్యాచార మిథ్యాచారములను వేఱుపఱచి మన కష్టమును పాపెను.

ఎవనికి ప్రత్యేక సంకల్ప విశిష్టములైన ప్రవృత్తి నివృత్తులు లేవో, ఎవడు సుఖ దుఃఖములయందును నిందా స్తుతుల యందును, లాభా లాభముల యందును తుల్యుడో, ఎవనికి కామినులయందును, కాంచనము నందును, గాజు పెంకులందును రాగద్వేషము లుండవో, ఎవడు సర్వా రంభములను పరిత్యజించి నన్నే లక్ష్యము తొలగని యోగమార్గమున సేవించునో అట్టివాడు గుణాతీతుడు. వానిని గుణములు బంధింప జాలవు; గుణముల కాతడు కట్టుపడడు. మీదుమిక్కిలి గుణములనే అతడు శాసించును.

ఎవడు వీతరాగ భయక్రోధుడై కేవలాత్మ సంతుష్టిచేత ప్రాప్తా ప్రాప్తములయందు హర్షామర్షములను పొందడో, దేనియందును సంగము లేక కూర్మమువలె సర్వేంద్రియ విషయములనుండియు ఇంద్రియములను ఉపసంహరించుకొనుచున్నాడో, ఒకవేళ ఇంద్రియములు దేహధారణోప కారులగు సామాన్య కర్మలయందు ప్రవర్తించినను తా నా విషయేంద్రియ ములకు భిన్నుడై, తత్త్వద్రష్టయై ప్రకృతి గుణములచే ఒనర్పబడు కర్మలు తన్ను బంధింప జాలవని తలంచి ఆత్మ యోగాను సంధానముచే తన్మయుడో, అట్టివాడు స్థితప్రజ్ఞుడు. ఈ లక్షణములు లేక మిథ్యాచారి యైన దాంభికుని అసురస్వభావము దాని ఫలమును కట్టి కుడుపకుండదు. ఏ సంసార సాగర తరంగమో అతనిని తాకి పడవేయకుండదు. అట్టితటి అతని మిథ్యాచారము పలాయనమంత్రము పఠింప 'మొఱ్ఱో' యని మొత్తుకొనుచు అతడు ప్రాకృత జనునికి చిన్ని తమ్ముడై తీఱును.

కనుక శాస్త్రోక్తములైన తాత్త్విక లక్షణములను బట్టి మిథ్యా చారుని నిర్ణయించు కొనవచ్చును. కాని యీ నిర్ణయము సామాన్య జనము నకు కష్టమైన కావచ్చును. ఎట్లైనను ఇంతకన్న గత్యంతరము లేదు. సత్యమునకు బహుళ ప్రచారము తక్కువైనను, శాశ్వతమగు ఉనికియు, హృదయాకర్షణ శక్తియు దానికే కలవనుట నిక్కము.

''నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన
యమే వైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్.''

— కఠవల్లి 1-2-22.

ఎక్కువగా చదివినందువలనగాని, ఆ చదివిన దానిని ఇతరులకు ప్రవచించినందువలనగాని, కేవల మేధాశక్తిచేగాని ఈ ఆత్మ సాక్షాత్కారము లభింపదు. ఈ ఆత్మ త న్నెఱుంగుట కెవ్వడు నిరంతరాభ్యాసము చేయునో, అట్టివానికే తన స్వరూపరహస్యమును తోపింపచేయును. అనగా ఆత్మదర్శన సిద్ధిని చేకూర్చునని భావము.

# అతీత భూమికలు

ప్రకృతి పురుషతత్త్వములు సృష్టికి కారణములని సాంఖ్యదర్శనము చెప్పుచున్నది. వేదాంతదర్శనము ప్రకృతిని మాయాశబ్దముచే పేర్కొన్నది. పురుషుని బ్రహ్మమన్నది. అనేకాంశములలో ఈ రెంటికిని పోలికలు లేకపోలేదు. పురుషుని ఆత్మయనికూడ పేర్కొనవచ్చును. ఈ ఆత్మ శరీరము నధిష్ఠించి సుఖదుఃఖాది నానా విధానుభవములను పొందుచున్నదని తత్త్వజ్ఞు లెఱింగియే యున్నారు. ఆత్మ స్వరూపము సత్యము, జ్ఞానము, ఆనందము. ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు, చేతనాధృత్యాదులు క్షేత్రధర్మములు. క్షేత్రమనగా శరీరమే. ఈ క్షేత్రమును, క్షేత్రజ్ఞుని గూర్చిన చర్చ భగవద్గీత 13-వ అధ్యాయమున కొంతవఱకు చేయబడినది. అంతియేకాదు. క్షేత్రజ్ఞుడు తెలియదగిన జ్ఞేయ పదార్థమును గూర్చి కూడ ఆ అధ్యాయమున విపుల వివరణము కలదు.

క్షేత్రమని చెప్పబడిన ఈ శరీరము పంచభూతములచే ఏర్పడినట్టిది. పంచభూతములకు కారణము ప్రకృతి. త్రిగుణాత్మకమగు ప్రకృతిలో 'సత్వము, రజస్సు, తమము' అని మూడు గుణము లున్నవి. ఈ మూడు గుణములతో కూడిన ప్రకృతియే సృష్టికి ఉపాదాన కారణము. మనము క్షేత్రమని చెప్పుకొన్న శరీరము పంచీకృతములైన తమోమయ పంచభూతముల పరిణామము. ఒక్కొక్క భూతములోని సగపాలు నాలుగు భాగములయి, ఆ నాలుగు భాగములును తక్కిన నాల్గుభూతముల అర్థాంశములలో కలియుటను 'పంచీకరణము' అందురు. అనగా ఆకాశములోని సగభాగములో, తక్కిన వాయ్వాది భూతముల అర్ధములు నాలుగు

భాగములయి ఒక్కొక్క భాగము వచ్చిచేరునన్నమాట. సారాంశము : ఆకాశార్ధ భాగమున తక్కిన నాల్గుభూతముల అష్టమాంశలును వచ్చి చేరుట. అట్లే తక్కిన భూతముల విషయమునను ఎఱుంగవలయును. ఈ కలయికకే 'పంచీకరణ' మని పేరు.

ఇంద్రియములకును, మానవుడు ఉపయోగించు యంత్రములకును తోచు జగమంతయు ఈ పంచీకృత పంచభూతములచే ఏర్పడినట్టిదే. కావుననే దీనిని 'పాంచభౌతిక ప్రపంచ' మని పిలుచుచున్నాము.

మన స్థూలశరీరము —'రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము' అనెడు సప్తధాతువులతో కూడిన దనుట సుస్పష్టము. జీవుడు ఈ శరీరము నాశ్రయించి ప్రాపంచిక వ్యవహారములను నడపుచు, సుఖదుఃఖాద్యనుభవములను పొందుచున్నాడు. కాని అంతమాత్రముతో అతనికి ఈ స్థూల ప్రపంచ మొక్కటియే విహారరంగమని భావింపరాదు. దానిని మించిన మఱియొక సూక్ష్మ జగత్తు కూడ అతనికి విహారస్థానమై యున్నది. దానినే వేదాంత పరిభాషలో 'సూక్ష్మశరీర' మందురు. ఆ శరీరమునందు 'కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము' అనెడి జ్ఞానేంద్రియములైదును, 'వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ' అనెడి కర్మేంద్రియములైదును, 'ప్రాణాపానవ్యానోదాన సమానము'లనెడి ప్రాణపంచకమును, మనోబుద్ధులును - వెరసి 17 తత్త్వము లుండును. వీటితో చిత్తమును, అహంకారమును కూడ కలుపుకొన్నచో మొత్తము 19 కాగలవు. ఈ పందొమ్మిదియు కలసి సూక్ష్మశరీరమన్నమాట."కన్ను, ముక్కు మొదలగు జ్ఞానేంద్రియములును, వాక్పాణి పాదాది కర్మేంద్రియములును స్థూలశరీరమునందే కలవుకదా! వాటిచేతనే మానవుడు చూచుట, వినుట మొదలగు పనులు చేయుచున్నాడుకదా" అని ఇచ్చట ఒక శంక కలుగవచ్చును. ఇది నిజమే కాని, స్థూల శరీరమునందలి నేత్రాదిన్ద్రి

యములు స్వయముగా చూచుట మొదలగు పనులను చేయజాలవు. సూక్ష్మ శరీరము నాశ్రయించియున్న నేత్రాదీంద్రియములు చూచుట మున్నగు పనులు జరుపుటకు స్థూలశరీరగతేంద్రియములు ద్వారములు మాత్రమే. అందుకనియే స్థూలశరీరస్థములైన నేత్రాదులను ఇంద్రియ గోళకములని తత్త్వశాస్త్రము చెప్పినది. తమోగుణముచే ఏర్పడిన ఈ గోళకములకు చూచుట మొదలగు శక్తులు లేవు. ఈ గోళకములద్వారా శరీరాధిష్ఠాతయైన జీవుడు, సూక్ష్మశరీరగతేంద్రియముల మూలమున బాహ్యమున ఉన్న శబ్ద, స్పర్శ, రూపాదులను గుర్తించును. ఇంద్రియ గోళములకును, ప్రధానేంద్రియములకును కల విభేదము దిగువ విషయమునుబట్టి స్పష్టము కాగలదు.

నేత్రాదులగు పంచేంద్రియములు పంచభూతముల యొక్క సత్వ గుణాంశములచేత ఏర్పడుచున్నవి. శబ్దగుణముగల ఆకాశభూతపు సత్వ గుణాంశముచేత శ్రోత్రేంద్రియము పుట్టి, శబ్దములను వినుచున్నది. అట్లే దానియొక్క రజోగుణాంశముచేత వాగింద్రియము పుట్టి, శబ్దములను ఉచ్చరించుచున్నది. స్పర్శగుణము గల వాయుభూతము యొక్క సత్వాంశము చేత త్వగింద్రియము పుట్టి, శీతోష్ణాదిస్పర్శలను ఎఱుంగుచున్నది. దాని రజోంశముచేత పాణీంద్రియ (చేయి)ము ఉద్భవించి ఇచ్చి పుచ్చుకొనుటలనెడి కర్మలను చేయుచున్నది. రూపమే గుణముగా గల అగ్ని భూతము యొక్క సాత్వికాంశముచేత చక్షురింద్రియము (కన్ను) కలిగి, నానావిధ రూపములను తెలిసికొనుచున్నది. అద్దాని రజోగుణాంశముచేత పాదేంద్రియము కలిగి గమనము చేయుచున్నది. రసము గుణముగా గల జల భూతము యొక్క సాత్వికాంశముచేత జిహ్వేంద్రియము కలిగి, ఆఱు రుచులను గ్రహించుచున్నది. దాని రజోంశముచేత గుహ్యేంద్రియము పుట్టి దాంపత్యానందమును పొందుచు సృష్టి హేతు వగుచున్నది. గంధము

గుణముగాగల పృథివీ భూతముయొక్క సాత్వికాంశముచేత ఘ్రాణేంద్రియము (ముక్కు) జన్మించి, సుగంధ దుర్గంధములను తెలియుచున్నది. దాని రజోగుణాంశముచేత గుదేంద్రియము కలిగి, మలవిసర్జనము చేయుచున్నది. ఈరీతిగా శ్రోత్రాదులు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల జ్ఞానము నెఱుంగుటచేత జ్ఞానేంద్రియము లనియు, వాక్పాణిపాదాదులు వచనాదానాదికర్మలను చేయుటచేత కర్మేంద్రియము లనియు చెప్పబడుచున్నవి. ఈ సందర్భమున సత్వగుణము జ్ఞానప్రధానమనియు, రజోగుణము కర్మప్రధానమనియు పాఠకులు మఱువరాదు. ఇక తమస్సు, మందమును, స్థూలమును ఐయనది.

ఈరీతిగా జ్ఞాన కర్మేంద్రియము లనెడి పదియు ఒక్కొక్కటి ఒక్కొక్క భూతము వలననే ఏర్పడినవి కావున, అవి ఒక్కొక్క విషయమునే గ్రహించుచు, ఒక్కొక్క పనిని మాత్రమే చేయగలుగుచున్నవి. ఎట్లన, కన్ను చూచునేకాని, వినలేదు. చెవి వినునే కాని, చూడలేదు. అట్లే తక్కిన ఇంద్రియములును తమకు నియతములైన కార్యములకే సమర్థము లగుచున్నవి. ఇక పంచభూతముల సమష్టియొక్క సత్వగుణాంశములచేత అంతఃకరణ మేర్పడుచున్నది. కావుననే, ఆ అంతరింద్రియము కంటితో రూపజ్ఞానమును, చెవితో శబ్దజ్ఞానమును, ముక్కుతో వాసనలను, నాల్కతో రుచులను, చర్మముతో స్పర్శలను తెలియగలుగుచున్నది. ఈ అంతఃకరణము 'మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము' అనెడి నాలుగు వృత్తులను కలిగియుండును. అనగా వాయుభూత సత్వాంశముచేత మనస్సు, అగ్నిభూత సత్వాంశముచేత బుద్ధి, జలభూత సత్వాంశముచేత చిత్తము, పృథివీభూత సత్వాంశముచేత అహంకారము కలుగుచున్నవనుట తెలియదగిన రహస్యము. పంచభూత సమష్టియొక్క రజోగుణాంశము లన్నియు కలసి పంచప్రాణము లేర్పడుచున్నవి. ఈ

ప్రాణశక్తులు కర్మేంద్రియములకు కర్మల నొనర్చు బలమును చేకూర్చు చున్నవి. ఈ విధముగా పంచభూతములయొక్క సత్వ రజో గుణాంశ ములచేత నేర్పడిన 'జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, ప్రాణ పంచకము, మనోబుద్ధులు' అను పదునేడింటిని సూక్ష్మశరీరమని వేదాంతశాస్త్రము పేర్కొనుచున్నది. ఈ సందర్భమున దిగువ అంశము కూడ తెలియదగియున్నది :

ఎవడేని అందుడైనా డనుకొందము. అప్పుడాతని నేత్రగోళకము లోని భాగములు చెడిపోవునేగాని, సూక్ష్మశరీరము నందలి నేత్రేంద్రి యము మాత్రము చెడదు. అట్లే చెవిటివానియొక్క చెవి కేదో హాని కలి గినదేకాని, లోపలి శ్రోత్రేంద్రియమున కేలోపము వాటిల్ల లేదన్నమాట.

జీవాత్మ ఈ సూక్ష్మశరీరమున విహరించునప్పుడు కలలను కాంచు చుండును. దానికే స్వప్నావస్థ యనిపేరు. అప్పుడు చూడుడు; స్థూలశరీ రము, అందలి ఇంద్రియ గోళకములు, సూక్ష్మశరీరము, అందలి ఇంద్రి యములు, వాటి కవ్వల అంతఃకరణము - లేదా మనస్సు - ఈ పదార్థము లన్నియు జడములే. అనగా స్వయంప్రకాశకత్వము లేనివన్నమాట. వీటిని అన్నింటిని ప్రకాశింపజేయు అధిష్ఠానచైతన్య మొకటి వేఱుగ నున్నది. అదియే అజడమును, స్వయంప్రకాశకమును అగు జీవాత్మ - లేక ఆత్మ. దీనినే గీత "దేహీ నిత్య మవధ్యోఽ యం దేహే సర్వస్య భారత." "శరీరమంతటిలోను శరీరమును ధరించిన దేహి యొక్క చే నిత్యవస్తువు" అనుచున్నది. ఈ ఆత్మకు స్థూల సూక్ష్మములైన ఈ రెండు శరీరములే కాక, ఈ రెంటికిని కారణమైన మఱొక శ రీ ర ము కూడ ఉన్నది. అదియే అవిద్యోపాధి—అవిద్యాశరీరము.

మూల ప్రకృతి, లేదా మాయ 'శుద్ధము, అశుద్ధము' అని రెండు రీతులు కలది. శుద్ధమాయ యందలి పరబ్రహ్మ ప్రతిబింబమునకు

ఈశ్వరు డని పేరు. అశుద్ధమాయ-లేక, అవిద్య యందలి బ్రహ్మ ప్రతి బింబమునకు జీవుడని పేరు. కనుకనే "మాయోపాధిరీశ్వరః, అవిద్యో పాధి ర్జీవః." మాయ ఉపాధిగాగలవాడు ఈశ్వరు డనియు, అవిద్య ఉపాధిగాగలవాడు జీవు డనియు శాస్త్రము చెప్పుచున్నది. అనాదిగా ఆయా జీవులు చేసికొన్న కర్మసంచయము ఈ కారణ శరీరమును అంటిపెట్టు కొని యుండి, తనకు తగిన శరీరములను, సుఖ దుఃఖానుభవములను జీవులకు గలిగించుటకు కారణమగు చున్నందువలన, దీనికి కారణశరీర మని పేరు కలిగినది. జీవు డీ కారణశరీరమున విహరించు నప్పుడు, స్వప్నావస్థను దాటిన గాఢనిద్ర కలుగుచుండును. దానికే సుషుప్తి అని పేరు. అప్పుడు జీవాత్మ అజ్ఞాన స్వరూపమగు కారణ శరీరమును మాత్రమే చూచుచు ఆనందము ననుభవించు చుండును. స్థూల సూక్ష్మ శరీర సంబంధములగు ఏ వికారములును లేని స్థితి అది. ఈ విచారణను బట్టి జీవునకు ఉన్న శరీరములు స్థూల, సూక్ష్మ, కారణములు మూడు అని తేలుచున్నది. వా రనుభవించు దశలు కూడ జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అని మూడు. ఇవి సర్వ జీవులు పొందునట్టి స్థితులే. మానవులలో యోగి యైనవాడు సమాధి యనెడి నాల్గవ దశను కూడ పొందును. దానిని తురీయ మనియు అందురు. అక్కడ మహాకారణ శరీరము నాశ్రయించి కేవలానందము నందుట యోగీశ్వరుడు చేయు పని. ఆ సమాధి భేదములను, ఆనంద విశేషము లను గూర్చి ఈ రచయిత వ్రాసిన 'యోగదర్శనము'లో విశేష చర్చ కలదు. ఈ సందర్భమున గీతాకారుడు వాడిన క్షేత్ర పదము ఈ మూడు శరీరములకును వర్తించునని సాధకులు మఱువరాదు. స్థూల శరీరము, స్థూల జగము పంచీకృత పంచ భూతముల తమోమయ సృష్టి అనియు, సూక్ష్మశరీరము రజ స్సత్త్వ గుణముల సృష్టి అనియు, కారణదేహము

అవిద్యా (మలినసత్వ) మయ సృష్టి అనియు కూడ మఱువరాదు. ఇది సంగ్రహముగా చెప్పికొన్నది మాత్రమే.

మానవుడు చేయు పదార్థవిజ్ఞాన శాస్త్రపరిశోధనలు అన్నియు తమోమయ పంచ భూతాత్మక జగమునకు సంబంధించినవే. నరుడు రజోగుణ ప్రపంచమునుగాని, సత్వ గుణప్రపంచమునుగాని తొంగిచూచుట కైనను ప్రయత్నించుట లేదు. తత్త్వశాస్త్ర పరిచయము లేనివారికి తమోమయ జగత్తునకు మించిన సూక్ష్మ, సూక్ష్మతర,కారణరూప జగత్తులు ఉన్నవను స్పృహయే ఉండదు. అట్టి అతీతభూమికలు-లేదా, లోకములు ఈ శరీరమునకంటెను భిన్నముగా ఎక్కడనో లేవు ఈ స్థూల శరీరమునందే, సూక్ష్మాతి సూక్ష్మసత్వమయ భావలోకములై అవి ప్రకాశించుచున్నవి. ఈనాడు సైంటిస్టులు చేయు చంద్ర, కుజ, శుక్రాదుల గోళములకు చెందిన పరిశోధనలు కూడ తమోమయ పంచీకృత పంచభూత సంబంధములే కాని, తద్భిన్నములు కావు.

మానవుడు వెలుపలి విషయముల మీదికి పరుగులిడుటకే అలవాటు పడియున్నాడు. అంతర్దృష్టి-లేదా లోచూపు, అంతస్తత్వావలోకనము అనునవి అతనికి అభ్యాసములో లేవు. అందుచేతనే ఈ అంతస్తత్త్వ పరిజ్ఞానమునకుగాని, వాటిమీద విహరించుటకు గాని, అట్లు విహరించి అందలి రహస్యములను ఆకళించుకొనుటకు గాని అతడు కృషి చేయుట లేదు. బాహ్యవిషయ పరిశీలనమునకు మనుష్యుడు, అతని ఇంద్రియమనో బుద్ధులు, బాహ్యవస్తువులు, యంత్ర సామగ్రి, ఊహాపోహలు అనునవి తోడ్పడుచున్నవి. అంతర్లోక పర్యటనమునకు బాహ్యవస్తువుల తోడ్పాటు అవసరము లేదు. స్థూలశరీరమును నిమిత్త మాత్రము చేసికొని ఇంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకారములు, వాటివృత్తులు, దశలు-అనువాని సాయమున జీవుడు ఈ ఉత్తరోత్తర భూమికలకు ఎక్కవలసియున్నాడు.

ఈ ఎక్కుట అనెడి పనికి అందఱి మనస్సులుకూడ పనికిరావు. శతాధిక సాధనలవలన మనోమాలిన్యములను మార్చివేసినవేగాని, ఆ మనస్సునకు నైర్మల్యము చేకూరదు. అట్టి నిర్మలత్వము ఎంతెంతగా వట్టుపడునో, అంతంతగా ఈ ఊర్ధ్వలోక ప్రయాణము సాగుచుండును. తామసిక, రాజసికములైన ఆటోపములను హతమార్చి ఈషద్రజస్పర్శ మాత్రమే కలిగిన సత్వమును ఊతగా గొని ఈ ప్రయాణమును సాగింపవలయును. మనము చేయు శుభాశుభ సంకల్పములు చిత్తక్షేత్రమున ఒక్కొక్క సంస్కార బీజమును నాటుచుండును. ఇట్టి సంస్కార మాలిన్యములతో నిండిన చిత్తము స్వీయశక్తిని కోల్పోయి ఉండును. అట్టి చిత్తమును సంక్షాళనము చేయుట యోగికి ప్రథమ కర్తవ్యము. యోగి జాగ్రజ్జగత్తులో తారసిల్లు అఘాత ప్రఘాతములను తట్టుకొనుటను మొట్టమొదట నేర్వవలసి యున్నది. అట్లు తట్టుకొనుశక్తి యోగికి కలుగునప్పటికి అతని ప్రవర్తనలో చాలా మార్పులు సంభవించును. ఈ మార్పులు ప్రపంచమును ఈసడించి ఎక్కడికో పాఱిపోవుటలుగా కొందఱు భావింప వచ్చును. కాని అది అట్టి దెంతమాత్రమును కాదు. సాధకుడు ఏ ఆశ్రమము నందున్నను, ఏ వృత్తి నవలంబించి చరించుచున్నను దానిని విశిష్ట లక్షణములు కల దానినిగా చేసికొనును. దీనినే గీత—

"సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత,
కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోక సంగ్రహమ్".

— 3.25.

"పామరులు సక్తులై కర్మచేయునట్లు, జ్ఞానులు అసక్తులై లోక సంగ్రహార్థము చేయుదురు" అని చెప్పినది. ఈ సూత్రమునకు విపుల వ్యాఖ్యాన మవసరము. ఈ అసక్తత కర్మరాహిత్యము కానేకాదు; కర్మ చేయుచున్నను చేయనట్లుండెడి ఒకానొక పరమార్థ స్థితి. ఈ స్థితినే గీత—

"కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
న బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్."4.18.

కర్మ చేయుచున్నను, చేయకుండునట్టి స్థితిని, చేయకున్నను, చేయుచున్నట్టి స్థితిని ఎవ్వడు కాంచునో, అట్టివాడే బుద్ధిమంతుడును, సమస్త కర్మ నాచరించువాడును అన్నది.

ఏతావతా తేలిన సారాంశ మేమన, జీవుడు సూక్ష్మశరీరము నాధారము చేసికొని అనుభవించు స్వప్నజగమున జాగ్రద్విజ్ఞానముతో ఒప్పుట. అట్లే కారణ దేహమును అండగాగొని పడయు సుషుప్తిలో అజ్ఞానమును దూరీకరించి, తన మనోఽవస్థలను, మనస్సంస్కారములను, వాసనలను పరిశీలించి, అవి యే యే కర్మలఫలితములో తెలిసికొని, వాటిలోని,దుస్సంస్కారములను మాడ్చివేయుచు, సత్సంస్కారములను వికసింపజేయుచు ఫలితావస్థకు తెచ్చుటకు అంతర్యోగానుష్ఠానము సలుపుటయు నని తెలియ పలయును. ఈ అంశములు బాషలో విన్నప్పుడు కొంత తికమక కలుగ వచ్చును. కాని అభ్యాసము క్రమాధికముగు కొలదిని, మెట్టు నుండి పై మెట్టుకు ఎక్కుచున్న కొలదిని యోగి తాను పొందుచున్న ఊర్ధ్వగమన మును కనిపెట్ట గలుగుచుండును. అట్లు కనిపెట్టుచు, అటనుండి జారిపోక, ఉన్నతోన్నత భూమికల కెగ్రబాక సమర్థు డగుచుండపలయును. ఈ సాధన బలపడిన కొలదిని, అంతఃకరణము పరిశుద్ధము, శక్తిమంతము అగుటచే, దానికి అతీతాద్భుతశక్తులు పట్టుపడు ననుటలోను, అది మహాశక్తి యుక్తమగు ననుటలోను సందేహము లేదు. ఈ సందర్భమున చెప్ప వలసినదియు, చేయపలసినదియు ఎంతయో కలదు. ఇట్టి అతీత భూమిక లున్నవనియు, అవి అసాధ్యములు కాకపోగా, సాధనా లభ్యములనియు సూచించుటకే ఈ అధ్యాయము ఉద్దేశింపబడినందున విస్తరము విరమింప బడినది.

సృష్టి పుట్టిననాటి నుండియు ఇట్టి ఉన్నత భూమి కారోహణము చేసినవారు అల్ప సంఖ్యాకులే. వేదఋషుల తర్వాత మనము విన్నవారిలో బ్రహ్మంగారు, ఆయన శిష్యులలో సిద్ధప్ప, ఈశ్వరమ్మ మున్నగువా రగ్రేసరులు. ఇటీవల దర్శనమిచ్చినవారిలో బందరులోని దొంతులమ్మ, గుంటూరులోని మస్తాను సాహెబు, బెంగుళూరులోని శిర్వాణమ్మ, ఏర్పేడులోని మడుగుస్వామి, కురుమద్దాల పిచ్చమ్మగారలు కూడ ఈ కోవకు చెందినవారే; వారు అతీత భూమికా విహారము చేసినవారు. కావుననే, వారి అనుభూతులును, వాటిని వ్యక్తీకరించు వారి భాషయు కొంత విలక్షణముగా నుండెడివి. ఆ దశల నెఱింగినవారు వ్యాఖ్యానించిననే కాని అవి బోధపడవు. కురుమద్దాల పిచ్చమ్మగారి చర్యలను శ్రీ తత్త్వానందస్వామి వ్యాఖ్యానింపగా ఈ రచయిత వినెడి భాగ్యము నందినాడు. మడుగుస్వామిని స్వయముగా సేవించుకున్నాడు కూడను. రమణమహర్షి ఈయనకు సుపరిచితులే!

స్థూలదేహముతో చేయు భజన, పూజనార్చనాదులకంటెను, నాలుకతోను, మనస్సుతోను చేయు మంత్ర జపాదుల కంటెను సూక్ష్మ-కారణ, మహాకారణములతో చేయు ఈ అతీత భూమికావిహారము వాటికి చాల దవ్వై, యోగములో సమాధి సమయమున పొందు చిత్ర విచిత్రానుభవములకు పైన పైనగా గోచరించుచు, అటనుండి ఎడతెగని పయనము చేయు అతీత మార్గ సాధకులకు అందుబాటులో ఉండును.

షట్చక్ర రహస్యము, అం దొనర్చు ప్రయాణము కొంతవఱకు మానవుని ఈ అతీత భూమికలకు కొంపోవగలదని చెప్పవచ్చును. దీనిం గూర్చి శ్రీ విద్యాశాస్త్రము, తాంత్రిక యోగము - కొంత చెప్పినవి.

1. ఆధారము-భూలోకము. 2. స్వాధిష్ఠానము - భువర్లోకము. 3. మణిపూరము-సువర్లోకము. 4. అనాహతము-మహర్లోకము. 5. విశుద్ధము-జనలోకము. 6. ఆజ్ఞ-తపోలోకము, 7. సహస్రారము - సత్యలోకము. ఈ ఏడింటిలో విశుద్ధమువఱకు గల లోకములు పృథివ్యప్తేజోవాయ్వాకాశముల సంబంధము గలవి. అవ్వలి రెండును అతిభూతములు, ఆత్మరూపములు అగుటచే అవి తేజోమయ లోకములు. ఆజ్ఞాచక్రమున-అవ్యక్త మహదహంకారములమీద జీవుని దివ్యపరిశీలనములతోను, దివ్యక్రీడతోను అతిభూమికా విహారము ఆరంభమగుచున్నది. అటనుండి క్రమక్రమముగా ఉత్తరోత్తరము ఊర్ధ్వ ప్రయాణము చేయవలసిన భూమికలే బ్రహ్మపథములు. ఇచ్చట యోగి చేయవలసిన పరిశ్రమ విశిష్ట మయినది. ఆధారమున నిదురించుచున్న కుండలినీశక్తివి మేలుకొల్పినగాని, యోగీశ్వరుడు ఊర్ధ్వభూమికా విహారమునగాని, బ్రహ్మపథ గమనమునగాని కృతార్థుడు కాలేడు. ఈ భూమికలందు విహరించునపుడు ప్రాతిభజ్ఞానము వికసించి, కావలయు ననుకొన్నచో అణిమాదులు హస్తగతములై అపర పరమేశ్వరుడుగా యోగి తేజరిల్ల గలడు.

ఆత్మ నెఱుగకుండు టగు అవిద్య యనంగ,
ఆత్మ నెఱిగి నడచు టగును విద్య,
ఆత్మ నెఱుగువాని కగు సర్వ మాత్మయే ;
శోక మోహములును సురుగు మిత్ర ;



# మోక్షము
## (ఉపసంహారము)

—

"కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్
ఆవృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్."

— కఠవల్లి. 2.4.1

ఒకానొక ధీరుడు మాత్రమే అమృతత్వమును కోరినవాడై ఇంద్రియ విషయములకు లోబడక పరమాత్మదర్శనము చేసికొనును

బంధము, మోక్షము, సంసారము, ముక్తి అనుమాటలను మనము సాధారణముగా ఉపయోగించుచుందుము. బంధమోక్షముల స్వరూపమును గూర్చి ఈ అధ్యాయమున సంగ్రహముగా తెలిసికొనుటకు ప్రయత్నింతము. జీవులు చావుపుట్టుకలకు లోనగుచు నానాయోనులయందు తిరుగుచుండుటయే సంసారము. సామాన్యులు తలంచునట్లు ఆలుబిడ్డలతో కలసియుండుట మాత్రమే సంసారము కాదు. పలువిధములగు పుణ్య, పాప, రూప కర్మముల నొనర్చి తత్ఫలితముగా దేవ తిర్యఙ్మనుష్యాది జన్మములను పొందుచుండుటయే సంసారము. జీవులను కర్మములనెడి బంధములు కట్టివేసి, జననమరణ ప్రధానమగు దుఃఖరూప సంసార చక్రమున త్రిప్పుచున్నవి. వస్తుతః ఏ నిర్బంధము లేని జీవుడు కర్మపాశములచే కట్టుపడుటయే బంధము. అశరీరియగు జీవుడు-స్థూల, సూక్ష్మ కారణరూపమగు శరీరమున బంధింపబడుటయే బంధమని సారాంశము.

ముక్తి అన్నను, మోక్షమన్నను "విడిపడుట" యని సామాన్యముగా ఎఱుంగవచ్చును. అయినచో దేనినుండి ఈ విడ్పాటు ? ఒకడు మోక్షము నందినాడన్నచో, ఏదో బంధ మాతనికి ఆ మోక్షస్థితికంటె పూర్వ మున్నదనియే అభిప్రాయముకదా ! బంధమోక్షములు అన్యోన్య సాపేక్షములైన పదములు కనుక మోక్షపదము తత్పూర్వస్థిత బంధమును స్మరింపజేయుచున్నది. దీనికి సమాధానము : ప్రాపంచికబంధము నుండి లేదా సంసారమనెడి కట్టు త్రాటినుండి ఆతడు మోక్షము నందినాడని. కనుక, మోక్షశబ్దము ఆ జీవునికున్న సంసార బంధమును, లేదా కర్మబంధమును సూచించుచునే యున్నది. బంధము లేనివానికి మోక్షముతో పనియే లేదు. బద్ధుడైనవాని కేనాటికైనను మోక్షము(ఆ కర్మబంధముల నుండి విడ్పాటు) ఆవశ్యకమే. ఎంతవఱ కాతనికి మోక్షముండదో, అంతవఱకాతడు తాను చేసికొన్న కర్మల ఫలితమును కుడుచుచు సుఖదుఃఖములకు వశీభూతుడై, పరాధీనుడై వర్తింపక తప్పదు. పరాధీనత దుఃఖహేతువనియు, స్వాధీనత ఆనంద హేతువనియు అంద తెఱింగినదేకదా, దీని నింకను వివరించి తెలిసికొందము.

జీవులు అనేకజన్మములెత్తి, ఆ యా జన్మములయందు "దేహమే నేను" అను అహంకారమునకు లోబడుచున్నారు. తరువాత ఆ దేహము కారణముగా కలిగిన భార్యా పుత్ర మిత్రాదులయందును, గృహారామ క్షేత్రాదులయందును తగులము (సంబంధము) కల్పించుకొని, "ఇవి నావి" అని వానిని ప్రేమించుచు, వాని అధిక్యమునకై అనగా - తమ దేహము యొక్కయు, కుటుంబము యొక్కయు, సర్వాభివృద్ధులకోసమై నానావిధ పుణ్యపాపరూప కర్మములనుచేయుచున్నారు.భార్యా పుత్ర ధనాదుల యందలి ఈతగులమునే వేదాంతముఇషణత్రయమని పేర్కొనుచున్నది. ఎన్నివిధములైనకర్మములైనను సరియే- ధనము, దార (భార్య) సంతానము, అనునవి

కారణముగా ఏర్పడునవే కావున, జీవుడు ఇషణత్రయ బద్ధుడనుట సత్యము. భార్యావాంఛను దారేషణ యనియు, సంతానకాంక్షను పుత్రేషణ యనియు, ధనమందలి కోరికను ధనేషణయనియు అందురు. దారేషణ అన్నప్పుడు—స్త్రీకి పురుషునియందుండు కోర్కెనుకూడ గ్రహింపవలయును. స్త్రీ, పురుషుల పరస్పర వాంఛయే దారేషణ అగుచున్నది. కామతృప్తి కోసము, పరస్పర స్నేహమును కలిగిన స్త్రీ పురుషులకు సంతానలాభము సహజసిద్ధము కాకతప్పదు. ఆ సంతానముయొక్క సర్వాభ్యుదయములను సాధించుటకు ధన మవసరము. ఈ ధనసంపాదనము కొఱకు జీవు లెట్టి కార్యములైనను చేయక తప్పుటలేదు. కొందఱు ధర్మము ననుసరించి సత్కార్యములనే ఒనర్పగా, మఱికొందఱు కామలోభ దూషితులై అసత్కార్యములను కూడ చేయుచుండుట మనమెఱుగని విషయము కాదు. పుణ్యపాప ఫలముల నొసంగునట్టి ఈ సత్కార్యాసత్కర్మలు జీవులకు నానావిధ శరీరములను కల్పించి పలువిధములగు సుఖదుఃఖములను కుడుపుచు, సంసార చక్రమున త్రిప్పుచున్నవి. ఈకర్మముల ఫలమే బంధరూపమై, నిత్యముక్తుడగు జీవుని శరీరమున బంధించి, నానాజన్మములను ఎత్తించుచు, సుఖదుఃఖములకు గుఱిచేయుచున్నది. ఎంతకాలము కర్మబంధములు వీడవో, అంతకాలము ఆ జీవునికి ఆ కర్మబంధములనుండి విడివడుట యనునది లేదు. కనుక, అత డంతవఱకు ముక్తుడగుటకు వీలుండదు. జీవుని కట్టివేసిన కర్మబంధములు పూర్తిగా నాశనమైనప్పుడే జీవునికి ముక్తి-మోక్షము.

కర్మబంధములనుండి ముక్తిని కాంక్షించు ఈ అవసరమున, కర్మస్వరూపమును గూర్చియు కొంత సంగ్రహముగా ఎఱుంగక తప్పదు. ఇప్పట్టిన జీవులుచేయు ఏ కర్మమైనను దాని ఫలము నొసంగకుండ వ్యర్థముగా నశింపదను కర్మసిద్ధాంత సత్యమును మనము మఱువరాదు.

జీవు లొనర్చు తత్తత్కర్మములు నిష్ఫలావసానములు కావచ్చుననుట ప్రకృతికి గాని, హేతువాదమునకుగాని ఇష్టము కాదు. అది యెవ్వరికిని ఆత్మ సమ్మతమును కాదు. తాను చేసిన పనికి ప్రతిఫలముండదని చెప్పినచో, ఎవ్వడును ఏ పనిని చేయనే చేయడు కదా ? కర్మము నిష్ఫలమగుట సామాన్య మానవుడే ఒప్పుకొననప్పుడు, ప్రకృతి ధర్మమును, దైవశాసనమును దాని నెట్లంగీకరించును ? కావున కర్మమన్న తరువాత - అది మానసిక మైనను, వాచికమైనను, కాయికమైనను-దానికి తగిన ఫలమును అది యిచ్చియే నశించును గాని ఊరకే నశింపదు.

ప్రాణిమాత్ర సాధారణములైన ఆహార నిద్రాది కర్మముల నటుంచి, విజ్ఞానముగల మానవులకు జన్మసిద్ధములైన కర్మలనుగూర్చి విచారించుచో-అవి నిత్య, నైమిత్తిక, కామ్య, ప్రతిషిద్ధములని నాలుగు విధములుగా ఉండును. ఇందు సంధ్యావందన - భగవత్పూజనాదులు, దేహధారణా వసరములగు ఇతర కర్మలు నిత్యము లగుచున్నవి. వీటిని ఆచరింపక తప్పదు. ప్రమాద వశమున ధర్మభంగము, ధర్మాతిక్రమణము జరిగినప్పుడు తత్పరిహారార్థము ప్రాయశ్చిత్త రూపముగా ఒనర్చు కర్మలు నైమిత్తికములు. వీనిచే కొంతవఱకు ధర్మాతిక్రమణజన్యమగు దోషము శాంతించును. తరువాత చెప్పదగినవి కామ్యకర్మములు. స్వర్గాది పరలోకములను కోరుకొనువారు "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" మన్నగు వేద వాక్యముల ననుసరించి జ్యోతిష్టోమమనెడి యాగమును చేసి, మరణానంతరము దివ్యశరీరమునుదాల్చి స్వర్గమున దివ్యభోగములను చూఱలాడుదురు. పుత్రేచ్ఛగలవారు పుత్రకామేష్టిని చేసియు, సార్వభౌమత్వమును కోరువారు రాజసూయాదు లొనర్చియు, తమ తమ కామములను సంపాదించుకొందురు. ఇట్లే నానావిధ కామములు కలవారికి నానావిధములగు పుణ్యకర్మములు వేదములందు చెప్పబడి ఉన్నవి. ఇవి

అన్నియు కామకర్మకోటికి చెందుచున్నవి. ఆ యా కర్మములకు తగిన ఉత్కృష్ట జన్మముల నందుచు ప్రాణులు ఉత్కృష్ట ఫలములను పొందు చుందురు. యాగాదులచే స్వర్గాది ఫలములను పొందువారు, కొంతకాలము దేవత్వము నంది సుఖింతు రట. నిత్య, నైమిత్తిక, కామ్యకర్మ వర్గ మయిన తరువాత ఎన్నదగిన నాల్గవది నిషిద్ధకర్మ సమూహము. మద్య పానము, పరస్త్రీ గమనము, పరహింస మున్నగు ఘోర కార్యములు అనాచరణీయములని సభ్యతకల మానవ ప్రపంచమునకు చెప్ప పని లేదు. కావుననే ఇట్టి కర్మములను ''న సురాం పిబేత్'' ''న కలంజం భక్షయేత్'' ''న పరదారాన్ గచ్ఛేత్. న హింస్యాత్ సర్వాణి భూతాని'' మున్నగు వాక్యముల ద్వారమున'' అవి కర్తవ్యములు కావని'' వేదమే నిషేధించు చున్నది. అట్టి నిషిద్ధ కర్మములను ఆచరించిన యెడల మానవుడు పతితుడై శునక, సూకర, పశు, పక్ష్యాది అధమాధమ జన్మముల నంది దుఃఖ మనుభవింప గలడు.

ఏతావతా ఈ నాలుగు విధములైన కర్మముల ఫలములేవో తెలిసి కొనవలసి యున్నది. మానవుడు తనకు విహితములైన నిత్యకర్మములను ఆచరించినందువల్ల ప్రత్యవాయమను దోషమునుండి తప్పించుకొనగలుగు చున్నాడు. అంతేకాక, తగిన ఆత్మాభివృద్ధిని, ఆత్మశాంతినికూడ పడయ జాలుచున్నాడు. ప్రాయశ్చిత్తాది నైమిత్తిక కర్మముల నొనర్చుటవలన ధర్మాతిక్రమణజన్య దోషము శాంతించుచున్నది. ఇక కామ్యకర్మలవలన జీవులు కోరు దివ్య శరీరములు, దివ్యసౌఖ్యములు చేపడుచున్నవి. నిషిద్ధ కర్మములను చేయుటవల్ల అనిష్ట శరీరములు, (శునక, సూకర, పశు, పక్ష్యాది దేహములు) అనిష్ట ఫలములు-దుఃఖ నరకాదులు ప్రాప్తించు చున్నవి. ఈ సందర్భమున మానసిక వాచికములగు శుభా శుభ సంకల్పా

దులు కూడ తమకు తగిన పుణ్య పాప - సుఖ దుఃఖ రూపఫలములను ఒసంగగలవని మఱువకూడదు.

ఏ మానవుడైనను ఆత్మజ్ఞానము లేనివాడై దేహమే 'నే'నను భావముతో ఆ యా కర్మములకు తాను కర్తయై మనస్సుతోగాని, వాక్కుతోగాని, శరీరముతోగాని ఏ విధమగు కర్మమును చేసినను, అత డా కర్మ ఫలమునకు భోక్తయై దానిని అనుభవింపక తప్పదు. కర్మములు బీజముల వంటివి. అవి యేనాటికైనను మొలకలెత్తి, ప్రాకులై ఫలముల నీయకుండ జాలవు. కర్మములు ఫలముల నీయకుండవలయునన్న ఆ కర్మ బీజములను మాడ్చివేయుటకన్న వేఱొక ఉపాయము లేదు. నిప్పులో వేగించిన విత్తనములు ఎంత దోహదము చేసినను మొలవ నేరవని మఱువ వలదు. దగ్ధబీజ మెట్లు మొలకరింపదో, అట్లే జ్ఞానాగ్నిదగ్ధమైన కర్మమును ఫలము నీయజాలదు. జ్ఞాని కానివానిని స్వకృత కర్మములు బంధించి సుఖదుఃఖముల పాలుచేయక విడిచిపెట్టవు. ఏ కర్మము ఎట్టి ఫలము నిచ్చునో, ఏ సంకల్పము ఎట్టి చెట్టకు కారణమగునో తెలియుటకు మానవులకున్న జ్ఞానము చాలదు. అందుకే భగవానుడు గీతలలో "గహనా కర్మణోగతిః" కర్మగతి గహనమైనదని కర్మసూత్రపు దుర్గ్రాహత్వమును గూర్చి పలికినాడు. ఈ కర్మసూత్రమును ఇదమిత్థమని నిర్వచింపబోవుట అజ్ఞానమే. యోగులలో ఏ కొందఱికో మాత్రమే కొంతవఱకైనను దాని రహస్యమును ఎఱుంగుట సాధ్యము.

## ఆగామి సంచిత ప్రారబ్ధములు

ప్రాణులు అనేక జన్మము లెత్తి చేసిన ఈ కర్మలన్నియు "ఆగామి, సంచితము, ప్రారబ్ధము" అని ముత్తెఱంగులుగా విభజింప బడినవి. వీటిలో సాధారణమగు మొదటి విభాగము సంచిత మనుకొందము.

అనగా అనేక జన్మములచేత సంపాదింప బడినదని అర్థము. ఈ సంచిత
ములో నుండి కొన్ని కర్మలు మాత్రమే ఫలితావస్థకు రాగా, వర్తమాన
కాలమందున్న శరీరము ప్రారంభ మగుచున్నది. ఈ శరీరమును ప్రారం
భించిన కర్మ సముదాయమునే ప్రారబ్ధ కర్మమని పేర్కొనుచున్నారు.
ప్రారబ్ధ మనగా వర్తమాన కాలిక శరీరమునూ, ఆ శరీరముచే అనుభవింప
దగిన సుఖ దుఃఖరూప ఫలములను ప్రారంభించిన కర్మసముదాయమని
భావము. ఇట్టి ప్రారబ్ధకర్మ మంతయు అనుభవింపబడినచో, ఇక అనుభ
వింపదగిన ప్రారబ్ధము లేదు కాన, వర్తమాన కాలికమగు ఈ శరీరము
నశించుచున్నది. ఈ అంశమునే ''వాని ప్రారబ్ధ మట్లున్నది. వాని
ప్రారబ్ధము తీరినది'' అని జనులు వ్యవహరించుచున్నారు. జీవుడు
ప్రారబ్ధకర్మము ననుభవించుచు మఱల కొంతకర్మమును మనోవాక్కాయ
ములచేత సృష్టించుకొనుచుండును. అనగా మఱల కామ్య, నిషిద్ధ కర్మ
ముల నాచరించుటచేత ఇంక కొంత కర్మమును పెంచుకొనుచున్నాడన్న
మాట. ఈ విధముగా సృష్టింపబడు ఈ కర్మమునే శాస్త్రము ''ఆగామి''
అని పేర్కొనుచున్నది. ఆగామి యనగా రానున్నదని భావము. ఇది
భవిష్యత్కాలమున, ఈ కర్తచేత అనుభవమునకు తెచ్చుకొనదగిన కర్మ
మని సారాంశము. ఇట్టి ఈ కర్మము సంచితములోగాని, ప్రారబ్ధములో
గాని చేరియుండలేదు. కనుకనే దీనిని ఆగామి అన్నారు. శరీర పతనా
(మరణా) నంతర మీ యాగామి సంచిత కర్మలో చేరుచుండును. ఈ
సంచితాగాములు రెండును అనాగతము లనియు వ్యవహరింపబడుచుండును.
ప్రారబ్ధము తీరి మరణము కలిగిన పిమ్మట మఱల సంచిత రూపమైన
కర్మరాశినుండి కొన్ని కర్మలు మాత్రమే మేల్కాంచి, అనగా ఫలితావ
స్థకు వచ్చి, ప్రారబ్ధరూపమును దాల్చి శరీరమును సృష్టించుచుండును. ఈ
ప్రకారముగా ఎన్ని జన్మములు ఎత్తుచున్నను, ఈ కర్మపరంపర అంతము

లేకుండ పెరుగుచు, జీవులకు నానాజన్మములను ఇచ్చుచు,సుఖదుఃఖములను కుడుపుచుండును. ఇట్లు కర్మజనితమగు సంసారము (అనగా జనన మరణ సుఖ దుఃఖానుభవముల నందుచు తిరుగుట) అంత మనునది లేకుండ సాగిపోవుచున్నది.

అగామి, సంచిత, ప్రారబ్ధ రూపములగు ఈ కర్మబంధములను వదలించుకొనుట, లేదా కాల్చివేయుటయే ముక్తి - లేదా మోక్షము. కర్మబంధములు తెగిపోనంతవఱకు మోక్షము లేదు. అట్టివానికి సంసారమే శరణ్యము. కావున,కర్మబంధ విముక్తికి మార్గమును అరయుట ప్రతిజీవునికిది కర్తవ్యమై ఉన్నది.

ఈ సందర్భమున "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" అనెడి వేదవచనానుసారము "కర్మణైవ ముక్తిః" కర్మచేతనే మోక్షమని వాదించు కర్మవాదులగు పూర్వమీమాంసకులు తెల్పు కర్మరాహిత్యరూప మోక్షప్రకారము ఇది :

నిత్య, నైమిత్తిక, కామ్య, నిషిద్ధ రూపములగు నాలుగు కర్మములలోను కామ్యకర్మములను మానుకొన్నచో, జీవులకు ఇష్టములగు ఉత్తమ శరీరములు (దేవతాది శరీరములు) కలుగవు. అనగా జీవులు స్వర్గాది లోకములలోని దివ్యదేహములలోనికి సంసరించుబాధ ఉండదన్నమాట. ఇక నిషిద్ధకర్మముల నాచరింపకున్నయెడల అనిష్టములగు నికృష్ట (శునక, సూకరాది) జన్మములను ఎత్తవలసిన దురవస్థ ఉండదు. మఱియు ఈ కామ్య ప్రతిషిద్ధ కర్మముల పరివర్జనముచేత ఆగామియు సృష్టియగు అవకాశము తప్పుచున్నది. ఇక నిత్య కర్మములను మాత్రమాచరింపక తప్పదు. ఆచరించినను వీటికి ప్రత్యేకమగు ఫల మేదియు లేదు కావునను, ప్రత్యవాయమను దోషము పుట్టకుండుటయే ఫలము కావు

నను, ఈ నిత్య కర్మములు జీవునికి బంధకములు కావు. ధర్మాతిక్రమణము లేకుండుటచేత దోషోత్పత్తికే అవకాశము ఉండదు కాబట్టి, నైమిత్తిక కర్మములను చేయవలసిన అక్కఱయే లేదు. ఈ విధముగా కామ్య, నిషిద్ధ కర్మవర్జనముచేత ఆగామి యేర్పడకుండ పోగా, ప్రారబ్ధము అనుభవించుటచేతనే తీరిపోగా, శరీరారంభక కర్మములు లేవు కావున, ఇక పునర్జన్మమునకు అవకాశమే శూన్యమగుచున్నది. పునర్జన్మము లేనప్పుడు మోక్షము కరతలామలక మయినట్లే కదా! ఈ సందర్భమున– "ఇట్లయినను సంచితకర్మమట్లే ఉన్నదికావున, అది మఱల జన్మమునకు హేతువు కావచ్చు" నని పూర్వపక్షము రావచ్చును. దీనికి సమాధానమిది : నిత్య కర్మముల నాచరించుటలో కొంత శ్రమయు, దుఃఖమును జీవులకు కలుగుచున్నవి. ఆ నిత్యకర్మాచరణాయాస దుఃఖమే సంచిత కర్మయొక్క ఫలము. అనగా, సంచిత కర్మఫలమును జీవులు నిత్యకర్మాచరణాయాస రూపమున అనుభవించుచున్నారని భావము. నిత్యకర్మలకు ప్రత్యవాయ శాంతి దక్క ప్రత్యేకమగు ఫల మెద్దియు లేదు కనుకను, ఫలరహితముగా ఉండుట కర్మమునకు లక్షణమే కాదు కావునను, సంచితకర్మయొక్క ఫలమే నిత్యకర్మాచరణాయాస రూపముగా అనుభవింపబడుచున్నది. నిత్య కర్మల నొనర్చునప్పుడు సంకల్పములో "మమోపాత్త దురితక్షయద్వారా పరమేశ్వర ముద్దిశ్య పరమేశ్వర ప్రీత్యర్థం...." అని చెప్పబడుచున్నది కావున, ఈ దురితము సంచితరూపమైనదేఅని తెల్లమగుటలేదా! కావున వివరించిన రీతిగా - ఆగామి సృష్టింపబడకపోగా, ప్రారబ్ధము అనుభవించుటవల్ల తీరిపోవ, సంచితము నిత్యకర్మాచరణముచేతనే భుక్తమగుడు' జీవునికి కర్మసంగములేని కేవలత్వము - ఆత్మస్వరూపప్రాప్తి, కైవల్యము - లేదా మోక్షము సిద్ధించుచునే ఉన్నది కదా అని కర్మవాదులు సిద్ధాంతీకరించి యున్నారు.

కాని, పై సిద్ధాంతమునందు పెక్కు దోషములున్నవి. కామ్య నిషిద్ధకర్మ వర్జనముచేత ఆగామి సృజించబడకపోయినను, ప్రారబ్ధ మనుభవించుటచే తీరినను, సంచిత కర్మము మాత్రము నిత్యకర్మాచరణముచేత అనుభవింపబడదు. నిత్యకర్మాచరణ దుఃఖము సంచిత కర్మఫల మనుట న్యాయ్యమును, ఉచితమును కాదు. ఒక కర్మము ఫలము నీయవలయు నన్నచో, అది జీవుని జన్మకాలమున ఫలితావస్థకు రావలయును. అట్లు ఫలితావస్థకు వచ్చిన కర్మమునే ప్రారబ్ధమని మనము వ్యవహరించు చున్నాము. ఆగామి, సంచితములకు ప్రారబ్ధావస్థ రానప్పుడు అవి ఫలము లను ఎట్లీయగలుగును? గాదెలో పోసిన ధాన్యము నేలలో విత్తబడ కుండగనే మొలకలెత్తి పంటనీయగలదా? కనుక, ప్రారబ్ధరూపము నొందని సంచిత మనుభవింపబడుచున్నదనుట దోషము కాదా? మఱియు ఒక కర్మ యొక్క ఫలమును వేఱొకకర్మ ఒసంగుటయు న్యాయము కాదు. కాబట్టి నిత్య కర్మాచరణ దుఃఖమే సంచిత ఫలభోగ మను వాదము దోషభూయిష్ఠమై యున్నది.

ఒకవేళ, కొంతసేపు మీ వాదమునే అంగీకరించినను, సంకల్పములో "మమోపాత్త దురితక్షయ ద్వారా" అనుటచేత సంచితములోని దురిత మొక్కటియే హరించుచున్నదిగాని, సుకృతము హరించుటలేదే? సంచిత కర్మము సుకృత, దుష్కృతరూపమై ఉండునుగాని, కేవల దురితరూపమే అయియుండునని యెవ్వరైనను చెప్పగలరా? సంచితములో సుకృత, దుష్కృతములు రెండును ఉన్నప్పుడు, నిత్యకర్మాచరణములోని సంకల్పమునుబట్టి ఒక్క దుష్కృతమే నశింపగా, సుకృత కర్మము మిగిలి జీవునికి ఉత్కృష్ట జన్మములను కల్పింపజాలుచున్నది కదా? కాబట్టి పూర్వ మీమాంసకుల వాదము ననుసరించి చూచిన ఇనుప సంకెళ్ళు తెగి, బంగారు సంకెళ్ళు తగులొ్కనుచున్నవి. కాగా, బంధము మాత్రము

పాంచభౌతిక దేహములు (స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు) పంచ భూతములలో లీనము కాగా, తాను బ్రహ్మజ్ఞానముచేత బ్రహ్మీభూతుడై అఖండ బ్రహ్మపదార్థములో లీనమైపోవును. ఇక ఈతని సంచితకర్మ మేమగు నని ప్రశ్న పుట్టవచ్చును. అది ఈతని తత్త్వజ్ఞానాగ్నిచేత దగ్ధమై పోవుచున్నది. ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట కర్మఫలములను అనుభవింపవలసిన కర్తయు, భోక్తయు నశించుచున్నారు. భోక్తయే లేనప్పుడు ఎవ్వరికి ఈ కర్మఫలము భుక్తమగును?

## ప్రాణోత్క్రమణము

ఈ సందర్భమున ప్రాణోత్క్రమణమును గూర్చి బృహదారణ్యకము ఇట్లనుచున్నది.

> "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి,
> బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి — 4.4.6.

ఇట్టి జ్ఞానసిద్ధునికి ప్రాణోత్క్రమణము జరుగదు. అనగా అతని సూక్ష్మ, కారణ శరీరములు ఈ స్థూలదేహమును వీడినపిమ్మట, ఇంకొక స్థూలశరీరములో చొఱబడబోవు. ప్రారబ్ధము తీఱుటచే అవి రెండును భంగము కాగా, అతడు బ్రాహ్మీస్థితి నందును. ఇదియే మానవుడు పొందదగిన అమృతత్వము. ముక్తునికి ప్రాణోత్క్రమణము లేదనుటకు ప్రమాణముగా కఠవల్లిలోని దిగువ మంత్రములను కూడ గ్రహింపవచ్చును.

> "యదా సర్వే ప్రముచ్యన్తే, కామా యే ఽస్య హృది శ్రితాః.
> అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే".6.14.

ఈ విధముగా పరమార్థమగు ఆత్మ నెఱింగిన వానియొక్క హృదయములోని కోరిక లన్నియు నశింపగా, అప్పుడు అతడు (అత్ర) ఈ దేహమునందే అమృతుడై పరబ్రహ్మప్రాప్తి నందుచున్నాడు. అనగా తనకు భిన్నమగు పరమాత్మను బొందుచున్నాడని భావము కాదు. మృత్యు రూపములైన కామములు నశింపగా, సంసారకారణములు లేనందున అతడు సాక్షాత్పర, బ్రహ్మమే అగుచున్నాడని తాత్పర్యము. ఈ భావము "బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి" అను ఉపనిషద్వాక్యమును బట్టియు గ్రహింపవచ్చును. మానవుని కున్న కామముల కన్నింటికిని ఆశ్రయము బుద్ధియే కాని, ఆత్మ కాదు. అందుకే మంత్రములో "కామా యే ఽస్య హృది శ్రితాః" అని చెప్పబడినది. "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అనెడి వాక్యము ఇట్టి పరమాత్మ భూతునికి ప్రాణోత్క్రమణము జరుగదని చెప్పుచున్నది. అవిద్యా కామ కర్మలే మృత్యువునకు స్వరూపము. కర్మకు మూలము కామము, కామమునకు మూలము అవిద్య. అనగా, అవిద్య (అజ్ఞానము) చేత - ప్రకృతి పురుష జ్ఞానము లేకపోవుటచేత కోరికలు పుట్టుచున్నవి. వాటివలన కర్మలు బయలుదేరుచున్నవి. ఆ కర్మల వలన బంధము (సంసారము) ప్రాప్తించుచున్నది. కనుక, కామములు క్షీణించిన వనగా అతని అవిద్య క్షీణించిన దన్నమాటే: అవిద్యా నాశముతో మృత్యువు చచ్చి యీతడు అమృతు డగుచున్నాడని గ్రహింపవలయును.

"యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రంథయః,
అథ మర్త్యో ఽమృతో భవ త్యేతావ ద్ధ్యనుశాసనమ్." 6.15.

ఆత్మకు బుద్ధి యనెడి ఉపాధితో గల సంబంధమే యిచ్చట "హృదయ గ్రంథి" అను పేర చెప్పబడినది. అనగా ఆత్ముడు బుద్ధ్యుపాధియే తా నమకొని, అది కారణముగా కలిగిన "అహం మమ" లకు

పశుదై కోర్కెలను కోరుచుండుటకూడ గ్రంథియే. గ్రంథి యనగా ''ముడి" అన్నమాట. ఈ గ్రంథులవల్లనే కామములు కలుగుచుండును. "ఇట్టి హృదయ గ్రంథులు ఏనాడు నశించునో, ఆనాడే మరణశీలుడగు జనుడు అమృతు డగుచున్నాడు. ఇదియే పరమోపదేశము'' అని భావము. అమృతత్వ మనగా పురుషసూక్తము పేర్కొన్న పరమేశ్వరజ్ఞానమని ఎఱుంగవలయును (''త మేవం విద్వా నమృత ఇహ భవతి.").ముండకో పనిషత్తులోని దిగువ మంత్రముకూడ ఈ భావమునే వ్యక్తీకరించుచున్నది.

''భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః,
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే''. 2.2.8.

పరమాత్మ జ్ఞానమునకు, లేదా పరమాత్మ దర్శనమునకు కలుగు ఫలమును ఈ మంత్రము వక్కాణించుచున్నది. కార్యకారణ రూపముగా నున్న పరమాత్మతత్త్వము ఎఱుకపడినప్పుడు-హృదయమును ఆశ్రయించి యున్న అవిద్యాగ్రంథి (అజ్ఞానపు ముడి) ఊడిపోవును. అప్పుడు అతనికి జగత్ప్రవృత్తులను గూర్చి కలిగిన సర్వ సంశయములు తీరిపోవును. ఈ అంశమునే గీత ''జ్ఞాన సంఛిన్న సంశయమ్'' అనుచున్నది. అంతే కాదు. - అగామి, సంచిత, ప్రారబ్ధ రూపములై ఉన్న అతని కర్మలుకూడ నశించి కర్మ విముక్తి కలుగును. ప్రారబ్ధము అనుభవింప బడుచున్నను, అది జ్ఞానికి లేనట్లే లెక్క. ఈ మంత్రముకూడ పరమాత్మ దర్శన సిద్ధికి కర్మరాహిత్యము కలుగగా, ప్రాణోత్క్రమణము జరుగ దనియే సూచించుచున్నది. ఈ కర్మక్షీణతనే-గీత ''జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసా త్కురుతే ఽర్జున'' అన్నది. ''హృదయగ్రంథి" అనెడి మాట వచ్చిన ఈ సందర్భమున దిగువ పద్యములు అరయతగినవై ఉన్నవి -

*అమలు ప్రత్యగాత్మ ఆ జడాహంకృతి
నొక్కటిగ తలంచుచుంట గ్రంథి:
అట్టి రెంటి కైన అధ్యాసమున కోర్కు
లొదవి, బద్ధు( జేయు నోయి, మిత్ర !-

ప్రత్యగాత్మ తన్ను పాటింపపలె-జడా
హంకృతికి విలక్షణాత్ము( గా(గ:
అపుడు గ్రంథి భేద మయి, శంకలు నశించి,
ఆ పరాత్మ పగుదు వార్య, మిత్ర !

అధిభౌతి కాదు లైన తాపమ్ము లీ
కేవలాత్ము నెట్లు కీడు పఱచు ?
ప్రకృతి పొత్తు లేని ప్రారబ్ధ భోగిగా
మని తరించు - వాదు మాన్య మిత్ర !

ఇక ప్రకృతమును అనుసరించి జ్ఞానప్రాధాన్యమును విచారింతము.

"సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్."

''దేహి యగువాడు (జీవుడు) మనస్సుచేత సర్వ కర్మసన్న్యాసము చేసి, నవద్వార పురమగు దేహమువందు ఎట్టి కర్మమునుగాని స్వయముగా చేయకయు, ఇతరులచే చేయింపకయు సుఖముగా వివసించుచున్నాడు." ఇట్టి శాస్త్ర ప్రమాణములు పెక్కులు కర్మసన్న్యాసపూర్వక జ్ఞానని్ఠయే మోక్షప్రాప్తికి హేతువులని నుడువుచున్నవి. ఇక ఈతని అగామి కరర్మము కూడ తత్త్వజ్ఞానాగ్నిచేతనే దగ్ధమగును. ఈ అంశమును శంకరులు —

* ఈ రచయిత యొక్క అముద్రిత ద్వితీయ "మిత్రసాహస్రి."

"శశ్వ న్నశ్వర మేవ విశ్వ మఖిలం నిశ్చిత్య వాచా గురో
ర్నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజ శాంతాత్మనా
భూతం భావి చ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే,
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురి త్యేషా మనీషా మమ."

భూత మనగా సంచితకర్మను, భావి అనగా ఆగామికర్మను జ్ఞాని యగువాడు జ్ఞానాగ్నిదగ్ధముచేసి. ప్రారబ్ధానుభవము కొరకై స్వశరీరమును సమర్పించుచున్నాడని మనీషాపంచకములో గా న ము చేసియున్నారు. కొందఱు ఆగామి—సుకృత, దుష్కృతరూపములతో ఉండును కాన, ముక్త పురుషుని సుకృతమును అతని హితులును, దుష్కృతమును అహితులును పంచుకొని అనుభవింతురని చెప్పుచుందురు. ఇది అర్థవాద వాక్యమని కొందఱి తలంపు. ఇందులకు ఈ శ్లోకము ప్రమాణము—

"ప్రారబ్ధం భోగతో నశ్యేత్, తత్త్వజ్ఞానేన సంచితం,
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్ద్వేషి ప్రియవాదినోః."

ఎట్లయినను ఆ ఆగామి మాత్ర మీతనికి బంధము కాకుండుటయే మనకు అభిమతము. "సంచితాగామి కర్మలు నిష్ఫలములై నశించుట న్యాయమా"అని ఒక లఘుశంక రావచ్చును. వానిని అనుభవించెడి కర్తయే లేనప్పుడు అవి నశింపక చేయున దేమి? పూర్వమీమాంసా మతమున జీవుడు కర్తయై ప్రకాశించుచున్నాడు. ఉత్తర మీమాంస జీవునికి జీవత్వముగాని, కర్తృత్వముగాని కల్పిత మనియు, లేదా భ్రాంతిసిద్ధమనియు అనుచున్నది. అందుచేత పూర్వమీమాంసకుల దోషములు ఉత్తర మీమాంసకుల సిద్ధాంతమును బాధింపవు. కర్తృత్వమేకాక, భోక్తృత్వముకూడ లేదని శ్వేతాశ్వతరము అనుచున్నది.

"అనీశ శ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్,
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః." I. 8.

ఈ ఆత్మ "నేను భోక్తను" అని భావించుటచేత సంసారమున బంధింపబడుచున్నది. ఇట్టి ఆత్మకు ఏనాడు పరమేశ్వరజ్ఞానము - అథవా బ్రహ్మ జ్ఞానము కలుగునో, ఆనాడు అది ముక్తి నందుచున్నది.

ప్రారబ్ధము అనుభవముచే నశించినట్లు, ఆగామి సంచితములు జ్ఞానముచే నశించుటలోను విప్రతిపత్తి లేదు. జ్ఞానియొక్క ప్రారబ్ధము ఉన్నను - లేనిదానిలోనే లెక్క. ఇందుకు కారణము అతనికి కర్తృత్వ బుద్ధిగాని, భోక్తృత్వబుద్ధిగాని లేకపోవుటయే. దీనిని ఈదిగువ ఉదాహరణముచే స్పష్టమొనర్చుకొనవచ్చును. ఒక పురుషునికి ముగ్గురు పెండ్లాలున్నా రనుకొందము. ఆ పురుషుడు మరణించినచో, ఒక్కతె మాత్రమే ముండయై, తక్కిన యిరువురును ముత్తైదువలై ఉండుట హేనగునా? ముగ్గురునూ ముండమోపులు కావలసినదేకదా! అట్లే-ఆగామి, సంచిత, ప్రారబ్ధములనెడి మూడుకర్మములకును కర్తయగువాడే యిక్కడ నశించినాడు. అనగా, అజ్ఞాన కల్పితమగు అతని కర్తృత్వము నశించినది. ఇక అతనికి భోక్తృత్వమెక్కడిది? ఇట్టిస్థితిలో ఈ కర్మత్రయము ఎవ్వనికి అనుభూతికి వచ్చి యేడ్పింపగలదు? ప్రారబ్ధము మాత్రము శరీరాది సంఘాతముచే అనుభవింప బడుచున్నట్లున్నను-జ్ఞాని సాక్షిభూతుడై దాని లీలను తిలకించునే కాని, మమకారముచే ఆ సుఖదుఃఖములకు గురికాడు. కనుక, ఆత్మజ్ఞానము, లేదా బ్రహ్మజ్ఞానమే మోక్షహేతువని వేదము చెప్పుచున్నది.

"త మేవం విదిత్వాతిమృత్యు మేతి. నాన్యః పన్థావిద్యతేఽయనాయ."
"త మేవం విద్వా నమృత ఇహ భవతి." — యజురారణ్యకము.

"ఆ పరమతత్త్వము నెఱింగియే మృత్యువును దాటుచున్నాడు. మోక్ష సంసిద్ధికి ఇంతకంటెను వేఱుమార్గము లేదు. ఆ తత్త్వము నెఱింగినవాడే అమృతు డగుచున్నాడు." పై మంత్ర వాక్యములు మృత్యువును

దాటుటకును, అమృతత్వము నందుటకును బ్రహ్మజ్ఞానమున కన్న వేఱు మార్గము లేదని స్పష్టముగా చాటుచున్నవి. అట్టి ప్రమాణములు వేదోపనిషత్తులలో పెక్కు లున్నవి. అంతియే కాని, "ఈ కర్మము నాచరించిన ముక్తుడు కాగలడు. ఆ కర్మము నాచరించిన మోక్షము నందగలడు" అని యెక్కడను చెప్పబడలేదు. అట్లు చెప్పుట యుక్తిసహమును కాదు. కాబట్టి-భక్తిగాని, కర్మముగాని ఆత్మజ్ఞానమును - భగవద్విజ్ఞానమును కలిగించుటకు పరంపరాసాధనము లైన కావచ్చునుగాని, జ్ఞాన మొక్కటియే సాక్షాన్మోక్ష సాధనము.

"భక్తిర్ జ్ఞానాయ కల్పతే" భక్తి జ్ఞానమును కలిగించును. "కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః" జనకాది రాజర్షులు కర్మచేతనే జ్ఞానసంసిద్ధి నందినారు—ఇత్యాది వాక్యములు జ్ఞానసాధన మహనీయతనే చాటుచున్నవి. ప్రస్థానత్రయోద్దేశ్యము కూడ జ్ఞానోత్కృష్టతను ఉగ్గడించుటయే యని సూక్ష్మపరిశీలనముచే తెలియగలదు.

ఈ ఆత్మజ్ఞానము సంసారనివర్తకము, బ్రహ్మాత్మైక్య స్వరూపము అని "తరతి శోక మాత్మవిత్" "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" "అయ మాత్మా బ్రహ్మ", అహం బ్రహ్మాస్మి" "తత్ త్వ మసి" "ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాది వాక్యములును, తత్వజ్ఞుల అనుభవములును వేనోళ్ళ చాటుచున్నవి. ఇవి పూర్వము ఉదాహరింపబడినవే.

ఇంకొకమెట్టు పైకెక్కి చూచినచో బంధమోక్షములును, ద్వంద్వములే కావునను, ద్వంద్వ ప్రపంచము సంసారాంతర్భూతము కనుకను, బంధమువలె మోక్షము సైతము కోరదగినది కానేరదు. అవిద్యాదృష్టిని బట్టి చూచిననే ముక్తి కోరదగినది అగుచున్నది. నిస్త్రైగుణ్య పథమును మెట్టినప్పటి సమున్నతదశలో బంధమోక్షములు రెండును కల్లలే. అందుకే

"విస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః" త్రిగుణాతీత మార్గమున విహరించువారికి విధినిషేధములు లేవని తెలియుచున్నది. ఇది పరమావధూతస్థితి. ఇదే వేదాంతాతీతమైన దశ. "త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున" అని అర్జునునకు బోధించిన పరమార్థ మిట్టిదే. దీనిని "న నిరోధో, న చోత్పత్తి ర్న బద్ధో, న చ సాధకః" అన్నమాటతోను గ్రహింపవచ్చును. ఇట్టి స్థితి శతసహస్ర సంఖ్యాకులలో ఏ ఒక్క సాధకునికో మాత్రమే సాధ్యమగునట్టిది. తక్కినవా రందఱు దీనినర్థము చేసికొనుటకుకూడ సమర్థులు కారన్నచో ఆక్షేపములేదు. కనుకనే భగవానుడు గీతలలో "యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" అని మహాగంభీరముగా పలికినాడు. ఇట్టి ఉత్కృష్టమగు పరమార్థ జ్ఞానము కలుగుట సామాన్యమా మఱి? శంకరభగవత్పాదులవారు ప్రస్థానత్రయము నవలోడించి, తెలిసికొని భాష్యగ్రంథములలో అన్యదర్శనములను పూర్వపక్ష మొనర్చి, నిష్పష్టముచేసిన బ్రహ్మమీమాంసా ప్రదర్శిత మోక్ష స్వరూపమిది. ఇది అతి సంగ్రహముగా మాత్రమే ఇట నిరూపితమైనది. ఇంకను విస్తృత పూర్వపక్ష సిద్ధాంత సమన్వయ రూపమున వ్రాసినచో ఇది గ్రంథప్రాయము కాగల విషయము.

సందియములు లేని సర్వ విజ్ఞానంబు,
భయము లేని సర్వ భద్రపథము,
క్లేశ కర్మ బంధ నాశకాత్మస్థితి
నందుకొనుటె మోక్ష మగునమిత్ర!

లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.

# సవరణలు

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 18 | 10 | మధ్యమముననున్న | మధ్యముననున్న |
| 23 | 22 | నేను, నాకు | "నేను" నకు |
| 78 | 22 | తనయదు | తనియదు |
| 83 | 18 | యజ్ఞై | యజ్ఞై |
| 83 | 20 | మశ్నవి | మశ్నత్తి |
| 99 | 8 | నశించునవియు | |
| | | నశించునవియునై | నశించునవియునై |
| 109 | 13 | తదరిక్తమైన | తదతిరిక్తమైన |
| 109 | 22 | దేహాధ్యావ | దేహాధ్యాస |
| 118 | 28 | రెండ | రెండవ |
| 127 | 24 | ప్రకాశీభూములు | ప్రకాశీభూతములు |
| 130 | 11 | శ్వేతోశ్వత | శ్వేతాశ్వతర |
| 131 | 10 | ముగ్ధదగుదయు | ముగ్ధదగుటయు |
| 133 | 8 | చెప్పనో | చెప్పునో |
| 153 | 3 | — బృహదారణ్యకం | —బృహదారణ్యకం. 1.4.10 |
| 178 | 10 | క్కుడ | వెక్కుడ |
| 179 | 13 | అఖండము ఏకి, | అఖండములో ఏకి, |
| 184 | 14 | వచించియు | వంచించియు |
| 184 | 14 | వచించుకొనియు | వంచించుకొనియు |
| 208 | 1 | తప్పటలేదు | తప్పుటలేదు |
| 218 | 20 | హేతువులవి | హేతువవి |

లభ్యము లగు

## ఆచార్యులవారి ఇతర కృతులు

### శిల్పదర్శనము. రు. 12-00

''శిల్పదర్శనము-శాస్త్రగ్రంథం, ప్రామాణికమైంది. దీన్ని శిల్ప విజ్ఞాన సర్వస్వ సంగ్రహం అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. నిజంగా ఇంతటి విలక్షణదార్శనికుడు తెలుగు దేశంలో పుట్టినాడంటే తెలుగు జాతికే గర్వకారణం .... ఏవో కొన్ని పుస్తకాలు మాత్రమే ప్రామాణిక గ్రంథాలకోవకు చెందుతవి. వాటి అనువాదాలు దేశానికే గౌరవాన్ని చేకూరుస్తాయి. మీదు మిక్కిలి జాతీయ ఐక్యతకు దోహదం చేస్తవి.... మొన్న మొన్ననే హైదరాబాదులో స్థాపించబడ్డ ''హిందీ ప్రతిష్ఠాన్'' వంటి సంస్థ ఆదానప్రదాన్ కార్యక్రమానికి పూనుకొని ఏనాడో అచ్చుపడ్డ హిందీ గ్రంథాలకు బహుమానాలియ్యడంతోపాటు ఇటువంటి తెలుగు మూలగ్రంథానికి హిందీ అనువాదం చేయించి ప్రచురిస్తే ఉభయతారకంగా ఉంటుంది. అంటే ఒకటి - దాక్షిణాత్యులు హిందీ పుస్తకం ప్రకటించడం. రెండోది — ఆంధ్రుల అర్షవిజ్ఞాన ప్రతిభను చాటడం.''

— వెల్దుర్తి మాణిక్యరావు
''ఆంధ్రప్రభ'' సచిత్ర వార పత్రిక 7-2-79

### మిత్రసాహస్రి. రు. 12-00

''విశ్వహిత చరిత్ర వినరమిత్ర'' అనే మకుటంతో వ్రాయబడిన నీతి వేదాంతాది విషయములతో కూడిన వేయి పద్యముల గ్రంథము. జీవిత సంస్కారమును కోరు ప్రతివారును చదివితీరవలసినట్టిది.

### అమరావతి. రు. 5-00

అమరావతి స్తూప శిల్పవర్ణనము గల మధురకావ్యము.

## లేపాక్షి. (చారిత్రక నవల) రు. 8-00

మైసూరు, బెంగుళూరు, శ్రీ వేంకటేశ్వర, ఆంధ్ర, ఉస్మానియా, బరంపురం—విశ్వవిద్యాలయములు పఠనీయముచేసి గౌరవించి నట్టిది. భారతీయ భాషలలోనికి అనువదింపవలసిన అర్హత కలది.

## మోహనాంగి. రు. 6-00

శ్రీ కృష్ణదేవరాయల కూతురును, అళియ రామరాయల దేవేరియు నగు తిరుమలాంబా సతీమణి అద్భుత చరిత్ర. శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా, నాగార్జున, బరంపుర విశ్వవిద్యాలయములు పఠనీయము చేసిన నవలరాజము.

## మన గురుదేవుడు. రు. 5-00

బ్రహ్మంగారి చరిత్ర సంగ్రహము. శ్రీ వేలూరి శివరామశాస్త్రి ప్రభృతుల ప్రశంసల నందుకొన్నది.

## శ్రీ వీరరాఘవ వ్యాసావళి 2 వ భాగం. రు. 16-00

ఇందు అమూల్యములగు 16 శిల్ప, శిల్పక్షేత్ర వ్యాసములును, నాలుగు శాస్త్రీకవ్యాసములును కలవు. 26 చిత్తరువులు చేర్పబడినవి.

## పునర్ముద్రణ కావలసినవి

1. సాహిత్యవ్యాసములు 2. లేపాక్షి 3. కళారాధన (నవలలు) 4. [illegible]శాస్త్రములు 1, 2, భాగములు. 5. శ్రీ వీరరాఘవవ్యాసావళి 1 వ భాగము. 6. మూడుకావ్యాలు. (రామాయణ, భారత, భాగవతాల సమీక్ష) 7. శ్రీవీరబ్రహ్మ సుప్రభాతం. 8. తోరణము (ఖండకావ్యం) 9. విరంచిన విజయము. 10. ఆసియా జ్యోతులు.

యోగదర్శనము. రు. 15-00

# భారత ఉపరాష్ట్రపతి
# శ్రీ బి. డి. జట్టి మహోదయుల అభిప్రాయము

డాక్టరు కె. వి. రాఘవాచార్యులుగారు తత్త్వ, యోగ, శిల్ప శాస్త్రములలో గభీరాభినివేశముగల వ్యుత్పన్న పండితులు. సృష్టిలో అభివ్యక్తములగుస్థూల సూక్ష్మప్రకృతుల అవగాహనకై వారుచేసిన నిశితపరిశోధనకు, నిరంతర ప్రయత్నమునకుఫలితమే ప్రకృతమగు యోగదర్శన గ్రంథము.

యోగశబ్దము విస్తృతార్థము గలది. యోగలక్షణము బహుముఖీనమైనది. యోగమునకు సంబంధించిన వివిధ విభూతి విశేషములను విశ్లేషించి మానవవ్యక్తిత్వ సర్వతోముఖ వికాసమునకు వాటి ప్రాముఖ్యమును అనన్య సాధ్యములగు స్వీయ భాషాశైలిలో గ్రంథకర్త ఇందు వివరించినారు.

మనలో అనేకులు తమ మనఃప్రవృత్తి లాడించినట్లెల్ల ఆడుచు తమ శక్తిసామర్థ్యములను వమ్మొనర్చుకొందురు. మనస్సును అదుపులో పెట్టుకొని - భవ్యము, దివ్యము, అనంతము అయిన ఆత్మతత్త్వమును దర్శించుటకు ఆ మనస్సు నొక సముచిత సాధనము చేసికొనవలయును. అందుకు నిరంతర యోగసాధనమే శరణ్యము. యోగపరిజ్ఞాన సముపార్జనమునకు ఈ గ్రంథ మెంతగానో తోడ్పడ గలదు. అత్యంతోపయోగకారి యగు ఈ గ్రంథమును అనేకులు విశేషశ్రద్ధతో పఠించి ప్రాచీన యోగవిద్యా వైభవముచే ఉత్తేజమును పొందుదురుగాక !

గ్రంథకర్తయైన డాక్టరు కె. వి. రాఘవాచార్యులుగారిని హృదయపూర్వకముగా అభినందించుచు - వారికి నా శుభాకాంక్షలను అందజేయుచున్నాను. మన సాహితీ సంస్కృతులకు శ్రీవారి సేవాభాగ్యము చిరకాలము సిద్ధించుగాక !

న్యూఢిల్లీ, 10-8-1977. (సం) బి. డి. జట్టి

## YOGADARSANAMU, 15-00

## OPINION

Vice - President, India
New Delhi
August 10, 1977.

Dr. K. V. Raghavacharya is an erudite scholar who is deeply interested in philosophy, yoga and sculptrue. The present book 'Yogadarsanamu' is the result of his intense quest and continuous effort to perceive the gross as Well as the subtle manifestations in nature. The word 'Yoga' covers a vast expanse and the author, in his own inimitable style and language, has given a detailed analysis of the various facets of yoga and its importance for the all round development of human personality. Most of us allow our minds to do whatever they want and fritter away our energies. Therefore, it is necessary that 'Yoga' should be constantly practiced in order to gain control of the mind and make it a fit instrument to help us in the realisation of the self of man, the pure, the ever holy, the infinite and the immortal. This book is a valuable contribution to our knowledge of yoga. I hope this interesting work will be read widely and the readers will be inspired by the pristine glory of yoga.

I offer my hearty congratulations and good wishes to Dr. K. V. Raghavacharya and wish him many more years of useful service to the cause of literature and culture.

(Sd.) B. D. Jatti.

# MITRASAHASRI

—

"Kalaprapurna" K. V. Raghavacharyulu is not only a reputed scholar in Philosophy, Sculpture and Yoga, but also a well-known poet and critic in Telugu. The book under review is one of his latest and precious presentations to the Telugu literary world. This contains 1034 gnomic verses in 'Aataveladi' metre, a forte of Vemana, under 72 captions. Written in elegant, graceful and mellifluous Telugu each verse ends with the words 'VINARA MITRA'. The subjects dealt with are variegated in nature, didactic, religious, philosophical, yogic, social, domestic and sarcastic. The verses abound with arresting axioms, wise and crisp sayings, and illustrative similies.

A treasure - house of wisdom, this book, coming from the pen of "Abhinava Vemana", deserves to be treasured in every Telugu house.

B. KUTUMBA RAO

— "TRIVENI.,

శ్రీ వీరరాఘవ వ్యాసావళి రు. 12-00

మొదటి భాగము సాహిత్యఖండము పై




శ్రీ వేంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి

# అభిప్రాయము

—

శ్రీ వీరరాఘవ వ్యాసావళి (సాహిత్యఖండము) అనెడి గ్రంథము పది భాగములు చదివితిని. నిశితమైన విజ్ఞానముతో, విశాలమైన చూపుతో, శాస్త్రమర్యాదలకు లోబడి వెలువడిన వ్యాసరాజము లిట్టి వేళ్లంచెపాటిగనో గోచరింపగలవు. ఈ పది వ్యాసములును కవిత్వమునకు సంబంధించిన పద్యాను - లక్షణగ్రంథ విమర్శనములవలెఁ గాక-ఏదియో గద్య కావ్యము చదువుచున్నట్లనిపించుటకు అందలి మృదు మధుర పదగుంఫనము హేతువు. తక్కిన వ్యాసములు వీనికి తీసిపోవని యీ వ్యాస దశక పరిచయమున దృఢముగా చెప్పఁగలను.

ఇంచుమించుగా ఈ వ్యాసములు (28) విమర్శనాత్మకములు కాని, కాలక్షేపమునకు పుట్టినవి కావు. అట్టి విమర్శనములను చక్కఁగా అవగాహన మొనర్చికొనవలయునే కాని - వానిపై విమర్శన అసాధ్యమును, అనుచితమును. చదువుచున్నప్పుడు గలిగిన ఆనందము మాటలలో నిముడునది కాదాయె ! చక్కని భాషలో ఎచ్చటను ఒడుదొడుకు లేని విధమున నడచిన యీ వ్యాసావళి విద్యార్థులకే కాదు, విద్వాంసులకును ఉపాదేయమని నా యాశయము.

రామారావుపేట,<br>కాకినాడ.<br>2—9—1970

ఇట్లు,

వేంపరాల సూర్యనారాయణ శాస్త్రి

